# M. Saltykov - Shchedrin Tales

Translated by

R. Krishna Murthy

Visalaandhra Publishing House
VIJAYAWADA

# వి ష య సూ చి క





# పరిచయం



"అహింసావ్రతులు. మీరు మాంసం తినడం ఏమి మర్యాద స్వామీ ?"

"మాంసం ! కల్లుచుక్క పడనిదే మాంసానికి మజా రాదు"

"కల్లుచుక్క కూడా అలవాటైందీ ?"

"చుక్క వేసిన తర్వాత చక్కని సాని ఉంటేకాని అందం లేదు"

"సరిసరి ! సానికూడానా ? ఐతే స్వామీ సానిదాని కివ్వడానికి డబ్బెక్కడిది ?"

"దొంగతనం చేస్తాం. జూదమాడి సంపాయిస్తాం"

"దొంగతనంలోనూ, జూదంలోనూ అందెవేసినట్లు కనిపిస్తున్నారే !"

"అన్ని విధాలా భ్రష్టుడైనవాడికి అంతకన్న దారేముంది ?"

ఇది భోజునికి కాళిదాసుకూ జరిగిన సంవాదమని చెపుతారు. ఈసంవాదం ఒక శ్లోకరూపంలో ఉంది. వ్యసనపరుడైన రాజుకు బుద్ధి చెప్పడానికి కవి అల్లిన కథ ఇది.

రాజనీతిని ప్రబోధించడానికి ఏ అజ్ఞాత మహాకవో కల్పించిన పంచతంత్రం ప్రపంచ సాహిత్యానికే మకుటాయమానం.

సమాజంలోని ఎగుడు దిగుడులను, కలవారి కావరాన్ని, లేనివారి దైన్యాన్ని, అధికార దర్పాన్ని సునిశితంగా విమర్శిస్తూ పిట్టకథలు చెప్పిన ఈసప్ ప్రపంచ సాహిత్యంలోనే వందనీయుడుగా పేరుగన్నాడు.

వాచ్యంగా చెప్పిన నీతికన్న వ్యంగ్యంగా చెప్పిననీతి మనసుకు హత్తుకొంటుంది. సూటిగా చెప్పిన మాటకన్న వ్యాజోక్తి సూటిగా తలుగుతుంది. ప్రత్యక్షోపదేశంకన్న అన్యాపదేశం చక్కగా పనిచేస్తుంది.

అందుకనే పంచతంత్రానికీ, ఈసప్ కథలకు అంత ప్రపంచ ప్రఖ్యాతి. అంతగౌరవం.

సాల్టికోవ్ ష్చెడ్రిన్ ఈ అన్యాపదేశంలో, వ్యాజోక్తిలో, వ్యంగ్య రచనలో సిద్ధహస్తుడు.

ఇప్పటికి సుమారు 80 సంవత్సరాలకు పూర్వం రష్యాలో ధనవంతుల దర్పాన్ని, పేదల దైన్యాన్ని, రైతుల హీనస్థితినీ వివరిస్తూ మన పంచతంత్ర ఫక్కీలో రాసిన కథలు ఈ "గొప్పవారి గోత్రాలు".

పరిగపిల్ల వైరాగ్యం, గద్దరాజుగారి కళాపోషణ, భల్లూకరాజ్యం, ఆదర్శవాది జెల్ల అనే ఈ కథ మకుటాల లోనే ఆయన వ్యంగ్యధోరణి ఆదినుంచీ ప్రస్ఫుటమవుతుంది.

ఆనాటి తాత్వికులు, రాజకీయ వాదులు, విప్లవ వాదులూ కూడా ఎలా ఊహాలోకంలో విహరించేవారో ష్చెడ్రిన్ నిశితంగా తమ కథలలో వివరిస్తారు.

ఈ కథలలో కొన్ని కేవలం రష్యా వాతావరణానికే పరిమితం. కాని ఎక్కువ కథలకు దేశకాలాది అవధులు లేవు. అవి అన్ని కాలాలకూ, అన్ని దేశాలకూ వర్తిస్తాయి.

ఇందులో మొదటి కథ ఇద్దరు ఉన్నతోద్యోగులకు నిర్మానుష్యదీవిలో తిండి పెట్టిన అన్నదాత కథ.

నెత్తిమీదికి ముత్తివచ్చినప్పుడు కూడా పేదరైతు కనిపించేసరికి అధికారులలో పెల్లుబికే అధికార దురహంకారం, పేదరైతు నమ్రత, హృదయ విదారకంగా వర్ణించాడు రచయిత.

రైతుల కన్నీటిగాధను వివరించేవి కాక సత్యాన్వేషణ, ముసలితట్టు అనే కథలు.

ఈ కథల్లో అన్ని దేశాలకు, అన్ని కాలాలకు వర్తించే వాటిని అనువదించేటప్పుడు కొద్దిపాటి స్వేచ్ఛను తీసుకొన్నాను.

ఉదాహరణకు కుచేల పుల్లయ్య, కుబేర పుల్లయ్యకథ. "ఐవాన్ ది రిచ్ - ఐవాన్ ది పూర్" అనే కథ కది అనువాదం. ఐవాన్ అనేది రష్యాలో సామాన్య జనవాచకం.

అలాగే "క్రామోల్నికోవ్" అన్న దాన్ని నేను "పితూరీరావు"గా అనువదించాను. "క్రామోల్నిక్" అంటే రష్యాభాషలో పితూరీదారు, లేక తిరుగుబాటుదారు అని అర్థం.

ఇలాగ అక్కడక్కడ ఔచిత్యానుగుణమైన చిన్న చిన్న మార్పులు తప్ప మిగిలినదంతా యథామూలం.

విప్లవానికి పూర్వం రష్యా ప్రజల ఆలోచనలను విప్లవ పథానికి మళ్ళించిన కొద్దిమంది ప్రసిద్ధ రచయితల్లో సాల్టికోవ్ ష్చెడ్రిన్ ఒకరు. సోవియట్ పాఠకులకే కాక ప్రపంచ పాఠకులకే అభిమాన పాత్రమైన ష్చెడ్రిన్ రచలు ఇప్పుడు ఆంధ్ర పాఠకులముందున్నాయి.

—అనువాదకుడు.



# పెద్ద అధికార్లకు పేద రైతు విందు

ఒకప్పుడు ఇద్దరు పెద్ద అధికార్లు ఉండేవారు. ఉత్త బడుద్ధాయిలే అనుకోండి— వాళ్ళు ఓ రోజున తెల్లారేసరికి నరసంచారం లేని ఒకానొక దీవిలో పడ్డారు.

వాళ్ళు ఇన్నాళ్ళూ జననమరణాల పట్టీలు తయారుచేసే కచేరీలోనే బ్రతుకు వెళ్ళమార్చారు. ఆ కచేరీలోనే పుట్టారు. పెరిగారు. ముసలివాళ్ళయ్యారు. అంచేతనే బయటి విషయాలు ఏవొకటీ వాళ్ళ బుర్రలకి పట్టలేదంటే వింతకాదు. ఇక వాళ్ళకి తెలిసిన మాటా, అనేమాటా ఒకటే ... 'ఆం మీ దరఖాస్తుని మంజూరు...' ఇదే !

ఇటీవల ఆ కచేరీ ఉత్త దండగమారిదై రద్దు అయింది. దాంతో మన అధికార్ల ఉద్యోగాలూ ఊడిపోయాయి. తమకు రావలసిన ఫించన్లు చేతబట్టుకొని సెంట్ పీటర్స్బర్గ్ లో చెరోచోట మకాం పెట్టారు. ఆ తర్వాత, ఇంతకుముందు చెప్పినట్టు హఠాత్తుగా వాళ్ళిద్దరూ నర సంచారంలేని దీవిలో పడ్డారు. ఎండపొడ తగిలేసరికి లేచారు. తీరా లేచి చూసేసరికి యిద్దరూ ఒకే గొంగళికింద ఉన్నామని గుర్తించారు. సరి, వాళ్ళ ఆశ్చర్యానికి అంతులేదు. ఏం జరిగిందో ఏమీ వాళ్ళకి అంతుబట్టకపోయినా మామూలు ధోరణిలోనే బాతాఖానీ సాగించారు.

'హారి భగవంతుడా! చూశారూ దొరగారూ! నేను నరసంచారంలేని దీవిలోపడ్డానని చిత్రమైన కలగన్నాను.' ఈ మాటలంటూనే ఎగిరి గంతువేశాడు. రెండో ధొరవా రున్నూ అలాగే ఎగిరి గంతువేశాడు.

'ఓరి దేఁవుడా! ఇంతకీ మనం ఎక్కడున్నట్టు?' భయంతో ఆవలించారు యిద్దరూ. ఒకరొకరు గిల్లి చూసు కొని యిద్దరూ 'ఇది కలగాదు' అని తేల్చారు. 'ఇది కేవలం కల' అని భ్రమించాలని ఎంతగానో ప్రయత్నించారు. కాని కొట్టొచ్చినట్టు కళ్ళకి దీవి కనిపిస్తుంటే నమ్మకుండా ఎలా వుంటారు? ఇటు చూస్తే నురుసులు క్రక్కే సముద్రం. తాము న్న ఆ కొంచెం నేల మినహాయిస్తే అటు ఇటు మహా సాగరం కన్పిస్తోంది. కచేరి వదిలాక మళ్ళా యిన్నాళ్ళకి తొలి సారిగా మన పెద్ద అధికార్లు కన్నీళ్ళు పెట్టారు. ఒకరొకరు

నఖశిఖపర్యంతం చూసుకొన్నారు. ఇద్దరూ రాత్రిదుస్తుల్లోనే వున్నారు. ఇద్దరి మెడల్లో పతకాలు వేలాడుతున్నాయి.

'కాఫీ తాగాలన్నా మనదగ్గ రేముంది?' అంటూ అనుకొంటూ, స్థితిగతులు మరోసారి గుర్తువచ్చి, బావురుమన్నాడు.



'ఇప్పుడేం చేద్దాం మరి? అర్జంట్ రిపోర్టు రాసిపంపినా లాభం లేదుకదా!' ఏడ్పు గొంతుతో అన్నాడు.

రెండో అతను అన్నాడు 'ధొరవారూ! తమరు ఇలా తూర్పుగా వెళ్లండి. నేను ఇలా పడమరకి వెళతాను. ఉభయులం సంజవేళకి ఇక్కడికే చేరుకొందాం. ఏదో ఇంత తిండీ గిండీ దొరక్క పోతుందా చూద్దాం'.

వాళ్లిద్దరూ ఆ తర్వాత తూర్పూ పడమరల్ని కనుక్కోడానికి నానా తిప్పలు పడ్డారు. ఊఁహు. అంతు దొరికితే వొట్టు!

'ఇదుగో! తూర్పు తెలుసుకోవాలంటే నువ్వు ఉత్తరానికి ముఖంపెట్టినుంచో! నీ కుడిచేతివేపే తూర్పు దిక్కు' అని పై అధికారి ఒకానొక సందర్భంలో చెప్పిన మాట సదరు దొరల్లో ఒకరికి జ్ఞాపకం వచ్చింది. సరే, ఆ ఉత్తరదిక్కు ఎటు వుందో ఇద్దరూ వెతికారు. ఇటు కాదని అటు, అటు కాదని ఇటు ఎనిమిది దిక్కులూ వెతికారు. అయితే వాళ్ల బ్రతుకంతా కచేరీ గోడలనడుమ పుస్తకాల బొత్తుల్లోనే గడిచిపోవడంచేత దిక్కే తోచలేదు మరి!

ఆఖరికి రెండోధొర 'చూడండి ధొరగారూ! మీరు ఇక్కడినించి ఎడంవేపుకి వెళ్ళండి, నేను కుడివేపుకి వెళతాను.

ఇదే మిగిలిన పద్ధతి' అని చెప్పాడు. ఈ రెండో ధోరణి కొంచెం చురుగ్గా వుండడానికి కారణం వుంది. జనన మరణాల కచేరీలో పనిచేస్తూనే ఈయన ఒక అనాధబాల పాఠశాలలో పిల్లలకి అక్షరాలు నేర్పాడు కొన్నాళ్ళు. ఆ కాస్త అనుభవం మూలాన మొదటి ధోరణి కంటే ఈయన కొంచెం మెరుగు.

ఇలా అనుకోవడంతో, చెరో వేపుకి సాగిపోయారు. కుడివేపుకి వెళ్ళిన అధికారికి ఓ చోట పొడుగ్గా నిటారుగా పెరిగిన చెట్లు కనిపించాయి. ఓ పండు కోసుకు తిందామను కొన్నాడు. కాని, కొమ్మలు చాల ఎత్తున ఉన్నాయి. పండు అందదు. ఎలాగ ? చెట్టెక్కి కోసుకుందామని ప్రయత్నించాడు. ఫలితం, వొంటి చొక్కా చిరిగిపోయిందంతే! సరే, ఇది లాభంలేదని ముందుకు సాగిపోయాడు. అల్లంతదూరాన కొండవాగు కనిపించింది. చిన్న చేపలు బిలబిలలాడుతున్నాయి. 'ఆహా! ఏం చేపలు! ఇవి నా బసలోనే ఉంటేనా ?' అయ్యగారికి నోరూరింది. మళ్ళా ముందుకు సాగారి అడవిలోకి వెళ్ళాడు. అక్కడ పొజులు, గువ్వలు, కుందేళ్ళూ కోకొల్లలుగా కనిపించాయి.

'ఏం వాటంగా వున్నాయబ్బా పిట్టలు' కడుపు నక నకలాడుతోంటే కాసేపు గొణుక్కున్నాడు. ఏం లాభం? ఉత్త చేతుల్తోనే అక్కణ్ణించి వెనక్కి తిరిగాడు. అనుకొన్న చోటికి వచ్చాడు. అంతకుముందే మొదటిధోరణి అక్కడకు చేరుకొన్నాడు.

'ఏమండీ దొరగారూ తమరి కేమైనా కలిసివచ్చిందాండీ ?' అనడిగాడు.

'ఊఁహు ! పిసరుకూడా దొరకలేదు. ఒక్క *మాస్కో చండకవిలె పాతకాపీ మాత్రం దొరికింది.'

ఇద్దరూ నడుం వాల్చారు. కాని, ఆకలిమంట ఆగుతుందా ? బుర్రలు వేడెక్కిపోయాయి. మనస్సు పరి పరి విధాల పోయింది. 'తమకు రావలసిన ఫించను డబ్బు ఎవరు తెస్తారు ?' ఇదో ఆలోచన ! ఇంతకుముందే చూసిన చేపలు, పిట్టలు గుర్తుకు వచ్చాయి.

'చూశారూ దొరగారూ ! మనుషులికి కావలసిన ఈ తిండి – రెక్కలు విప్పుకొని ఆకాశంలో ఎగురుతుందని, నీళ్ళలో ఈదుతుందనీ, చిటారు కొమ్మని వేలాడుతుందనీ ఎవ రనుకొన్నారండీ ' అన్నాడు ఒకతను.

'నిజం దొరగారూ ! చెప్పొద్దూ నే ననుకొన్నది ఏమంటే – మనం తినే కైమాలు, లడ్లూ ఇవన్నీ చెట్లే కాస్తున్నాయని ఇన్నాళ్లూ నా నమ్మకం.'

'చూశారూ ! మరోమాట ! కాస్త మాంసం పులుసు కావాలంటే – ముందస్తిగా వలవేసి పట్టాలన్నమాట ? అ పట్టినదాన్ని కోయాలన్నమాట ? చర్మం వొలవాలన్న మాట ! మసాళా గిసాళా పట్టించి తీరిగ్గా వొండాలన్నమాట ! అప్పుడా... అబ్బబ్బ ! ఇంత కాండ ఒక్క మనిషిన్లు ఎలా అవుతుందండీ !

'మాటలటండీ మరి ? ఎలా అవుతుంది ?'

---

*'మాస్కో-చండకవిలె' అనే పత్రిక 1756 ప్రాంతంలో మాస్కో నించి వెలువడేది.

ఆతర్వాత ఇద్దరూ మౌనంగా కునుకుదామనిచూశారు. కాని, ఆకలి వేయినోళ్లు తెరిచి హాహాకారాలు చేసింది. దోరగా వేగిన మాంసం వేపుళ్లు, కమ్మటి చేపల పులుసు, నోరూరించే కైమా ఉండలు, ఘుమఘుమలాడే వంటకాలు వాళ్ల కళ్లముందు దొంతర్లు దొంతర్లుగా కనిపించాయి.

'చూశారూ! ఈ పళాన మన చెప్పుతోళ్లే తినబుద్దేస్తోందనుకోండి!'

'నిజం కాదటండీ! చూశారూ! చేతి తొడుగులు – చిరుగు పట్టినవైనాసరే – తినడానికి సందేహంలే దనిపిస్తోంది.'

హఠాత్తుగా ఒకర్నొకరు కళ్లార్పకుండా చూశారు. ఆ కళ్లల్లో క్రౌర్యం తాండవిస్తోంది. పళ్లు పటపటలాడించారు. గొంతుల్లో హుంకారాలు పుట్టాయి. ఎలక మీదికి దూకే గండుపిల్లిలాగా యిద్దరూ ఒకరిమీదికి ఒకరు దూకి రక్కుకున్నారు. ఒంటిమీది బట్టలు చిరిగి పీలికలై గాలిలో తేలిపోయాయి. హుంకారాలు మిన్నుముట్టాయి. రెండో దొర మొదటి అధికారిని కొరికాడు. మెళ్లో పతకం పెరికి మింగేశాడు. ఈ సంకుల సమరం ఒకరి కొకరికి నెత్తురు కళ్ళబడేసరికి చప్పగా ఆగిపోయింది. 'ఇలా అయితే ఒకరి నొకరునమిలి మింగేస్తాం' యిద్దరొకేసారి అనుకొన్నారు.

'చూశారూ! ఇంతకీ మనం యిక్కడికి ఎలావచ్చామో కదా! మనల్ని యిలా నెట్టిన ఆ పిశాచపు వెధవ ఎవడో కదా!'

'ధొరగారూ! మనం బాతాఖానీలో పడకపోతే మాత్రం యిక్కడ హత్యలూ, కూనీలూ జరిగిపోతాయి. సందేహంలేదు సుమండీ!'

'ఐతే, తమరే సంభాషణ ప్రారంభించండి.'

'అలాగే! చూశారు దొరగారూ! ఈ సూర్యుడున్నాడే మొదట ఉదయిస్తున్నాడు. తర్వాత అస్తమిస్తున్నాడు. ఇలా వరసవారీగానే ఎందుకు జరుగుతోంది? మొదటే అస్తమించి తర్వాత ఎందుకు ఉదయించడో? ఈ విషయంలో తమ అమూల్యాభిప్రాయాన్ని విశదీకరించ కోరతాను.'

'తమ ప్రశ్న ఉత్తచెత్త ధొరగారూ! తమరు పొద్దున్నే లేచి కచేరీకి వెళ్ళి పనిచూసుకొని ఆ తర్వాత గదా పడుకొంటున్నారు. అలాగే ఇదీ.'

'ఔనూ? ఇలాగే ఎందుకు జరగాలీ అంట! ముందే చక్కాపడుకొని హాయిగా కలల్లో తేలి ఆ తర్వాతనే లేవకూడదా అని నా ప్రశ్న!'

'ఆఁ...ఊఁ...ఆఁ...ఆఁ...కచేరీలో పనిచేసేటప్పుడు నా అనుభవాలూ, జ్ఞాపకాలూ ఏమంటే- 'ఇప్పుడు తెల్లారింది. పొద్దెక్కుతోంది. ఇప్పుడు భోజనం వస్తుంది. ఆ తర్వాత పడక-' ఇలాగ ఒక క్రమం ఉండేది-'

'భోజనం' మాట మళ్లా వినిపించడంతోటి వాళ్ళ మొఖాలు ఎండిన ఖర్జూరాల్లాగా ముడుచుకు పోయాయి. మాటలు ఆడిపోయాయి.

కాసేపటికి తమాయించు కొన్నారు.

'చూశారూ ఓ సారి ఓ డాక్టర్ ఏమన్నాడంటే 'మనిషి తన వొంటిలోపలి రసగ్రంథుల్నే జీర్ణించుకొని చాల కాలం బ్రతకవచ్చు' అని. నాకిప్పుడు గుర్తొచ్చింది'.

'ఎలా ? ఎలా ? మళ్లా చెప్పండి.'

'ఈ రసగ్రంథులు మరికొన్ని రసాల్ని ఉత్పత్తి చేస్తా యనిన్నీ, అవి మరిన్ని కొత్త రసాల్ని తయారు చేస్తాయనిన్నీ, ఇలా నీరసం వచ్చేవరకూ ఈ రసోత్పత్తి జరుగుతుంటుందనే నా ఉద్దేశం.'

'ఆ తర్వాత ?'

'ఆ తర్వాత జరిగేదే ముంటుందండి ? కడుపారా ఆర గించడమే తరవాయి !'

'దాం –'

ఇలా వాళ్ళు ఏ విషయాన్ని ఎత్తుకున్న అది కాస్తా తిండిగొడవలోకి దిగిపోతోంది. తిండిమాట వచ్చేసరికల్లా ఆకలిమంట నాలికలు సాచి రేగుతోంది. దాంతో 'మాటాడ కూడదని' నిర్ణయానికి వచ్చేశారు వాళ్ళిద్దరున్నూ.

'మాస్కో దండకవిలె' సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆ పత్రికను తెరిచి ఒకతను యించుమించు వణుకుతో చదివాడు. అతను చదివింది యిదీ !

"నిన్న సాయంత్రం మహా ఘనత వహించిన గవర్నరు సర్కారువారు మహా గొప్ప విందుచేశారు. ఆ విందులో నూరుమందికి పైగా పురప్రముఖులూ, అతిథులూ పాల్గొ న్నారు. ఆ విందులో ఎన్నడూ ఎవరూ ఎరగని వంటకాలను వడ్డించారు. ఆ వంటకాల రుచి ఇంతింతని చెప్పడానికి ఎవరి చేతా కాదని అభిజ్ఞులు అన్నారు. ఈ ఘనమైన విందులో ఛప్పన్న దేశాల రకరకాలయిన వంటకాలన్నీ ఆశ్చర్యాన్ని కొల్పాయి. తూర్పు ప్రాంతపు పౌజుమాంసంతోపాటు ఎక్క

డిదో ఉత్తరాది పిట్టమాంసం వడ్డించారు. అన్నిటికన్నా మించి యీ ఫిబ్రవరిలో ఎక్కడా దొరకని బెర్రీ పళ్లు కూడా వడ్డించారు. ఎంత అద్భుతం ?"

'తమకు పుణ్యం ఉంటుంది. దొరగారూ ? ఆ పత్రికలో ఈ విందు గొడవతప్ప చదవడానికి మరే వార్తా దొరకలేదా ?' అని అరుస్తో, ఆ పత్రిక లాగేసి తను చదివాడు.

ఆయన చదివింది ఇదీ :

"తులా నించి మా ప్రత్యేక విలేఖరి పంపిన ప్రత్యేక వార్త ఇది. యూపా నదిలో నిన్న సాయంత్రం పెద్ద చేపని పట్టుకొన్నందుకు స్థానిక క్లబ్బు వారిచే పెద్ద ఉత్సవం జరుపబడింది. (గత ఎనభై తొంభై ఏళ్ళల్లో ఇలాంటి చేప లభించలేదని అక్కడి వయోవృద్ధులచే సైతం చెప్పబడుతోంది. ఇప్పుడు లభించిన ఈ మత్స్యరాజం ఫలానా పోలీసు ఇనస్పెక్టర్, సి. గారు అని గుర్తింపబడింది.) ఆనాటి ఈ కథానాయకుణ్ని విశాలమైన తక్తాబల్లమీద ఉంచటం జరిగింది. కాగా, పొదీనా, కరివేపాకు యిత్యాది పాక పరివారాలను ఆ కథానాయకుని నోట్లో కుక్కారు. చుట్టూ తాజా దోస చెక్కలను పేర్చడం జరిగింది. ఈ మహోత్సవకర్తలు అయిన స్థానిక డాక్టర్ పి గారు సదస్యులందరికీ పలపక్షం లేకుండా సరిసమానంగా పంపిణీలు చేయడంతో ఈ ఉత్సవం తాలూకు గొప్పదనం మరింత వెల్లడయింది. అందరికీ అన్నివిధాల నచ్చేలాగున వడ్డన జరగడంతో ఈ ఉత్సవం జయప్రదంగా ముగిసింది."

'క్షమించాలి. తమరుకూడా మళ్లా ఆ వార్తల్నే వల్లిస్తున్నారుసుమీ!' అంటూ ఆ పత్రికను తను లాక్కుని చదివాడు.

అతగాడు చదివిన వార్త ఇలా వుంది.

"ఇప్పుడే వోడ్కా నగరంనించి మా విలేఖరి 'ఒక శతవృద్ధు 'చేపల పులుసు'ని సరి కొత్తగా తయారించడంలో కొత్త పద్ధతిని కనిపెట్టి పాకశాస్త్రంలో అద్భుత విజయాన్ని సాధించారు' అని తెలియ చేస్తున్నాడు. ఆ చేపల పులుసు తయారీ పద్ధతి ఇది :- 'చక్కగా బతికివున్న సందువా చేపని తెచ్చి దగ్గర పెట్టుకుని మొదట దాన్ని బహుమెత్తగా మర్దించాలి. ఆ తొక్కిడికి ఆ చేపకార్జం వుబ్బుతుంది, సరిగ్గా ఆ సమయంలో..."

మళ్లా ఇద్దరూ తలలు వేలాడేశారు. వాళ్ళ కంటికి ఏది కనిపించినా అది తిండికి సంబంధించిందిగానే వుంది. తమ ఆలోచనలే తమ మీద కుట్రపన్నినట్టు తోస్తోంది. మొఖంమీద ముసురుకొంటూన్న మాంసపు వేపుళ్లనీ, వాటి ఘుమ ఘుమల్నీ ఎంత తుడిచేద్దామన్నా వాళ్ళ వల్ల కాలేదు.

ఇంతలో రెండో అతని బుర్రలో ఓ ఆలోచన తటాలున మెరిసింది.

'చూడండీ దొరగారూ! ఓ మాట చెబుతాను. మనం యిక్కడ ఓ పల్లెటూరి రైతుని పడితే ఎలా వుంటుందంటారు?' తన ఆలోచనకి తనే మురిసిపోతూ అన్నాడు.

'పల్లెటూరి రైతా? తమ ఉద్దేశ్యం ఏమిటో వివరించండి.'

'ఏముందండీ! మామూలు పల్లెటి బైతే! రోజూ మన కనిపించేవాళ్ళే! చులాగ్గా చేపల్ని పడతాడు. పిట్టల్ని కొడతాడు. చిటికెలో వండి వారుస్తాడు.'

'ఊఁహు! ఆ బైతు అనేవాడు మన కెక్కడ దొరుకుతాడంటారూ? ఇక్క డెక్కడా వాడి పొడకూడా కనిపించడంలేదే?'

'తమరలా అంటే ఎలాగ? ఈ బైతు లనేవాళ్ళు కోట్లమంది దొరుకుతారు. మనం చేయవలసిందల్లా కొంచెం వెతికి చూడ్డమేమరి! పనిపాటలు ఎగ్గొట్టిన వాడెవడో ఒకడు ఈ ప్రాంతంలోనే దొరుకుతాడు.'

ఈ ఆలోచన తట్టడంతో ఇద్దరికి ఆనందం పొంగి పొర్లింది. ఎగిరి గంతేసి ఆ 'బైతు'ని వెతకడానికి బయల్దేరారు.

చాలసేపు ఉభయులూ తిరిగారు. ఆ మూలనించి ఈ మూలదాకా వెతికారు. ఆఖరికి వాళ్ళిద్దరికీ ఓ పక్కనించి చెమటతో తడిసిన కావిబట్టల కంపూ, కారం మెతుకుల ఘాటూ తగిలింది. దాన్నే ఎగబీలుస్తూ వారిద్దరూ ఆ వేపుకి సాగారు.

అల్లంతదూరాన ఓ చెట్టు మొదట్లో ఓ రైతు వెల్లకిలా పడుకుని వున్నాడు. మాంచి వొడ్డూ పొడుగూ వున్న రైతు. తలకింద చేయి పెట్టుకున్నాడు. పొగరుబోతు. ఎగ్గొట్టి తీరిగ్గా పడుకున్నాడు. అందుకు సందేహంలేదు.

అతగాణ్ని చూడడంతో యీ పెద్ద అధికార్లిద్దరికీ మా చెడ్డకోపం ముంచుకొచ్చింది.

'సోమరిపోతు వెధవా!' అంటూ యిద్దరూ ఆ రైతు మీద పడ్డారు.

'ఇద్దరు పెద్ద అధికార్లం ఆకలికి నకనకలాడి ఉసూరుమంటూంటే, సోమరిపోతు వెధవా? చీమకుట్టినట్టు హాయిగా పడుకుంటావట్రా? లే! తక్షణం పనిలో దిగు!'

ఆ రైతు లేచాడు. ఇదేం తమాషా కాదని రైతుకి తోచింది. వీళ్లెవరో కరాఖండివుద్యోగులనితటింది. అక్కణ్నించి ఎలాగైనా ఉడాయిద్దామనుకొన్నాడు. కాని వాళ్లిద్దరూ అతన్ని చావుపట్టుపట్టారు. ఇహ లాభం లేదని పనిలోకి దిగాడు.

మొదట ఆ రైతు చెట్టెక్కాడు. చిటారు కొమ్మకి ఎగ్రాకాడు. బుట్టెడు పళ్లని రాల్చాడు. తనకో వగరు కాయని తుంచుకున్నాడు. దిగివచ్చాడు. ఓ చోట తవ్వి బంగాళా దుంపల్ని బయటికి లాగాడు. తర్వాత రెండు కర్ర ముక్కల్ని తెచ్చి రాపాడి నిప్పు రాజేశాడు. తన నెత్తిమీది జుట్టుకాస్త వూడబెరికి దానితో వల అల్లాడు. వల విసిరి కాసిని చేపల్ని పట్టాడు. ఆఖరికి అదీ ఇదీ చేర్చి పదిరకాలు వండాడు. వార్చాడు.

'పాపం, ఈ సోమరి వెధవకి కాస్త మిగుల్చుదామా?' అనుకున్నారు వాళ్లిద్దరూ. అంత బాగా కుదిరాయి వంటకాలు.

ఆ రైతు పడిన శ్రమ కళ్లారా చూశాక ఆ అధికార్ల హృదయాల్లో కొంచెం సంతోషం కలిగింది. ఇంతకుముందు రోజల్లా తాము తిండిగిండి లేకుండా చావుకి తయారైన సంగతి బొత్తిగా వాళ్ళకి గుర్తులేకుండా పోయింది. వాళ్ళకి ఇప్పుడు

ఒక్కటే ఆలోచన. 'పెద్ద తరహా ఉద్యోగం చెయ్యడమే గొప్ప. ఎక్కడికి వెళ్లినా ఢోకా ఉండదుగదా!' ఇదీ వాళ్ళ ధీమా!

'అయ్యగార్లూ! తమకు నచ్చిందాండీ?' అనడిగాడు ఆ 'సోమరిపోతు' రైతు!

'ఓ, బాగావుంది. నువు చక్కగా పనిచేస్తున్నావని తెలుస్తోందిగా?'

'కాసేపు నడుం వాల్చుకోమంటారా?' అనడిగాడు రైతు.

'మాకో తాడు పేనియిచ్చి, ఆ పైన నడుం వాల్చు!' అన్నా రిద్దరూ.

రైతు అటూ ఇటూ తిరిగి ఎక్కడో గోగునార సంపాయించుకొచ్చాడు. దాన్ని మెత్తగా నలగ్గొట్టి, చక్కగా చీల్చి, మంచి వడిపెట్టి తాడు పేనాడు. అప్పటికి సాయంత్రం అయింది.

ఆ తాడుని మన అధికార్లు స్వీకరించినవారై, దాంతోనే ఆ రైతుని చెట్టుకి కట్టేశారు; తాము నిద్రపోయే సమయంలో ఎటైనా పారిపోతాడేమోనన్న సందేహంతో!

ఒకరోజు గడిచిపోయింది. ఆ మర్రోజు కూడ గడిచి పోయింది.

వీళ్లకి వంటా వార్పు చేసి ఆ రైతు పాకశాస్త్రంలో నిధి అయినట్లే! అరచేతిలో వండి వార్చగల నేర్పు వచ్చింది. కోరిన తిండి తేరగా దొరికేసరికి తెగ తిని యీ అధికార్లు యిద్దరూ నున్నగా గుండుల్లా తయారయ్యారు.

'ఇక్కడ మాత్రం మన కేం యిబ్బంది ఉన్నది కనక. కోరిందల్లా అమరుతోంది. అక్కడ మన పింఛను పైకం పీటర్స్‌బర్గ్‌లో పేరుకొంటోంది.'

ఓ రోజున భోజనాలపీ అయ్యాక అధికార్లిద్దరూ బాతాఖానీలో పడ్డారు.

" * బాబిల్ గోపురం కథ వుంది చూశారూ, ఆ కథ మీ ఉద్దేశంలో వాస్తవమే అంటారా ? కాదంటారా ? సెల వీయండి. "

" నా దృష్టిలో మాత్రం అది నూటికి నూరుపాళ్ళు వాస్తవమనేవుంది. ఆ కథే నిజంకాకపోతే ఈ వందలాది విభిన్న భాషలు ఎలా పుట్టాయంటారు. "

" అలాగన్నట్టయితే 'జల ప్రళయం' అనేది నిజమై ఉండాలన్న మాటేగా ?"

" సందేహం ఎందుకు ? ఆ జల ప్రళయంలో ప్రాణుల్ని రక్షించిన మహార్షుల సంగతి ఏఁవిటి ? అదిన్నీ కాక ఈ విష యంలో 'మాస్కో దండకవిలె'లో ఏమిని రాశారంటే. . . "

'ఐతే ఇప్పుడే చూద్దాం ఆ పత్రికను !'

వాళ్లిద్దరూ ఆ పాత పత్రిక ఎక్కడవుందో వెతికి బయటికి లాగారు. అక్షరం వదలకుండా మొదటి అక్షరం నించి చివరి అక్షరందాక చదివారు. మాస్కో తులా, పెంజా ర్యాజాన్ మున్నగు నగరాల్లో జరిగిన రకరకాల

---

* 'బాబిల్ గాలిగోపురం' బైబిల్ కథలో వస్తుంది. బాబిల్ గాలిగోపురం అంటే 'గాలిమేడ'. అందులోంచి ధ్వనులు వస్తున్నాయనీ, అవే భాషలుగా మారాయని కొందరి నమ్మకం – అను.

విందువార్త లున్నాయి. ఎన్ని విందువార్తలు చదివినా వాళ్లకి ఇప్పుడు బాధలేదు. వ్యధలేదు !

*  *  *

ఇంతకీ చెప్పొచ్చేదేమంటే -కొన్నాళ్ళకి యీ పెద్ద అధికార్లకి యింటిమీద బెంగపట్టుకుంది. సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో తమ వంటవాళ్ళు మాటిమాటికి జ్ఞప్తికి వొచ్చేవాళ్లు. ఒంటరిగా ఉన్నప్పుడు తలుచుకుని కుమిలేవాళ్ళు.

'ఈ వేళ్టప్పుడు సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో వంటవాళ్ళు ఏం చేస్తుంటారో కదా ?'

'ఆ మాట ఎత్తకండి ధొరవారూ ! అది తలుపుకొస్తే గుండె చెరువు అవుతుంది.'

'ఇక్కడ ముచ్చటగా ఉంది కానీండి, మందని విడిచి గొర్రె వొంటరిగా వుండడం మంచీకాదు, మర్యాదా కాదు. ఇప్పుడు వంటిమీదున్న దుస్తుల తీరు చూస్తుంటే ఏడ్పొస్తోంది.'

'*నాలుగో తరగతి దుస్తులు వేసుకోవలసినవాళ్ళం. వాటిని చూస్తేనే చాలు కడుపు నిండుతుంది.'

ఈ అధికార్లు ఇద్దరూ తమని ఇంటికి చేర్చమని రైతుని వేధించుకుతిన్నారు. నమ్మండి, నమ్మకపోండి ఆ రైతు ఎప్పుడో ఓసారి సెంట్‌పీటర్స్‌బర్గ్ వెళ్లాడట, ఓ చుక్క పుచ్చుకున్నాట్ట

---

* ఆ రోజుల్లో సివిల్, మిలిటరీ ఉద్యోగుల్ని 14 తరగతులుదాకా విభజించారు. తరగతివారీగా దుస్తుల్ని నిర్ణయించారు.

కూడా! (ఐతే ఫుచ్చుకొన్న చుక్క గొంతులోంచి కాక గడ్డంలోంచే జారిపోయిందని రూఢి అయింది.)

'అలాగా! ఐతే మేమూ సెంట్‌పీటర్స్‌బర్గ్‌నించే వచ్చామోయ్' అన్నారిద్దరూ రైతు కథనం విన్నాక.

'చూడండీ, ఎప్పుడైనా గోడలకి సున్నం వేస్తుంటేనో, వెలిసేమీద నించుని మరమ్మతులు చేస్తుంటేనో చూశారా మీరు? అలా చూసివుంటే ఆ పనులు చేస్తున్న మనిషిని నేనే సుమండీ' అన్నాడు రైతు.

ఆ తర్వాత ఆ రైతు తనవంటి నిరుపేద చేసిన సేవల్ని స్వీకరించినందుకు, మన్నించినందుకు కృతజ్ఞత తెలియచేద్దామని ప్రయత్నించాడు. కాని తగిన మాటలు తోచనేలేదు.

ఉద్యోగులిద్దరి నిమిత్తం రైతు ఓ డింగీని తయారు చేశాడు. నిజానికది గొప్పదేమీకాదు కాని, ఎలాగో సముద్రాన్ని దాటించి సెంట్‌పీటర్స్‌బర్గ్‌కి చేర్చడానికి పనికొస్తుంది.

'ఒరే బడుద్దాయి! నట్టేట్లో ఫుట్టిముంచక కాస్త గట్టిగానే కట్టు!' అని ఈ ఉన్నతోద్యోగులు అతణ్ని హెచ్చరించారు.

'లేదు దొరగారూ! మీకేం భయంలేదు. ఇంతకు ముందు ఇలాంటి డింగీలు చాల తయారు చేశాను.'

రైతు డింగీని తయారు చేశాడు.

ఈ గొప్ప అధికార్లిద్దరినీ డింగీలో కూచోబెట్టాడు. రైతు తెడ్డుని పట్టాడు. సముద్రాన్ని చీల్చుకొంటూ డింగీ ముందుకు సాగింది.

అలలమీద తేలిపోయేటప్పుడూ, ఉవ్వెత్తుగా తరంగాలు మీదికి దూకినప్పుడూ, చుట్టూ నీలిసంద్రం సుళ్లు తిరిగి కుదిపేసినప్పుడు అధికార్లపని భయంతో చచ్చినచావు అయ్యేది. అట్టి సందర్భంలో ఈ అనర్థకాలన్నిటికీ రైతు 'సోమరితన'మే కారణమన్నట్టుగా రైతుని వాళ్ళు తెగతిట్టే వారు. ఆ తిట్ల భాషని ఉచ్చరించడానికీ, కాగితమ్మీద రాయడానికీ ఎవరి చేతా కాదు. మిన్ను విరిగి మెన్ను మీదపడుతున్నా ఆ రైతు మాత్రం ఈ అధికార్లిద్దరికి వేళ తప్పకుండా చేపలతో భోజనం తయారుచేసి పెడుతూనే వున్నాడు.

ఇలా డింగీ సాగి సాగి చివరికి సముద్రాన్ని దాటి నీవా రేవులో కాల్వలోకి మళ్ళి కొసకి అధికార్ల ఇళ్ళముందు ఆగింది.

దొరలు పిత్త బలిసి మళ్ళీ రావడం చూసి వంటవాళ్లు కళ్లు తేలేశారు.

పెద్ద అధికార్లు తమ బసల్లోకి చేరారు. మొదట ఇంత తినితాగారు. ఆ తర్వాత తమ తమ హోదాకు సంబంధించిన దుస్తుల్ని వేసుకొన్నారు. ఖజానాలకు వెళ్ళారు. తమకు రావలసిన పైకాన్ని వసూలు చేసుకొన్నారు. ఆ పైకం ఎంతో ఎవడు లెక్కపెట్టగలడు కనక ?

ఐతే - ఇంతకీ వాళ్ళు ఆ పల్లెటి రైతుని మరచిపోయారని మాత్రం అనుకోవద్దు.

ఆ రైతుని ఆప్యాయంగా పిలిచారు. ఓ ఉగ్గు గిన్నెడు సారా, ఓ పావలాకాసు చేతిలో పెట్టారు.

'ఒరేయ్ ! నీ ఇష్టం వచ్చినట్టు మజా చేసుకోవోయ్ !' అని అన్నారు అంతులేని దయతో.





# వానర మహాశయుడు

ఒకానొక దేశంలో ఒక పెద్దమనిషి ఉండేవాడు. వినోదాలూ, విలాసాలూ తప్ప అతడికింకొక పని లేదు. ఆయన జమీలో దేనికీ కొరత లేదు. రైతులు, పాడి, పంట, తోటలు, దొడ్లు, ఒకటేమిటి సమస్తం వున్నాయి. పెద్దమనిషికి బుద్ధి ఒక్కటే తక్కువ. ఐనా *"వెస్ట్" అనే పత్రికను మాత్రం నిత్యం చదువుతూ ఉండేవాడు. నున్నగా తెల్లగా గుమ్మడి పండులాగా కుదిమట్టసంగా ఉండేవాడు ఆ పెద్దమనిషి.

ఒకరోజున ఉదయాన్నే దేవునికి ఒక విన్నపం పంపించుకొన్నాడు.

---

* వెస్ అనే పత్రిక ఆ రోజుల్లో (1868 - 70) జమీందార్లకు వత్తాసుగా వుండేది. సెంట్ పీటర్స్‌బర్గ్ నుంచి వెలువడేది.

... భగవాన్ ! మనిషికి కావలసినదంతా నాకు ప్రసాదించావు. హాయిగా తృప్తిగా వుంది. ఒక్క విషయం హృదయ శల్యంలాగ బాధిస్తున్నదయ్యా ! ఈ రాజ్యంలో రైతు లెక్కువై పోయారు. అదొక్కటే నాకు హృదయశల్యం లాగ బాధిస్తున్నది" అని చేతులు జోడించి చెప్పుకొన్నాడు.

కాని ఈ పెద్దమనిషికి బుద్ధితక్కువన్న విషయం దేవునికి తెలుసును. అందుకని అతడి మహజరును ఖాతర్ చేయలేదు దేవుడు.

రైతులసంఖ్య రోజురోజుకూ పెరుగుతున్న దేకాని తరగడం లేదు. ఇది చూసిన పెద్దమనిషికి బెంగపట్టుకొంది. వీరంతా కలిసి నన్నూ, నా జమీనీ కొసకు తినేయరుకదా అని భయపడ్డాడు.

ఏమైనా ఉపాయం కనిపిస్తుందేమోనని "వెస్ట్" పత్రికను అటూ ఇటూ తిరగేసి చూశాడు. "నీకు చాతనైనదే చేయి" అన్న సలహాతప్ప మరేమీ కనిపించలేదు.

ఇవి చూడ్డానికి మూడేమూడు పదాలు. అయితేనేం ముత్యాల్లాంటి పదాలు అనుకొన్నాడు ఆ పెద్దమనిషి.

అలాగే తనకు చేతనైనదంతా చేశాడు. కఠినమైన నిబంధనలను తయారు చేశాడు. ఏ రైతుకోడి అయినా తన పొలంలోపడితే ఆ నేరానికి అది దొరవారి పులుసులో పడాలి. ఏ రైతైనా చీకటిపడిన తర్వాత అడవిలో కట్టెలు కొట్టుకొనడానికిపోతే ఆ కొట్టిన కట్టెలకు మూడురెట్లు దొర గారి వంటచెరుకు రాసిలో పడాలి. ఆ రైతు జరిమానా కూడా విధించాలని మరొక నిబంధనవుంది.

"అసలు నేను వేసే శిక్షలన్నీ ఈ జరిమానాలే" అని దొరగారు ఇరుగు పొరుగువారితో చెపుతూవుంటాడు. రైతులకు అర్థమయ్యే శిక్ష ఒక్క జరిమానాలేనని అతడి అభిప్రాయం.

దొరగారికి బుద్ధిపూజ్యమైనప్పటికీ ఆయన పెంకెఘటమన్న సంగతిని రైతులు త్వరలోనే గ్రహించారు. ఇటు కదిలితే తప్పు, అటు కదిలితే తప్పు. దొరగారి నిబంధనలను అతిక్రమించకుండా బ్రతకడమే కష్టం అని అందరికీ తోచింది. ఈ పని చేయకూడదు, ఇక్కడ అడుగుపెట్టరాదు, ఇది మీదికాదు అని అన్నీ నిషేధాలే. అలాంటప్పుడు ఎటు మెసిలినా దండన తప్పదు. పశువులు ఏటిలో నీరు త్రాగితే "అది నా నీరు" అని అరుస్తాడు. కోడిపిల్ల అటో యిటో పోతే "అది నా భూమి" అని నోరు చేసుకొంటాడు. భూమి, నీరు, గాలి అన్నీ ఆయనవే. దీనితో రైతుల బ్రతుకు కటకట అయింది.

పొయ్యి వెలిగించడానికి, కొనకు వాకిలి ఊడ్చుకొనడానికి పూచిక పుల్ల కూడా కరువైంది. ఆఖరికి వారంతా కలిసి దేవునికి ఒక విన్నపం పంపించుకొన్నారు.

"ఓయి దేవుడా? మేమూ, మా బిడ్డలూ చావనైనా చస్తాం కాని బ్రతుకంతా ఈ యాతనలు భరించలేం తండ్రీ !" అని మొర పెట్టుకొన్నారు.

ఆలనా పాలనా లేని ఈ అనాథుల ఆర్తనాదం విని దేవుని మనసు కరిగింది. దొరగారి జమీలో ఒక్క రైతు కూడా లేకుండా మాయమయ్యారు. వారంతా ఎక్కడికి పోయారో ఎవరికీ తెలియదు. ఒక పెద్ద సుడిగాలి వచ్చి

చిట్టూపొట్టూ బట్ట పేలికలను తుడుచివేసింది. దొరగారు మెరాబామీదికి వచ్చి ఒకసారి ముకుపుటాలు ఆడించాడు. ఓహో తన జమీ జమీ అంతటా గాలి ఎంత పరిశుభ్రంగా వుండాలో అంత పరిశుభ్రంగావుంది అని సంతోషించాడు. "ఇక సుకుమార సుందరమైన ఈ నా శరీరం కావలసినంత సుఖం అనుభవిస్తుంది" అనుకొన్నాడు.

ఆ రోజునుంచీ కొత్త జీవితం ప్రారంభించాడు. ముందు కులాసాగా కాలక్షేపానికి దారి ఏమిటా అని ఆలోచించాడు.

"జమీలో ఒక నాటకశాల పెడితే ఎలావుంటుంది? నిజమే మహానటుడు * సాదోవస్కీకి రాస్తాను. 'అబ్బీ వచ్చి నన్నొకసారి కలుసుకో, ఆ గుంటల్నికూడా వెంటేసుకొనిరా' అని రాద్దాం" అనుకొన్నాడు.

ఆ పెద్దమనిషి అనుకొన్న ప్రకారం ఉత్తరం రాశాడు. సాదోవస్కీ ఆహ్వానాన్ని అంగీకరించాడు. తన వెంట నటీనట బృందాన్నికూడా తీసుకొని వచ్చాడు. కాని తీరావచ్చి చూస్తే ఇల్లంతా ఖాళీ. తెరలు కట్టడానికీ, దింపడానికీ ఎవరూ లేరు.

"రైతులనందర్నీ ఏం చేశావు" అని పెద్దమనిషిని ప్రశ్నించాడు సాదోవస్కీ.

"ఆఁ? అదా? భగవానుడు నా ప్రార్థన లాలకించాడు. నా జమీలో ఆ మడ్డిమృగాలపీడ విరగడ చేశాడు"

---

* ప్రొవ్ మైఖిలోవిచ్ సాదోవస్కీ (1818 - 1872) ప్రసిద్ధ రష్యన్ నటుడు.

"మీకు బుద్ధిలేదని చెప్పవలసి వుంటుంది. మీరు మొహం కడుగుకోవాలంటే నీ రెవరు తెచ్చి పెడతారు ?"

"అసలు నేను మొహం కడిగి ఎన్నాళ్లయిందో ఆ భగవంతునికే తెలియాలి."

"మొహంమీద పుట్టగొడుగులు పెంచాలనుకొంటున్నట్లుంది" అని సాదోవస్కీ వచ్చినదారినే తనవారిని తీసుకొని వెళ్ళిపోయాడు.

అక్కడికి దగ్గరలోనే నలుగురు పింఛనీ సేనాను లున్న సంగతి అప్పుడుదొరగారికిజ్ఞాపకంవచ్చింది. "ఏం? నేనొక్కణ్ణే కూర్చుని పేషంట్స్ ఆడుకొనడమెందుకు ? వాళ్ళనుకూడా పిలిస్తే దొంగాట వేసుకోవచ్చునుకదా ?" అనుకొన్నాడు.

అనుకొనడమే తడవుగా ఆహ్వాన పత్రికలు రాసి టపాలో వేశాడు. పింఛను సేనానులు ఒకప్పుడు నిజంగానే సేనానాయకులుగా వుండేవారు. కాని వారికిప్పుడు ఆకలెక్కువైంది. అందుకని ఆహ్వానా లందగానే వచ్చి వాలారు. వారు రాగానే దొరగారి జమీలో గాలి చాలా పరిశుభ్రంగా వుండడం చూసి ఆశ్చర్యపోయారు.

"చూశారూ! భగవంతుడు నా ప్రార్థనలు మన్నించి నా జమీలో రైతులపీడ విరగడచేశాడు" అని గొప్పగా చెప్పాడు దొరగారు.

"ఓహో ఎంత సంతోషం! - ఇంక మీ కా గబ్బిడాయిల వాసన ఏమాత్రమూ ఉండదన్నమాట" అన్నారు పింఛను సేనానులు.

"ఇంత పిసరుకూడా" అని జవాబిచ్చారు దొరగారు.

సరే వారంతా కూర్చుని ఒక ఎత్తువేశారు. మరొక ఎత్తు వేశారు. అప్పటికి కొంచెం పానీయం సేవిస్తే బాగుంటుం దని పింఛను సేనానులు భావించారు. ఆకలి కళ్ళతో అటూ యిటూ మిర్రి మిర్రి చూశారు.

"కొద్దిగా ఫలహారం సేవిస్తారా ?" అని అడిగాడు పెద్ద మనిషి.

"అందు కభ్యంతర మేమిటి ?"

పెద్దమనిషి లేచి అల్మారా తీశాడు. అయిదు లడ్డూలు, అయిదు బిస్కట్లు తెచ్చి తలొకటీ యిచ్చాడు.

"ఏమిటిది ?" అన్నారు సేనానులు ఆశ్చర్యపోతూ.

"అయ్యా ! సేవించండి !"

"ఛ ఛ ఇదేమిటి ? మాకు మాంసం కావాలి."

"క్షమించండి. ఏం చెయ్యను. ఏమీ లేదు. ఆ గబ్బి డాయిగాళ్ళ పీడ విరగడైనప్పటినుంచీ పోయి రాజలేదు."

సేనానులు కోపంతో పళ్ళు పటపట కొరికారు.

"అయితే నీవు మాత్రం పూటుగా తింటూనే వున్నావు కాదూ ?" అన్నారు సేనానులు.

"అప్పుడప్పుడు అపక్వాహార మే తీసుకొంటున్నాను. ఇంకా కొన్ని బిస్కట్లు ఉన్నాయి లెండి."

"నీకు బొత్తిగా బుద్ధి లేదు" అని సేనానులు ఆట సగంలో వుండగానే లేచిపోయారు.

'నీకు బుద్ధి లేదు' అన్న మాట దొరగారిమీద పడ్డం ఇది రెండవసారి. ఆయన దాన్ని గురించే ఆలోచిస్తూ ఉండగా

హఠాత్తుగా దృష్టి పేకదస్తామీద పడింది. అంతటితో ఆలోచనలన్నీ కట్టిపెట్టి 'పేషంట్స్' ఆటకు ముక్కలు పంచడం ప్రారంభించాడు. "ఎవరి పద్ధతి సరియైనదో చూపిస్తానుగా ఉండండి ఉండండి; గట్టితనం అంటే ఏమిటో చూపిస్తాను."

అలాగే 'పేషంట్స్' ఆడుతూ కూర్చున్నాడు. (ఈ ఆటకు అమ్మలక్కల ఉబుసుపోక అనికూడా పేరుంది) అలా ఆడుతూనే "మూడుసార్లు సరీగా ముక్కలు పడితే గెలుపుమనదే" అనుకున్నాడు. సరీగా అనుకొన్నట్లే ఆట పడేది. అందుకని పెద్ద మనిషికింక అనుమానాలు మిగల్లేదు.

"అదృష్టంకూడా అలాగే చెపుతున్నప్పుడు నేను కడవరకూ గట్టిగానే నిలబడతాను" అనుకొన్నాడు.

"సరే, దొరగారూ ఇక ఆటచాలునుకాని లేవండి!" స్వగతం చెప్పుకొంటూ లేచాడు. అటూ ఇటూ కాస్తసేపు పచారు చేశాడు. మధ్య మధ్య విశ్రాంతికోసం కూర్చుని మళ్లీ లేచి మళ్లీ పచార్లు చేశాడు. ఇంతసేపూ బుర్ర ఆలోచిస్తూనే వుంది. ఇంగ్లాండునుంచి తెప్పించవలసిన ఇంజన్లు ఆలోచనల్లో మెదిలాయి. జమీా అంతటా స్టీమింజన్లు తప్ప ఇంకేమీా వుండకూడదు. ఆ గబ్బిడాయిల పొడకూడా పడకూడదు. ఇదుగో ఆ ఎదురుగానే పెద్దతోట వేయాలి. అక్కడ బత్తాయి. ఇక్కడ జామి ఆ ఎడంచేతి వైపున సీమబాదం. ఇక్కడనుంచి తొంగిచూస్తే చాలును ఎదురుగా తోట కనిపిస్తుంది. అందమైన తోట. అనుకొన్న ప్రకారం వరసల్లో వుంటాయి. పళ్ళ నన్నింటినీ యంత్రాలతో కోయించాలి. చేతులతో పనిలేకుండా నోటిదగ్గరికకూడా యంత్రాల

తోనే తెప్పించాలి. తాను పెంచబోయే పశువుల్ని గురించీ, పాడిని గురించీ కూడా ఊహించాడు. పాలేమిటి సముద్రమే. రేగిపళ్ళు ఒక్కొక్కటి అంతంత వుంటుంది. పౌనుకు ఐదు కన్నా ఎక్కువ తూగవు. రాసులు రాసులు అన్నీ మాస్కో లోనే అమ్మకం!

ఆలోచించి ఆలోచించి అలిసిపోగానే అద్దంలో మొహం చూసుకొన్నాడు. ఇదేమిటి! మొహంమీద మన్ను అంగుళం మందాన పేరుకొంది! అనుకొని ఒరే సెంకా అని నౌకరును పిలిచాడు దొర. నౌకర్లంతా జమీ విడిచిపెట్టి పోయారన్న విషయం ఒక నిమిషానికి జ్ఞాపకం రాగానే "సరే, సరే - యిప్పటికి యిలా వుండనీ!" అని నిశ్చయానికి వచ్చాడు. "అదీకాక ఆ మితవాద నాయకులకు చెప్పానుగా గట్టిగా నిలవడం అంటే ఏమిటో, నిలిచి చూపిస్తాను" అని గొణుక్కొన్నాడు.

ఈ గొణుగుడుతోనే సాయంత్రం గడిచిపోయింది. నిద్ర వచ్చింది. నిద్రలో యింకా చక్కని కలలు వస్తాయి. తన దృఢదీక్ష సంగతి విన్న గవర్నరు 'ఎవరయ్యా యీ అద్భుతమైన వ్యక్తి' అని కొత్వాలును అడిగినట్లు కలవస్తుంది.

లేదా తన దృఢదీక్షకు మెచ్చి ఒక మంత్రిపదవిని ప్రసాదించినట్లయినా కలవస్తుంది. మెడనిండా ధగ ధగ మెరిసి పోయే పతకాలు, "గట్టిగా వుండాలి, గట్టిగా నిలవాలి" అని తాను అన్ని ప్రాంతాలకూ అందరికీ ఫర్మానాలు పంపినట్లు కల.

అది కాకపోతే, తాను ఏడెన్‌లో వున్నట్లు ఈవును మెచ్చుకొంటూ ప్రెగెస్ యూఫ్రెటిస్ నదులగట్టున షికారు చేస్తున్నట్లు కల వస్తుంది.

తెల్లవారగానే కలలన్నీ కరిగిపోతాయి. నిద్రమంచం మీాదనుంచి లేచి మళ్ళీ 'శంకా' అని అరుస్తాడు. అంతలోనే జ్ఞాపకం వస్తుంది.

"కాలక్షేపం అవడం ఎలాగ ?" అని ఒకనాటి ఉదయమే వితర్కంలోపడ్డాడు పెద్దమనిషి.

ఎవరైనా నన్ను చూడ్డానికివస్తే ఎంత బాగుండును అనుకొన్నాడు. ఈ మాటలు అతడినోటినుంచి వెలువడ్డాయో లేదో కొత్వాలు అక్కడ స్వయంగా ప్రత్యక్షమయ్యాడు. పెద్దమనిషి సంతోషానికి మేరలేదు. అల్మారా దగ్గరకు పరుగెత్తి ఎలాగై తేనేం రెండు బిస్కట్లు సంపాదించాడు. "సరే ఇంతటితోనే సరిపెడదాం" అనుకొన్నాడు.

కొత్వాలు లోపలికి వచ్చాడు.

"అయ్యా మీా రైతులంతా ఎలా మాయమయ్యారో కాస్త శెలవిస్తారా ?"

"అదా ? ఏముంది. నా జమీాలో ఈ గబ్బిడాయిల పీడ విరగడచేయి ప్రభో అని దేవుణ్ణి ప్రార్థించాను."

"అలాగా ? అయితే వారి పన్నులు ఎవరు కట్టాలో తమరెన్నడైనా ఆలోచించారా ?"

" పన్నులు ! వాళ్ళ పన్నులు వాళ్ళే కట్టుకొంటారు. అది వారి విధి."

" మీ ప్రార్థనల ఫలితంగా ఆ రైతులంతా చెల్లా చెదరై పోయారు. మరి వాళ్ళ దగ్గరనుంచి పన్ను లెలా వసూలు చేయడమో సెల వివ్వండి !"

" అదా ? అదా ? అదేదో నాకు సరిగా తెలియడం లేదు కాని నేను మాత్రం ఇచ్చేది లేదు. "

" పన్నులు లేనిదే ఖజానా అనేది వుండదన్న విషయం దొరగారికి తెలియనిది కాదు. ఉప్పు పన్ను, సారా పన్ను సంగతి వేరే తమకు మనవి చేయవలసిన దేమున్నది ?"

" ఆ పన్నులా ? అవైతే మనకభ్యంతరం లేదు. ఒక గ్లాసు సోడ్కా సేవిస్తారా ?"

"ఒక్క క్షణం ఆగండి ! తమ మూలంగా అంగడిలో గిద్దెడు గింజలు కాని, యింత మాంసం ముక్క కాని లేవన్న విషయం తమ రెన్నడయినా తెలుసుకొన్నారా ? దాని అర్థం ఏమిటో తమరు గుర్తించారా ?"

"సరే నేను చేయగలిగిన దేమిటో చేయడానికి సిద్ధం. ఇవిగో రెండు బిస్కట్లున్నాయి."

" తమరు బుద్ధి లేని పెద్దమనుషులు అనవలసివస్తోంది " అని కొత్వాలు ఆ వోడ్కా, బిస్కట్ల వంక కన్నెత్తి అయినా చూడకుండా వెళ్ళిపోయాడు.

ఇప్పుడు దొరగారికి నిజంగా విచారం పట్టుకొంది. తనకు బుద్ధిలేదు అన్నమాట ఇప్పటికి మూడు సార్లు చెవిని పడింది. ఇది ఆషామాషీ వ్యవహారం కాదు. మూడవసారి ఆ వచ్చినవాడు మొహంమీద ఉమ్మేసి మరీ పోయాడు. నిజంగా తాను బుద్ధిలేనివాడేనా ? తన దృఢదీక్షా, గట్టితనం

తెలివితక్కువేనా? లేక మతిభ్రమణమా? తన గట్టితనం వల్ల పన్నులన్నీ నిలిచిపోయాయా? అంగట్లో గిద్దెడు గింజలు కూడా లేవా? ఈ మాట నిజమేనా?

అసలా పెద్దమనిషికి బుద్ధి పూజ్యం అవడంవల్ల మొట్ట మొదట ఈ అలోచనలన్నీ రాగానే నవ్వుకొన్నాడు. కాని ఆ తర్వాత దీని అర్థమేమిటో తమరు గుర్తించారా అని ఆ కొత్వాలు వేసిన ప్రశ్న జ్ఞాపకం వచ్చింది.

మామూలుగా పచార్లు ప్రారంభించాడు. ఈసారి కాస్త బెంబేలుపడ్డాడు. దీని అర్థం ఏమిటి అన్న విషయాన్ని గురించి దీర్ఘాలోచన సాగుతూనేవుంది. దీని అర్థం ఎక్కడికైనా ప్రవాసం పంపిస్తారనా? సరే ప్రవాసమే కావచ్చును. ఏమైనప్పటికీ నిజమైన గట్టితనం అంటే ఏమిటో ప్రపంచానికి తెలిసివస్తుంది. ఆ గట్టితనాన్ని అంతా వేనోళ్ళ పొగిడే అవకాశం వస్తుంది! ఈ మాటల నతడు ప్రకాశంగానే అన్నాడు. బహుశా ఆ ప్రవాసంలో నా రైతులు కనిపిస్తారేమో అని స్వగతంగా అనుకొన్నాడు. కొంతసేపు పచార్లు చేశాడు. కూర్చున్నాడు. లేచి మళ్ళీ పచార్లుచేశాడు. కని పించిన ప్రతిదీ "నువ్వు బుద్ధిలేని పెద్దమనిషివి." అంటూన్నట్లే అనిపించింది. ఒక ఎలక ఆమూలనుంచి ఈ మూలకు పరుగెత్తింది. తాను ఆడి పడేసిన పేకదస్తావేపు వెళ్ళింది. పేక ముక్కలు జిడ్డుతేరివున్నాయి. జిడ్డువాసన ఎలక పసికట్టింది.

"షుషు"అని బెదిరించాడు. కాని చాలా తెలివైనది ఎలక. నౌకరు సెంకా లేకపోతే దొరగారి అంతటి నిరపాయకరమైన వ్యక్తి మరొకరు లేరని దానికి బాగా తెలుసును. నీ లెక్క

లేదన్నట్లు ఒక్కసారి తోకను కదిపింది. ఆ వెంటనే సోఫాకింది నుంచి తలెత్తి "చూడవోయ్ బుద్ధిలేని పెద్దమనిషీ! ఇంతటితో అయిందా? నీ బట్టలకు సరిగా జిడ్డుపట్టిన తర్వాత వాటిపనికూడా పట్టిస్తాను" అన్నట్లుగా తలకాయ ఆడించింది.

కొంతకాలానికి తోటలో కాలిబాటలనిండా గడ్డి మొలిచింది. తుప్పలనిండా పాములూ, తేళ్లూ చేరాయి. ఉద్యానవనం అడవిజంతువులకు ఆటకూటమైంది. ఒకనాడు ఇంటిదగ్గరకు ఒక ఎలుగుబంటు కూడా వచ్చింది. నాలిక తడుపుకొంటూ కిటికీలోంచి దొరగారి వేపుకూడా చూసింది.

"సెంకా" అని దొరగారొక గావుకేక పెట్టారు. అంతలోనే అంతా జ్ఞాపకంవచ్చి పెద్దమనిషి గుడ్లల్లో నీళ్ళు తిరిగాయి.

అయితే ఆయన దృఢదీక్ష మాత్రం సడలలేదు. అప్పుడప్పుడు కొంచెం ఢీలాతనం కనిపించకపోలేదు కాని మనసు జారుతున్నట్లు అనిపించేసరికి ఆయన "వెస్టు" పత్రిక అందుకొనేవాడు. వెంటనే గట్టితనం పుంజుకొనేవాడు.

"ఛాఛా నేను వానరుణ్ణయి వన్యమృగాలతో కలిసి అడవిలో తిరగనైనా తిరుగుతానుకాని రష్యన్ జమీందారు రాజా ఉరుస్ కుబ్బుం కిల్డిబయేవ్ తన సిద్ధాంతాలు విడిచి పెట్టాడు అన్నమాటమాత్రం రానీయను" అనుకొన్నాడు.

అలా అనుకోవడమేమిటి ఆ పెద్దమనిషి అచ్చం వానరుడయాడు. అది చలికాలం. చలి ఎముకలు కొరుకుతోంది. అయినా అతడికి చలి అనిపించలేదు. ఒంటినిండా చమరీ మృగంలాగా రోమాలుపుట్టాయి. గోళ్ళు గట్టిపడి నక్కుల్లా

తయారయ్యాయి. ముక్కు చీదడం మానేసి చాలాకాలం అయింది. నాలుగు కాళ్ళతో నడక ప్రారంభించాడు. నడవడానికి ఇంత చక్కని పద్ధతి వున్న విషయం తన కింతకుముందెందుకు తట్టలేదు అని ఆశ్చర్యపడ్డాడు. త్వరలోనే శబ్దోచ్చారణశక్తి నశించి ఊళ, బుసలు, మొరుగుడు కలిసిన ఒకరకం అరుపు నేర్చుకొన్నాడు. ఇంతకీ అతడికివున్న కొరత ఒక్కటే అది తోక.

ఇంతకుముందు ఉద్యానవనంలో విహరించినచోట ఇప్పుడు నాలుగు కాళ్ళతో పాకుతున్నాడు. పిల్లిలాగ చెట్టు కొమ్మలపైకెగబాకి గుబురు మాటున నక్కి నక్కి కూర్చుంటున్నాడు. ఒక కుందేలు పిల్ల వచ్చి కూర్చుని ఎదో ప్రమాదంతో చెవులు రిక్కించిందనుకోండి. గౌరవనీయులైన ఈ దొరగారు అమాంతం దానిపై కురుకుతారు. బాణంలాగ దూసుకువెళ్ళి తమ ఎరను ఖండఖండాలుగా చీల్చి చెండాడుతారు.

కాలం గడిచినకొలదీ దొరగారు చాలా గట్టిపడ్డారు. ఒకనాడు కిటికీలోంచి చూసి దొరగారిని భయపెట్టిన ఎలుగు బంటుతో నెయ్యానికి కబురంపేటంత బలం వచ్చింది దొరగారికి.

“ఇదిగో ఎలుగూ! ఇద్దరం కలిసి వేటాడుదాం. ఏమంటావు” అని దొరగారంటే—

“నాకేమీ అభ్యంతరంలేదు” అని ఎలుగుబంటు జవాబిచ్చింది.

" కాని నువ్వు నీ రైతులతో అలా ప్రవర్తించి వుండవలసిందికాదు."

" ఏం ఎందుచేత ? "

" మీా పెద్దమనుషులకన్న ఆ గబ్బిడాయి లే చాలా నయం. నిజం చెప్పాలంటే నీవు ఉత్త బుద్ధిహీనుడివి. "

ఇదిలావుండగా అక్కడ కొత్వాలు- జమీాందార్లు అంటే ఎంత అభిమానస్తుడైనప్పటికీ భూమ్మీద రైతులనే వారు లేకుండాపోయారన్న వాస్తవాన్ని మాత్రం దాచలేక పోయాడు. కొత్వాలు పంపిన కబురువిని పెద్ద అధికారులు కూడా చాలా ఆందోళనచెందారు. పన్ను లెవరుకడతారు ? వోడ్కా ఎవరు తాగుతారు ? అమాయక వృత్తు లెవరు నిర్వహిస్తారు ? అని కొత్వాలుకు వారు వ్రాశారు. ఖజానాను ఎత్తివేయవచ్చునని కొత్వాలు జవాబుపంపాడు. ఇక అమాయక వృత్తులంటారా ? ఆ వృత్తులన్నీ పోయాయి. వాటి స్థానే దొంగతనాలు, దోపిడీలు, హత్యలు. దేశమంతటా పెచ్చరిల్లాయి. పరిస్థితులు ఎంతవరకు ముదిరాయంటే కొత్వాలునైన నన్నే మొన్న నొక వానరమృగం అడ్డగించింది. చావుతప్పి బైటపడ్డాను. సదరు మృగం ఈ ఆందోళకంతకూ కారకుడైన బుద్ధిలేని పెద్దమనిషి తప్ప అన్యులుకారని తెలుస్తోంది- అని కొత్వాలు అధికారులకు వ్రాశాడు.

అధికారులు ఆదరాబాదరా సమావేశాలు జరిపి సలహా సంప్రతింపులు సాగించారు. రైతులను పట్టుకొని వారి వారి పూర్వ స్థానాలకు పంపాలని నిశ్చయం చేశారు.

ఈ కల్లోలాని కంతటికీ కారకుడైన ఆ పెద్దమనిషిని ఇలాంటి చేష్టలు కట్టిపెట్టవలసిందనీ, పన్ను వసూళ్లకు అడ్డంకులు కల్పించవద్దనీ మర్యాదగా మందలించడానికి తీర్మానించారు.

ఆ సమయంలో అదృష్టవశాత్తు రైతుల తండాకు తండా ఆ వూళ్లో దిగింది. వారు తిన్నగా నగరంమధ్యనే దిగారు. అంగళ్ళన్నీ నిండిపోయారు. వెంటనే వారందరినీ పట్టుకొని ఒక బుట్టలోపెట్టి వానర మహాశయుని జమీందారీకి రవాణా చేశారు.

ఆ చుట్టుపట్ల ప్రాంతం అంతా తిరిగి రైతుల గొలుతో నిండిపోయింది. అంగళ్ళుకూడా నవధాన్యాలతో నిండిపోయాయి. ఒక్కరోజులోనే ఎంత పన్ను వసూలైందంటే ఖజానాదారు పుట్లకొలదిగావున్న రూపాయలనుచూసి తలాడిస్తూ "ఈ డబ్బంతా ఎక్కడిదయ్యా ఆ వెధవలకు" అని ఆశ్చర్యపోయాడు.

ఇంతకీ ఆ పెద్దమనిషి ఏమయ్యాడని పాఠకులు అడగవచ్చును. చాలా చాలా ప్రయత్నంచేసిన మీదట అతడిని పట్టుకోగలిగారు. అతడి ముక్కు తుడిచారు. ఒళ్ళు కడిగారు. గోళ్ళు తీశారు. ఆ తర్వాత తీర్మానం ప్రకారం కొత్వాలు అతడిని మర్యాదగా మందలించాడు. "వెస్ట్" పత్రికను స్వాధీనం చేసుకుని ఆ పెద్దమనిషిని సెంకా అజమాయిషీకి అప్ప జెప్పాడు.

దొరగారు ఈ రోజుకుకూడా సుఖంగా బ్రతికేవున్నారు. ఇప్పటికీ "పేషంట్స్" ఆడుతూనే వుంటారు. తాను అడవిలో తిరిగిన ఆ పాతకాలాన్ని జ్ఞాపకం చేసుకొని నిట్టూర్పులు విడుస్తూ వుంటారు. పట్టి బలవంతంచేస్తేతప్ప స్నానంచేయరు. అప్పుడప్పుడు గురగురలాడుతూ వుంటారు.





# పరిగపిల్ల వైరాగ్యం

అనగా అనగా ఒక పరిగ. ఆ పరిగ తలిదండ్రులు చాలా తెలివైనవారు. వారు ఏవాలుగనోటా పడకుండా, ఏపులుసుకుండా ఎక్కకుండా గంటలు రోజులు లెక్కపెడుతూ అలాగే ముసలివారయ్యారు. తమ బిడ్డడుకూడా తమలాగే అదృష్టవంతుడు కావాలనుకొన్నారు. ఒకరోజున పెద్ద పరిగ కొడుకును పిలచి "చూడు బాబూ! జీవితానందం అనుభవించాలి అంటే రెండుకళ్ళూ తెరు" అని హితోపదేశం చేశాడు.

మన పిల్ల పరిగకు చాలా తెలివితేటలున్నాయి. ఆ తెలివితేటల్ని ఉపయోగిస్తూనేవుండేవాడు. కాని అదృష్టం మాత్రం ఎదురుతిరుగుతూ వుండేది. నీటినిండా చేపలు కోకొల్లలు. అన్నీ పెద్దవే. తానుమాత్రమే అందరిలోకీ చిన్న. తనను ఏ చాప అయినా ఇట్టే పుక్కిట పెట్టుకోగలదు. కాని

తనకు కోరకబడే వారుమాత్రం ఎవరూ లేరు. అసలు ఒకరిని మరొకరు యెందుకుమింగాలి? అని ప్రశ్న వేసుకుంటూ వుండే వాడు. ఎండ్రకాయ డెక్కలతో అదిమితే తాను రెండు తుండేలు కావలసిందే. ఒక చిన్న జలగ పట్టుకొందా తనపని గిజగిజ. కర్రొంకాలి తానెప్పుడైనా ఒక పురుగునుపట్టుకొంటే తనజాతి పరిగలే తండాలు తండాలుగా వచ్చి చుట్టుముట్టు తాయి. తననోటిలోంచి ఆ పురుగునులాక్కొని అది నుగ్గు నుగ్గు ఆయేవరకూ కాట్లాడుకొంటాయి.

ఇక మనిషి సంగతి సరేసరి. ఉత్తి పుణ్యానికి పరిగ లనుపట్టి హత్యచేయడంలో మనిషికున్న తెలివి మరెవరికీ లేదు. వలలు వేస్తాడు. మాంవులు (జల్లిగంపలు) పెడతాడు. గాలాలు విసురుతాడు!

అసలు ఈ గాలంకన్న దారుణమైన వస్తువు మరొక టుండా అనిపిస్తుంది. మామూలుదారం, దాని చివర ఒక ఇనపకొక్కెం. ఆ కొక్కానికి ఒక ఈగో, నేలపామో ఏదో ఒకటి వుంటుంది. అసలా గాలాన్ని విసరడంకూడా ఏ మంత సహజంగా వుండదు. అయినా చాలా పరిగలు ఆ గాలానికే పట్టుబడతాయి.

"ఇదుగో గాలం జాగ్రత్త" అని ముసలి పరిగ అనేక సార్లు హెచ్చరించింది. "ఈ గాలమంత పనికిమాలినది మరొకటి లేదు. అయినా మనవాళ్ళల్లో చాలామంది ఈ పనికి మాలిన గాలానికే బలౌతూవుంటారు. నీ కేదో ఒరగపెడు తున్నట్లు ఒక పురుగును గాలానికి గుచ్చుతారు. అంతే మిత్తి నీ నెత్తెక్కుతుంది" అని ముసలి పరిగ చెప్పింది.

కొద్దిలో పులుసుకుండ గండం ఎలా తప్పిందో కూడా ముసలి పరిగ చెప్పింది. ఆ రోజున మనుషులు ఒక తండాకు తండా వచ్చారు. ఏటికడ్డంగా వల వేసి ఏటి కడుపునంతా గాలిస్తూ చాలా దూరం ఈడ్చుకొని పోయారు. ఆ రోజున వాళ్ళు పట్టిన చాపలెన్నని! వాలగలు, బొమ్మిడాయిలు, మట్టగిడసలు, చందువాలు, అన్నీ వున్నాయి. ఇంక పరిగల సంగతి అడిగావా? వాటికి లెక్కలేదు. వాళ్ళు మమ్మల్ని ఈడ్చుకొని పోతూవుంటే మా ముసిలాడి భయంచూడాలి. చెప్ప శక్యంకాదు. ఈడ్చుకొని పోతున్నారని మాత్రమే కాని ఎక్కడికో ఏమిటో తెలియదు. నాకు అటువైపున ఒక వాలగ, ఇటువైపున చందువా. ఓయి దేవుడా! ఇంకో నాలు గడుగులు వేశానా ఏదో ఒకటి మింగేస్తుంది. అందుకు సందేహంలేదు అనుకొన్నాను. కాని అవి నావైపు కన్నెత్తి కూడా చూడలేదు. అసలది తినడానికి తగిన సమయమా? అందరికీ భయంగానేవుంది. ఏమిటో ఎందుకోమాత్రం తెలియదు. కొసకు వల అంచులు లాగడం ప్రారంభించారు. వలనంతనీ ఈవలికడ్చి ఒడ్డునున్న పచ్చగడ్డిమీద చాపలను రాసిపోశారు. అప్పుడే నాకు పులుసుకుండ సంగతి తెలిసింది. అక్కడ ఇసకమీద ఏదో ఎర్రనినిది ఎగురుతోంది. దాని లోంచి నల్లని చారలు పైకిలేస్తున్నాయి. అదెంత వేడిగా వుందంటే ఒక్క క్షణంలో నాకు స్పృహతప్పిపోయింది. అసలు నీళ్ళు లేకుండా వుండడమే మహాకష్టం. అందులోవారు ఆ వేడిని ఇంకా ఎక్కువ చేస్తున్నారాయె. దాన్ని వారు మంట అని అంటూాండడం విన్నాను. ఆ మంటమీద నల్లనిదేదో

పెట్టారు. అందులో నీరుంది కాని తుపాను వచ్చినప్పటి మాదిరిగా కళపెళ మంటోంది. దాన్ని కుండ అన్నారు. వాటినా కుండలో పడేయండి చాపలపులుసుచేద్దాం అన్నారు వాళ్ళు. అనడమేమిటి చాపలనుఎత్తి ఆ కుండలో పడేయడం మొదలుపెట్టారు. చాపలు పిచ్చెత్తినట్లు ఎగిరెగిరి పడ్డాయి. మునిగిపోయాయి. ఆ తర్వాత అంతా సద్దుమణిగింది.

ముందువారు ఆ చాపా ఈ చాపా అని చూడలేదు. చేతికందిన దాన్నల్లా కుండలో వేశారు. అప్పుడొక ముసిలి జాలరి నా వైపు చూశాడు. "అది మరీ నలుసంతవుంది. పులుసు పనికిరాదు ఇంకొంచెం పెరగనీ" అని చెప్పి తోకపట్టుకొని నీటిలోకి విసిరిపారేశాడు. వెంటనే ఆదరాబాదరా పడుతూలేస్తూ ఇంటికి చేరుకొన్నాను. ఇంటిదగ్గర మీ అమ్మ చచ్చి సగమై యెదురుచూస్తూనిల్చుంది ! అని ముసిలిపరిగ చెప్పాడు.

చాపపులుసును గురించి ముసిలిపరిగ ఎంత కష్టపడి చెప్పినా చాపలకు చాపపులుసు సంగతి పూర్తిగా బుర్ర కెక్కడం కష్టం.

కాని పిల్లపరిగ మాత్రం తండ్రి హితవచనాలను మరిచిపోలేదు. మనవాడు కుశాగ్రబుద్ధి, ఉదారాశయాలు గలవాడు. జీవితం హంసతూలికాతల్పం అంతటి మెత్తనిది కాదని తెలుసుకొన్నవాడు. "ఒరే అబ్బీ జాగ్రత్తగావుండరా, లేకపోతే ఏ కాలానికి ఏం వస్తుందో చెప్పలేం" అని ఆత్మ బోధ చేసుకొన్నాడు. ఈ బోధతోనే జీవితవ్యాపారంలో అడుగుపెట్టాడు. మనవాడు చేసిన మొట్టమొదటిపని ఒక

చిన్న కన్నం వెతకడం. తన ఒక్కడికిమాత్రమే చోటుగల ఇరుకుకన్నం ఒకటి చేసుకొన్నాడు. ముక్కుతో ఆ కన్నం తవ్వడానికి ఒక ఏడాదిపట్టింది. ఆ ఏడాదీ ఎలా గడిచిందో తలుచుకొంటే ఒళ్లు గరిపొడుస్తుంది. ఏ మూలనో సక్కి ప్రాణాలరచేత పెట్టుకొని పడుండవలసి వచ్చేది. ఏలాగై తేనేం కన్నం తయారైంది. చాలా అందంగా కూడా వుంది. తన కొక్కడికి మాత్రనే అందులో చోటుంది. ఆ తర్వాత చేసిన పని దినచర్యను నిర్ణయించుకొనడం. రాత్రిపూట మనుషులు, పశువులు, పక్షులు, చేపలు నిద్రపోయే సమయంలో మన వాడు వ్యాయామసాధన చేసేవాడు. పగలంతా తన కన్నంలో చేరి చలికి వణుకుతూ పడివుండేవాడు. కాని అందరిలాగే అతడికికూడా తిండి కావాలి. జీత నాతాలు కాని, నౌకరు చాకర్లు కాని లేరు. అందుకని మధ్యాహ్నంపూట చేపలన్నీ తృప్తిగా తిని తిరుగుతున్న సమయంలో మెల్లిగా బైటికివచ్చి అదృష్టముంటే ఒక పురుగునో, ఈగనో వేటాడేవాడు. ఏమీ దొరకకపోతే ఆకలితోనే తన కన్నంలోకిపోయి ముడుచుకొని పడుకొనేవాడు. "కడుపునిండా తిని ప్రాణంమీదికి తెచ్చు కొనడం కన్న కాలే కడుపుతోనైనా బ్రతికుండడం మేలు" అని మన పరిగమతం.

తన దినచర్య నెన్నడూ తప్పలేదు. రాత్రిళ్ళు వ్యాయామం చేసి వెన్నెల్లో అలా అలా తిరిగి వచ్చేవాడు. పగలంతా ఆ కన్నంలో పడివుండేవాడు. సరిగా మిట్ట మధ్యాహ్నమప్పుడు మాత్రమే వేటకు బయలుదేరేవాడు. మధ్యాహ్నంపూట వేట లాభంలేదు. పురుగులన్నీ ఆ వేడికి

ఆగలేక చల్లగావున్న ఏ ఆకుమాటుకో చేరేవి. అందుకని మన పరిగ చాలాసార్లు నాలుగు గుక్కల నీళ్ళతోనే సంతృప్తి పడవలసి వచ్చేది.

ఇలాగ రోజులు రోజులు కంటికి కునుకు లేకుండా కడుపుకు తిండిలేకుండా ఆ కన్నంలోనే గడిపాడు. "నే నింకా బ్రతికేవున్నాను. రేపేమాతుందో భగవంతుడా!" అన్న ఆలోచన తప్ప మరొక ధ్యాస లేదు.

అప్పుడప్పుడు మాగన్ను పడేది. అప్పుడప్పుడు తనకు లాటరీలో ఓ రెండు లక్షలు వచ్చినట్లు కల వచ్చేది. ఆ సంతోషంతో అటునుంచి ఇటు ఒత్తిగిలేవాడు. దానితో ముక్కు బైటపడేది. అప్పుడు పైన ఏ వాలుగ పిల్లయినా వుంటే ఏంగాను? గుటకాయస్వాహా - అందులో సందేహం లేదు.

మగత విరిగిపోయి కళ్లు తెరిచిచూస్తే ఎదురుగా ఒక ఎండ్రకాయ కళ్లార్పకుండా అలాగే పరిగవేపు చూస్తూ వుంటుంది. మీసాలు మాత్రమే ఇటూ అటూ ఆడుతూ వుంటాయి. పాపం అలాంటప్పుడు పరిగకు గుండెలు జారి పోతాయి. పరిగ బైటపడుతుందేమోనన్న ఆశతో ఎండ్ర కాయ ఒకపూట పూటంతా అక్కడే తిష్టవేసింది. ఆ పూటంతా పరిగ తన కన్నంలోనే గజ గజ లాడిపోతూ కూర్చుంది.

ఒక రోజున తెల తెలవారేముందు కొద్దిగా జోగుతూ వచ్చింది పరిగ. తీరాచూస్తే ఇంకేంవుంది. తన గుమ్మాని కెదురు గానేవుంది ఒక వాలగ. ఆ వాలగ రోజు రోజంతా అక్కడే

బైరాయించింది. కాని మన పరిగ మహా చురుకు. అసలు కన్నం కదిలి ఈవలికి రానేలేదు.

ఇలా ఆపదలు దాటడం ఒకసారి కాదు. రెండుసార్లు కాదు. ప్రతిరోజూ అతిసాహసంతో విజయం పొందుతూనే వుంది. ఇంకా బ్రతికే వున్నానురా బాబూ" అనుకుంటూనే వుంది.

అంతటితోనే అయిందా. మన పరిగ అసలు పెళ్ళే చేసుకోలేదు. అందుకని పిల్లాపీచూ బెడదలేదు. తన తండ్రి సంసారం చాలా పెద్దది. "అసలు నా జీవితంతో పోల్చి చూస్తే నాన్న బ్రతుకేమిటి నవ్వులపాలు బ్రతుకు!" అని అనుకొంటూ వుండేవాడు.

ఆ రోజుల్లో వాలగలకు చాలా కరుణవుండేది. చందు వలు కూడా ఇలాంటి చిన్న చాపలను ఆశించేవి కావు. ఆ రోజుల్లో తన తండ్రి ఒకప్పుడు పులుసు కుండలో పడబోయాడు. కాని, తోకపట్టుకొని నీళ్ళల్లోకి విసరడాని కప్పుడొక ముసలివాడున్నాడు. ఈ రోజుల్లో ఏటిలో చేపలే కరువయ్యాయి. అందుకని పరిగలేగొప్ప. అబ్బెబ్బే పిల్లలూ సంసారం లాభంలేదు. నువ్వు బ్రతికుంటే అక్కడికదే పదివేలు- ఇలా తలపోస్తూ వుండేవాడు.

ఈ విధంగా వైరాగ్యంగల ఆ పరిగ నూరేళ్ళకు పైగానే బ్రతికింది. ఈ నూరేళ్ళూ గజగజ వణుకుతూనే కాలక్షేపంచేసింది. స్నేహితులులేరు, చుట్టాలులేరు. తానెవరింటికీ వెళ్ళడు. ఒకర్ని తన ఇంటికి పిలవడు. చీట్లపేక ఆడడు. సారాతాగడు. చుట్టకాల్చడు. అందమైన అమ్మాయిల

వెంట ఎప్పుడూ పడలేదు. అతడు చేసేదల్లా గజగజగజ వణకడం. "దేవుని దయవల్ల నే నింకా బ్రతికే వున్నాను" అనుకొంటూ వుండడం. అంతే.

అలా వుండగా వుండగా వాలుగలుకూడా అతడిని పొగడ్డం మొదలుపెట్టాయి. "అసలు ఈ జలచరాలంతా అతనిలాగే బ్రతుకుతే ఎంత బాగుంటుంది?" అని అంటూ వుండేవి. ఇలా అనడానికి కారణం లేకపోలేదు. ఏదో ఒక విధంగా ఉబ్బేసి పరిగను బైటికి లాగాలని వాటి ఎత్తు. కాని మనవాడుమాత్రం ఆ జిత్తుల కెన్నడూ లొంగలేదు.

మొదటి శతాబ్దం తర్వాత మరెన్ని సంవత్సరాలు అతడు బ్రతుకుతాడో మేం చెప్పలేం. కాని, కొసకు కాలం ముంచుకు వచ్చింది. ఒకరోజున కలుగులో వచ్చేప్రాణం పోయేప్రాణంగా పడుండి "దేవుని దయవల్ల అమ్మా - నాన్న లాగే సహజ మరణమే నాక్కూడా ప్రాప్తిస్తోంది" అనుకొన్నాడు. "మనమంతా కూడా ఈ విరాగి పరిగ లాగానే బ్రతికితే ఎంత బాగుండును" అని వాలగలన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. అయితే అప్పుడు ఈ జీవితం ఏలా వుంటుంది?



తన అమూల్యమైన తెలివితేటలు, చదువులు అన్నీ జ్ఞాపకం చేసుకొన్నాడు. "అలాగైతే మొత్తం పరిగ జాతే నశిస్తుంది" అని ఎవరో చెవులో ఊదినట్లు అనిపించింది.

జాతి వృద్ధిపొందాలంటే ముందు సంసారం కావాలి. ఈ పరిగకు అసలు సంసారమే లేదు. అంతటితో ఆగిందా? పరిగజాతి తామర తంపరగా అభివృద్ధి చెందాలంటే అవి

సహజసిద్ధమైన ప్రదేశాలలో వుండాలే కాని ఇలాంటి చీకటి కోణాల్లో కాదు. పిల్ల పరిగలకు తగిన తిండివుండాలి. సాహసం వుండాలి. ఒకరితో ఒకరు పరిచయాలు చేసుకొని ఒకరి మంచి గుణాలను మరొకరు నేర్చుకోవాలి. అలా అయినప్పుడే జాతి నీరసించకుండా వుంటుంది.

బ్రతుకంతా భయంతో వణుకుతూ సగంచచ్చి సగం పిచ్చెక్కి తమ కన్నాల్లోనే కాలక్షేపంచేసే పరిగలను సత్పౌరులనడానికి వీల్లేదు. అలాంటివా రెందుకూ కొరగారు. ఇతరులకు వారు ఉత్సాహమూ కలిగించలేరు. నిరుత్సాహమూ కలిగించలేరు. అలాంటివారికి కీర్తిరాదు. అపకీర్తిరాదు. గౌరవమూ వుండదు, అగౌరవమూవుండదు. అలాంటివారి జీవితం కూటికిచేటు.

ఇదంతా పరిగకు చాలా స్పష్టంగా అవగతమయింది. దానితో ఒక కొత్త ఉత్సాహం పుట్టి తలెత్తి ఏటిలో వీర విహారం చేయాలనిపించింది. అలా అనిపించేసరికి మళ్ళీ గుండె భయంతో దడదడ లాడింది. ఆ భయంతోనే గడియలు లెక్కపెడుతూ పడివుంది. భయంతోనే ఇన్నాళ్లూ బ్రతికింది. ఆ భయంతోనే ఇప్పుడు మరణిస్తుంది.

పరిగకు గత జీవితమంతా కళ్ల ముందు కనిపించింది. తనెన్నడైనా చిరునవ్వు నవ్వాడా? ఓ మిత్రుడితోనైనా కులాసాగా గడిపాడా? ఏ దారేపోయేవాడికైనా ఇంత ఆశ్రయం యిచ్చాడా? ఆదరణ చూపాడా? కష్టాల్లో మునిగిన ఏ వొకరికైనా అండగా నించున్నాడా? పోనీ, తనని గురించి ఎవరికైనా తెలుసా? తనపేరన్నా తెలుసా? ఈ ప్రశ్నలన్నిటికీ ఒకే ఒక జవాబు తట్టింది 'లేదు!' అని.

అతగాడి బ్రతుకంతా వజవజవణుకుతోనే గడిచింది! ముంగిట మృత్యువు కాచుకొని కూర్చున్న ఈ సమయంలో కూడా పరిగ గుండె భయంతో కొట్టుకొంది. ఎందుకో ఈ భయం ఏమీ తెలియదు. కన్నంలో అంతా చీకటి. కదలడానికి కూడా వీల్లేనంత ఇరుకు. ఒక్క వెలుగు రేఖ కూడా అక్కడికి రాదు. ఆ చీకటి ఇరుకు కన్నంలో నిస్సహాయంగా, నీరసంగా పడివుంది. ఆకలికి నకనకలాడుతూ మృత్యువుకోసం ఎదురుచూస్తున్నది.

ఇతర చాపలు పక్కనుంచి పరుగెడుతున్న శబ్దం వినిపిస్తున్నది. బహుశా అవి తనలాగే పరిగలు కావచ్చును. అందులో ఒక్కదానికి కూడా తన సంగతి పట్టలేదు. "వాలుగ నోటపడకుండా, పీతలవాత పడకుండా, గాలానికి బలికాకుండా ఈ పరిగ నూరేళ్లకుపైగా ఎలా బ్రతక గలిగింది" అని అడుగుదామన్న జ్ఞానం ఒక్క చాపకు కూడాలేదు. అన్నీ ఏమీపట్టనట్టే ఈదుకొంటూ పోయాయి. ఈ చీకటికన్నంలో మహాజ్ఞాని అయిన పరిగకు అవసానకాలం వచ్చిందన్న సంగతి కూడా బహుశా వాటికి తెలియక పోవచ్చు.

అసలు తన విజ్ఞతను గురించి ఎవరూ చెప్పుకొనక పోవడం మరీ బాధ కలిగించింది మన పరిగకు. "అన్న పానీయాలు మాని ఎవరికంటా పడకుండా ఆ చీకటి కన్నంలో వున్న ఆ మూర్ఖుణ్ణి చూశావా?" అనైనా కనీసం ఎవరూ అనడంలేదు. వాడొక తెలివితక్కువ దద్దమ్మ! వాడివల్ల ఈ ఏటి కంతకీ అప్రతిష్ఠ వస్తోంది అని కొంతమంది అన వచ్చును.

ఇలా ఆలోచించగా కొంసకు మగత కమ్మింది. అది చావుకుముందు వచ్చే మగత. మృత్యుదేవత గుసగుసలు ఏవో చెవినబడుతున్నాయి. మరొకసారి యిష్టమైన కల కన్నాడు. లాటరీలో రెండు లక్షల రూపాయలు వచ్చినట్లు, తానొక అరగజం పొడవు పెరిగినట్లు, వాలుగనే పుక్కిట పెట్టినట్లు కలకన్నాడు.

అలా కలలుకంటూవుండగా మెలిమెల్లిగా పరిగ ముక్కు కన్నంబైట పడింది.

అంతే, హఠాత్తుగా మాయమైపోయాడు. ఏమైనట్లు? వాలుగ మింగేసిందా? పీత విరిచేసిందా? సహజమైన మృత్యువే వచ్చిందా? ఏమో చూసినవారులేరు; చెప్పగలిగినవారూ లేరు. బహుశా అతడు మరణించివుంటాడు. సగం చచ్చిన ముసిలి పరిగ అందులోనూ విరాగి అయిన పరిగ ఏ వాలుగకు రుచిస్తుంది కనక?





# స్వార్థ మెరగని కుందేలు

తోడేలు దృష్టిలో కుందేలు నేరంచేసింది. ఆగకుండా గుహాముంతుదుంచి పరుగు పెడుతున్న కుందేలును పసి కట్టింది తోడేలు. "ఇదుగో కుందూ కాస్త ఆగమ్మా" అంది తోడేలు. ఆ మాటను కుందేలు ఖాతరు చేయలేదు. అంతేనా, ఇంకా వడిగా పరుగు పెట్టింది. అయినా తోడేలు మూడంగల్లోనే దాన్ని ఒడిసి పట్టుకొంది. "ఇదుగో! చెప్పి నప్పుడు నువు ఆగలేదు, అందుకని నిన్ను ఖండ ఖండాలుగా ఖండించాలని శిక్ష విధిస్తున్నాం. ఐతే మాకూ, మా శ్రీమతికీ ప్రస్తుతం ఆకలిగాలేదు. అదీకాక ఐదు రోజులవరకూ సరిపడిన సంభారాలున్నాయి. అందుకని ఈ తుప్పకింద కూచుని నీ వంతువచ్చేవరకూ ఎదురుచూస్తూ ఉండు. విన్నావా?

బహుశా మేం నిన్ను క్షమిస్తామేమోకూడా !" అని ఒక్క పెడసవ్వుతో ఫర్మానాచేసింది తోడేలు.

పాపం కుందేలు ఏం చేస్తుంది. కిమ్మనకుండా తుప్పకింద కూచుంది. 'ఇంక చావుకెన్ని గంటలు బాకీ' అన్న ఆలోచన తప్ప కుందేలుకు మరొక ధ్యాస లేదు. బెదురు బెదురుగా ఎప్పుడైనా గుహవైపు చూసిందా తోడేలు కళ్లు చింతనిప్పుల్లా కనిపించేవి. ఒకొక్కప్పుడూ తోడేలు భార్యను తీసుకొని కుందేలుముందు పచార్లు చేస్తూ వుండేది. ఓరకంటితో కుందేలును చూసి తోడేలు భాషలో ఏదో తన భార్యతో చెప్పేది. ఆ తర్వాత అ రెండూ విరగబడినవ్వేవి. తోడేలు పిల్లలు కూడా వీటికి తోడయ్యేవి. పళ్లు పటపటలాడిస్తూ కుందేలు పైకి పంజా విసిరి చెలగాట మాడేవి. పాపం అలాంటప్పుడు కుందేలు గుండె పాదాల్లోకి జారిపోయేది.

ఇప్పుడు కుందేలుకు ప్రాణం మీద మహాతీపి పుట్టింది. మంచి యవ్వనంలో వుంది. ఐనా ఒద్దిక గలది. మొన్న మొన్ననే ఒక వితంతు కుందేలు కూతుర్ని ప్రేమించి పెళ్ళి చేసుకొనడానికి నిశ్చయించుకొంది. ఆ ప్రియురాలి కోసం పరుగుపెడుతూ వుంటేనే ఈ తోడేలు అడ్డుతగిలి కాళ్ళకు బందాలు వేసింది. పాపం అక్కడ ఆ వెర్రిపిల్ల ప్రియునికోసం ఎదురు చూసి చూసి "బహుశా ఆ వాలుగన్నుల వన్నెకాడు కల్లబాస లాడెనేమొ" అనుకొంటూ వుండవచ్చును. లేదా చూసి చూసి లాభం లేదనుకొని మరొకణ్ణి వరించి వుండవచ్చును. అదీకాకపోతే అలా తుప్పల్లో కూచుని ఎదురు చూస్తూ వుండగా ఏ తోడేలైనా కబళించి వుండవచ్చును.

ఇలాగ మనస్సు పరిపరివిధాలపోయి పాపం కుందేలు కళ్లు చెమ్మగిల్లాయి. దాని తీయటి కుందేటి కలలన్నీ కరిగి పోతున్నాయి. కొద్ది రోజుల్లోనే వివాహం చేసుకొందామను కొంది. పెళ్ళయిన తర్వాత తానూ తన ప్రేయసీ ఫలహారాలు చేస్తూ సరసాలాడుకోనడాన్ని ఊహించుకొంది. అలాంటి దిప్పు డిక్కడ నిర్బంధం! ఇంకా చావు కెన్నిగంటలు వున్నాయి?

ఒకనాటి రాత్రి అలా కూచుండగానే కునుకుపాట్లు వచ్చాయి. తోడేలు తనను ప్రత్యేక రాయబారిగా నియ మించినట్లు తాను రాచకార్యాల్లో మునిగివున్నప్పుడు తోడేలు తన ఇంటికి వస్తూపోతూ వున్నట్లు కల కన్నది ఎవరో డొక్కలో పొడిచినట్లు ఉలికిపడి మేల్కొంది. కళ్ళు తెరిచి చూస్తే ఎదురుగా తన కాబోయే బావమరది కనిపించాడు. "లేవోయ్ బావా! పెళ్ళికూతురికి ప్రాణంమీదికి వచ్చింది. నీ స్థితి విన్నప్పటినుంచీ నిద్రాహారాలు లేవు. కడసారి చూపు అందుతుందో అందదో అన్న బెంగ ఒక్కటే వుంది" అంది ఆ వచ్చిన కుందేలు.

ఈ కబురు వినేసరికి పాపం కుందేలు గుండెకాయ వక్కలైపోయింది. ఈ దుర్గతి పట్టడానికి తాను చేసిన పాప మేమిటి? తా నెవరిమీదా కుట్రలు పన్నలేదు. విప్లవాలు నడపలేదు. ఆయుధాలు తీసుకొని ప్రభుత్వంమీద ధ్వజం ఎత్తలేదు. కేవలం తన స్వంత పనిమీద పరుగెత్తింది. అంత మాత్రానికేనా ఈ మరణశిక్ష? మరణం అన్నమాట ఎంత భయంకరమైనది? ఈ మరణం తనొక్కడికే కాదు ఆవిడకు

కూడా. పాపం ఆవిడ చేసిన పాపమల్లా మనసారా తన కుందును ప్రేమించడం అంతే! తనకు రెక్కలేవుండి ఆవిడ ముందు వాలగలిగితే? పొడవాటి ఆవిడ చెవులను నిమిరి ఆ చిట్టితలను వేయి ముద్దులు కురిపించగలిగితే?

ఇలా ఆలోచిస్తూవుండగా "పద పరుగెత్తుదాం" అంటు న్నాడు కాబోయే బావమంది!

ఆ మాట చెవినిపడేసరికి కుందేలుకు కొత్త జవం వచ్చింది. అప్పటికే చెవులు వెనకకు వాల్చి నడుము కుదించి కూర్చునివుంది. ముందు కురుకుతే చాలును ఆఘ మేఘాల మీాద పోవచ్చును. అప్పుడసలు వెనక్కి తిరిగి గుహావైపు చూసి వుండవలసిందికాదు. కాని ఏం లాభం? చూసింది. గుండెజారింది.

"రాలేను. తోడేలుగారి హుకుం!" అని గొణిగింది. తోడేలు ఆదినుంచీ అంతా కనిపెడుతూనేవుంది. అంతా వింటూనేవుంది. భార్యవైపు తిరిగి ఏదో చెవులో గుసగుస లాడింది. బహుశా కుందేలు సత్ప్రవర్తనను గురించి మెచ్చు కొంటున్నదేమో!

"పారి పోదాంపద" అంది కబురు తెచ్చిన కుందేలు.

"ఎలారాగలను?" అంది ఖైదీ కుందేలు.

"ఏమిటి గూడుపుఠాణీ చేస్తున్నారు?" అని హఠా త్తుగా గర్జించింది తోడేలు.

కుందేళ్ళు రెండూ హడలెత్తి పోయాయి.

కావలి స్థానం విడిచిపెట్టమని బంటుకు దుర్బోధ చేయ డమా? దానికి శిక్షేమిటి? చట్టంలో ఏంవుంది? పాపం

కుందేలు అటు ప్రియురాలినీ ఇటు బావమరిదినీకూడా గోల్పోవలసి వుంటుంది. తోడేలు కుంటుంబం వాటిని చీల్చుకొని తింటుంది.

ఆ రెండు కుదేళ్ళూ అదురునుండి తేరుకొన్నారో లేదో పళ్ళు పట పట గీటుతూ కళ్ళ నిప్పులు చెరుగుతూ తోడేలూ, తోడేలు భార్యా ఎదురుగావచ్చి నిలబడ్డాయి.

"మేం నేరమేమీ చేయలేదు మహాప్రభో! మేం మాట్లాడుకుంటున్నామంతే. ఇది మా పొరుగింటి కుందేలు. నన్ను చూడ్డానికి వచ్చింది. అంతే" అని ఖైదీ కుందేలు సగం చచ్చి వణుకుతున్న కంఠంతో మనవి చేసుకొంది.

"నేరమేమీ చేయలేదూ? నీ సంగతి నీకన్న మాకెక్కువ తెలుసునులే. అసలు నిన్ను నమ్మడానికి వీల్లేదు. ఏమీ దాచకుండా వున్నదున్నట్లు చెప్పండి"

"మహాప్రభో! అసలు విషయం ఇది" అని ప్రారంభించింది రెండవ కుందేలు.

"మా చెల్లెలు, ఇతగాని ప్రియురాలు, చావుబ్రతుకుల మీదుంది. కడసారి కళ్ళారా చూడ్డామని దానికోరిక. దేవర వారు కరుణించి ఒక్కసారి వెళ్ళిరావడానికి సెలవిప్పించాలి"

"హుం. ప్రియురాలు ప్రియుణ్ని ప్రేమిస్తోంది. బాగుంది. అంటే కుందేలు పిల్లలు చాలా పుడతాయన్నమాట. మాకు చాలా ఆహారం సమకూరుతుంది." అంది ఆడతోడేలు. "మేంకూడా ఒకరి నొకరం ప్రేమించు కొంటున్నాం. మాకు చాలామంది పిల్లలున్నారు. ఇప్పుడు మాతో వున్న చంటివాళ్ళు నలుగురు. పెరిగి పెద్దవాళ్ళై

రెక్కలు వచ్చినవాళ్ళు చాలామంది వున్నారు. అయితే ఏమండీ పాపం పెళ్ళికూతుర్ని చూసివస్తాడట. కడసారి కోరిక మన్నించరూ?" అని అడిగింది అనునయంగా భర్తను.

"కాని మనం వాణ్ని రేపే భోజనం చేయవలసి వుందికదా ?"

"మహా ప్రభో! చిటికలో తిరిగి వస్తాను. నన్ను నమ్మండి!" అంది రొప్పుతూ ఖైదీ కుందేలు.

తోడేలు భార్యకు చాలా విచారం వేసింది. "చూడండి! అలగా జంతువు కుందేలు తన ప్రియురాలి నెంత గాఢంగా ప్రేమిస్తున్నదో!" అంది భర్తతో. భార్య అలా అన్న తర్వాత తోడేలు ఇంకేం చేయగలుగుతుంది ? అనుకొన్న ప్రకారం ఆలస్యం చేయకుండా తిరిగి రావాలనే షరతుమీద కుందేలు ప్రయాణానికి అనుమతించింది. కుందేలు తిరిగి వచ్చేవరకు దాని బావమరిదిని ఇక్కడ ఖైదీగా వుంచుతానంది.

"ఎల్లుండి ఉదయం ఆరుగంటలయే సరికి నీవు తిరిగి రాకపోతే నీ బావమరిదిని తినేస్తాం. నీవు అదనులో తిరిగి వస్తే ఇద్దర్నీ తినేస్తాం. చిత్తంవస్తే నిన్ను క్షమిస్తాం" అంటూ ఒక్క వెడనవ్వు నవ్వింది తోడేలు.

కుందేలు బాణంలాగ దూసుకుపోయింది. అడుగుపడిన చోట నేల దద్దరిల్లింది. కొండలువస్తే వాటిమీదుంచి దొర్లుకొంటూ పరుగెత్తిస్తుంది. ఏరువస్తే రేవుకోసం చూడలేదు. ఏటికడ్డంపడి ఈదింది. కుందేలు ఇల్లు మూడార్ల రాజ్యంలో వుంది. అక్కడికి వెళ్ళి మంగళస్నానం చేసి పెళ్లాడాలి. మళ్లీ తోడేలు ఫలహారం వేళ మించకుండా తిరిగి రావాలి.

కుందేలు వేగాన్ని చూసి పక్షులుకూడా ఆశ్చర్య పోయాయి. "కుందేళ్ళకు గాలితప్ప కలేజా వుండదని మాస్టారు దండకవిలె పత్రిక రాసింది. అయినా చూడు ఆ కుందే లెలా పరుగెడుతోందో" అని పిట్టలు చెప్పుకున్నాయి.

ఏలాగైతేనేం కుందేలు ఇల్లు చేరుకొంది. అప్పటి దాని సంతోషాన్ని చెప్పడానికి నోరుచాలదు. రాయడానికి చేయి చాలదు. అక్కడచిట్టికుందేలుకు ప్రియుడు కంటపడగానే జ్వరం దిగిజారింది. లేచి కూర్చుని తన చిట్టి పంజాతో చిన్న డప్పును వాయించింది. అసలు తన ప్రియుణ్ణి ఆశ్చ ర్యంలో ముంచుదామని డప్పువాద్యం నేర్చుకొంది. చిట్టి కుందేలు తల్లి వృద్ధ వితంతువు సంతోషంలో ఒళ్లు మరచి పోయింది. అల్లుడి కెక్కడ పీటవేయాలి. ఎక్కడ ఆకు వేయాలి. ఏం వడ్డించాలి. అన్న ఆలోచనలతో అతలాకుతలమైపోయింది. పెళ్ళికూతురు చుట్టాలు, పక్కాలు, స్నేహి తులు పరుగులు పెట్టుకొంటూ వచ్చారు. పెళ్ళికొడు కెలా వుంటాడో చూడాలని తహతహ. పెళ్ళి విందుమీాద యావ.

పెళ్లికొడుక్కుమాత్రం ముళ్ళమీాద కూర్చున్నట్లుంది. పెళ్లికూతురుకు రెండు ముద్దులైనా పెట్టలేదు. అప్పుడే "త్వరత్వరగా మంగళ స్నానాలు కావాలి. వెంటనే పెళ్లి అయిపోవాలి" అని గొడవ ప్రారంభించాడు.

"ఏం బాబూ ఏమిటాతొందర ?" అంది అత్తగారు ముసిముసి నవ్వులు ఒలికిస్తూ.

"నేను రేపే వెళ్లిపోవాలి. తోడేలు ఒక్కరోజు మాత్రమే సెలవిచ్చింది."

వెక్కి వెక్కి ఏడుస్తూ కథంతా చెప్పింది కుందేలు అసలు వెళ్ళడానికి కాళ్లురావడం లేదు. అయినా వెళ్లాలి. మాట ఇచ్చిందాయెమరి. కుందేళ్లకు మాటనిలకడవుండాలి. వచ్చిన చుట్టాలూ పక్కాలూ అంతా సలహా సంప్రతింపులు చేసి వారుకూడా అదే అభిప్రాయానికి వచ్చారు. "నిజమే బాబూ. మాటంటే మాటే. నిలబడి తీరాలి. మాట తప్పిన కుందేలు మన చరిత్రలో ఎక్కడా లేదు" అన్నారు.

చెప్పడానికి ఎక్కువ సేపు పట్టదు. కాని కుందేళ్ళలో చేయడానికి కూడా ఎక్కువ సేపు పట్టదు. ఉదయానికల్లా కుందేలుకు వివాహం అయిపోయింది. సాయంత్రం కొత్త పెళ్ళికూతురివద్ద సెలవు తీసుకొని బయలు దేరింది.

"తోడేలు నన్నెలాగా తినేస్తుంది. తప్పదు. నీవు మాత్రం పాతివ్రత్యానికి హానిరానివ్వకు. పిల్లలు పుడితే వాళ్ళను పాడుచేయకు. వాళ్ళు దప్పువాద్యమే కాదు. రెల్లు గొట్టంలోంచి బటాణీలను ఉండేలు గుళ్ళలా వూదడంకూడా నేర్చుకొంటారు."

అలా అని వెంటనే ఏదో కలకన్నట్లు (బహుశా తోడేలు జ్ఞాపకం వచ్చివుంటుంది) "బహుశా తోడేలు క్షమించ వచ్చునేమో" అంది కుందేలు.

అవే కడసారి చూపులు.

ఇక్కడ కుందేలు పెళ్లి వేడుకలలో ప్రియురాలితో సరససల్లాపాలలో వుండగా ఈ దేశానికీ తోడేలు గుహావున్న దేశానికీ మధ్య మహా ఉత్పాతాలు వచ్చాయి. వానలు పడి ఒకచోట ప్రళయమే వచ్చింది. వచ్చేటప్పుడు కుందేలు

దారిలో ఏరును అవలీలగా దాటగలిగింది. కాని ఇప్పుడా ఏటికి వరదపోటు తగిలి కోసెడు వెడల్పున సుడులు తిరుగుతూ పారుతోంది. మరొకచోట మన కుందేలు వెళ్లవలసిన దారిలో నాపరాజుగారు నూపరాజుగారి మీదికి దండెత్తి వచ్చారు. ఇప్పు డక్కడ ఇరువాగులవారికీ తుముల యుద్ధం సాగుతోంది. ఇంకొకచోట మహమ్మారి గత్తర వ్యాపించింది. అందుకని మన కుందేలు పాతికామడలు చుట్టు తిరిగి పోవలసి వుంటుంది. అదీకాక అడుగడుగునా ఎన్ని తోడేళ్ళు, ఎన్ని నక్కలు పొంచివున్నాయో ఏమో!

మన కుందేలు చాలా జాగ్రత్తగలది. తాను ప్రయాణం చేయవలసిన దూరాన్ని తనకున్న వ్యవధిని జాగ్రత్తగా బేరీజు వేసింది. మూడు గంటలుముందే బయలుదేరింది. కాని దారిలో అడుగడుగునా అడ్డంకులు ఎదురవడంతో పాపం నరాలన్నీ చప్పబడ్డాయి. గుండెలు బేజారెత్తాయి. పగలల్లా పరుగెత్తింది. రాత్రల్లా పరుగెత్తింది. సూదుల్లాంటి రాళ్ళు గుచ్చుకొని అరికాళ్ళు నెత్తుర్లు చిమ్మాయి. ముళ్ళపొదలకు వళ్ళంతా గీసుకుపోయింది. కరాకంపా కాళ్ళకు అడ్డంబడ్డాయి. కళ్ళు బైర్లుకమ్మాయి. నోటివెంట వచ్చే నురగ ఎరుపుడాలెక్కింది. ఇంకా పరుగెత్తవలసిన దూరం చాలా వుంది. అక్కడ తోడేలు దగ్గర ఖైదీగా వున్న తన బావమరిది రూపు మనసులో మెదులుతోంది. తోడేలు గుమ్మంముందు కావలి కాస్తూ తన బావగారు ఎప్పుడు వస్తారా ఎప్పుడు వస్తారా అని గంటలు లెక్కపెడుతున్నట్లు కనిపించింది. అడవులు, కొండలు, ఏరులు వంకలు ఏవీ లెక్కకు రావడంలేదు. గుండె

పగిలిపోయేటట్లుంది. అనవసరమైన ఆందోళన రాకుండా వుండేందుకని గుండెకాయ తీసి చేత్తో పట్టుకొంది. కన్నీళ్ళ కిది సమయంకాదు. చింతలూ వంతలూ ఇప్పుడు పనికిరావు. అక్కడ మిత్రుడు అపాయంలో వున్నాడు. అతడిని తోడేలు బారినుంచి తప్పించాలి. అదొక్కటే కుందేలుకున్న ఆలోచన.

తెల తెలవారవచ్చింది. గబ్బిలాలు, గుడ్లగూబలు గూళ్ళకు తిరిగి పోతున్నాయి. వేకువ చలిగాలి వీస్తోంది. అంతలో ప్రాణా లెగిరిపోయినట్లు తోచింది. అయినా కుందేలు పరుగుమానలేదు. "సరియైన సమయానికి చేరుకొగలనా ?" అన్నదొక్కటే మెదడులో మెదులుతున్నది.

తూరుపు ఎర్రవారింది. తొలిసంజె వెలుగు దూరాన మబ్బులకు మలామాపూస్తోంది. వెలుగు క్రమంగా విప్పారింది. భళ్ళుమని తెల్లవారింది. పచ్చగడ్డిమీది మంచుబొట్లు వెలుగు పడి మిలమిల మెరిశాయి. పక్షుల కలకూజితాలు విన్పిస్తున్నాయి. చీమలు జీవనయాత్ర ప్రారంభించాయి. ఎక్కడ నుంచో పొగలాంటి ఒక తెరగమ్మింది. పొలాలమీద గలగల ధ్వనులు పారాడాయి. కాని కుందేలుకు ఇవేవీ వినిపించడం లేదు. కనిపించడంలేదు. "లేదు మానేస్తం ఇక లేదు !" అని ఒకటే గొణుగుడు.

ఇక్కడొక కొండ, ఆ తర్వాత చిత్తడి బీడు. అది దాటితే తోడేలు గుహ. "అయ్యో కుందూ వెనకబడ్డావోయ్" అని స్వగతంగా అనుకొంది. నవనాడులూ కూడ దీసుకొని కొండమీదికి ఎగబాకింది. అమ్మయ్య అనుకొంది. అంతే ఇంక సత్తువలేదు. సమయానికి చేరుకోలేదు.

అక్కడి కెదురుగానేవుంది గుహ. ఎక్కడో దూరాన గడియారం ఆరు కొట్టింది. ఒక్కొక్కగంటా కుందేలు గుండె మీద సమ్మెట పోటులా పడింది. ఆరోగంట కొట్టగానే తోడేలు ఇవతలికి వచ్చింది. ఒక్కసారి వళ్లు విరుచుకొని, తోక ఆడించి చూసింది. ఖైదీ పొట్టలో గోళ్ళుగుచ్చి తన కోక చెక్కా, భార్యకోక చెక్కా చీల్చుదామనుకొంది. తోడేలు పిల్లలుకూడా ముకుపుటా లాడిస్తూ పళ్ళు గీటుతూ అమ్మదగ్గరే వున్నాయి. అవి నాన్న చేస్తున్నదానిని చూస్తూ పాఠం నేర్చుకొంటున్నాయి.

ఇంతలో "ఇదుగో వచ్చాను" అని కోటి కుందేళ్ల బలంతో అరిచి కొండ కొమ్మునుంచి కిందికి దొర్లింది కుందేలు.

తోడేలు కుందేలును ప్రశంసించింది.

"కుందేళ్లను నమ్మవచ్చునని ఇప్పుడు తెలుసుకున్నాం. సరే ఇదిగో నా నిర్ణయం: నా అవసరం వచ్చేవరకూ మీరిద్దరూకూడా ఈ తుప్పకిందే కూర్చోవాలి. ఏమో ముందు నిన్ను క్షమిస్తానేమో!"





# పాప పుణ్యాలు

పాపపుణ్యాలు కలహించి పూర్వం ఎప్పుడో విడి పోయాయి. పాపాలు తెలివితేటలతో వ్యవహరించి సుఖంగా జీవితం గడుపుతున్నాయి. కాని పుణ్యాలకు బ్రతుకు వెళ్ళ మారడమే గగనంగావుంది. అయితేనేం బాల శిక్షల్లోనూ, వాచక పుస్తకాల్లోనూ వాటికి మంచి ప్రశస్తిఉంది. కీర్తి ప్రతిష్టలెన్ని ఉన్నప్పటికీ "అయ్యో మనంకూడా పాపాల్లాగే సుఖంగా బ్రతకడానికి ఏమైనాచేస్తే ఎంత బాగుండును !" అని అప్పుడప్పుడు అనుకొనడంకద్దు. కాని ఆ పని మాత్రం చేయ లేకపోయేవి.

వారిలో వారికి కలహం ఎందుకు వచ్చిందో ముందు ఆ కయ్యాన్ని ఎవరు ప్రారంభించారో చెప్పడం కష్టం. బహుశా

తోలుత పేచీపెట్టింది పుణ్యాలేకావచ్చును. పాపాని కిప్పుడు మంచి పలుకుబడి వుంది. నానారకాల చిలిపిచేష్టల్లోనూ సిద్ధహస్తుడు. వాడు మొదట విహారానికి బయలుదేరి నప్పుడు పెద్ద పెద్ద అంగలువేస్తూ ప్రపంచాన్నంతా చుట్టిపెట్టాడు. పట్టు పీతాంబరాలు బంగారు భూషణాలూ తొడిగి జగాన్ని మిరుమిట్లు కొలిపాడు. పుణ్యాలువాడి ముందు వెలవెల పోయాయి. అది చూసిన పుణ్యాలకు చాలా మనస్తాపంకలిగింది.

“ఒరే! దగాకోరూ నీ పట్టు పీతాంబరాలతో ఎంత కాలం కులుకుతావులే! ఎప్పటికైనా చింకిరిపాతలు కట్టిన మమ్మల్నే ప్రజలు గౌరవిస్తారు” అని పుణ్యాలు పాపాన్ని శాపాలు పెట్టాయి.

“తథాస్తు. అలాగే గౌరవం పొందండి” అని పాపాలు జవాబిచ్చాయి.

పాపాలు ఇలా వెక్కిరించడం చూసి పుణ్యాలకు ఒళ్ళు మండింది. పాపాలను తిట్టుకొంటూ దేశంమీదికి బయలు దేరాయి. చింకిపాతలు, జీబు జుట్టుతో వీధి మొగల్లో నిలిచి దారేపోయేవాళ్ళ నందర్నీ పిలిచి “ఇదిగో మీరంతా బుద్ధిమంతులు, మేం చింకిపాతలతో వున్నప్పటికి మమ్మల్నేగా మీరభిమానిస్తున్నారు. నిజం చెప్పండి”అని ఊదర పెట్టాయి.

“ఇదుగో ఇటీవల మీ గొడవ మరీ ఎక్కువయింది. దారి కడ్డంలెండి. మీకు పుణ్యంవుంటుంది” అని దారినపోయే వారంతా అనేవారు.

పుణ్యాలు న్యాయస్థానాలకు విన్నపాలు పంపు కొన్నాయి. తమ రక్షకులైన పోలీసులను కదిలించి చూశాయి.

"మీ కళ్ళెక్కడున్నాయి! ప్రజల కళ్ళేలు విడిచి పెట్టేస్తే ఎలాగ? వాళ్ళు పాపకూపంలో పీకలబంటి మునిగి వున్నారని తెలుసునా?" అని ప్రశ్నించాయి.

కాని పోలీసులు ఉలకలేదు. పలకలేదు. పాపాలను చూస్తేమాత్రం కొయ్యల్లా నిలబడి శాల్యూట్ చేసేవారు. పుణ్యాలు హతాశులై బెదిరింపులకు దిగాయి.

"ఉండండి. ఉండండి. ఇంతకింతా అనుభవించి తీరుతారు." అని శాపాలు పెట్టాయి పుణ్యాలు!

ఇలా వుండగా పాపాలు ఆనాటి కానాడు వీర విహారం ప్రారంభించాయి.

"ఓహో! ఏం పిల్లి శాపాలు! ఇంతకింతా అనుభవిస్తామా? మా మాట ఏమో కాని మీరు పుట్టినప్పటినుంచీ మాత్రం నరకం అనుభవిస్తూనే ఉన్నారు. ఆ రూపం చూడండి. పగలు చూస్తే రాత్రి కల్లోకి వచ్చేట్టుంది. ఒట్టి ఎముకలగూళ్ళు. కోపంతో పళ్ళుకొరకడం తప్ప వ్యవహార జ్ఞానం మాత్రం లేదు." అని పాపాలు, పుణ్యాల మీదికి లేచాయి.

ఇలాగ రోజులు గడిచినకొలదీ వీరి వైషమ్యం ముదురుతూనే వచ్చింది. ఒక్కొక్కప్పుడది సిగపట్లవరకూ వచ్చేది. అలాంటప్పుడు అదృష్టం సాధారణంగా పుణ్యాలను విడిచిపెట్టి పోయేది. గెలిచిన పాపాలు ఓడిన పుణ్యాలకు అరదండాలు తగిలించి "అల్లరిమూక. కదలకుండా ఇక్కడే

పడుండండి" అని పోయేవి. కొత్త అధికారాలు వచ్చి విముక్తి కలిగించేవరకూ పుణ్యాలు అలాగే బందీలై పడివుండేవి.

ఒకసారి వీరిలాగ జుట్టూ జుట్టూ పట్టుకొంటూ వుండగా పరమానందయ్య ఆ దారిన వచ్చాడు వీరిని చూసి —

"ఏమిటీ తెలివితక్కువపని. మీకేమైనా మతి వుందా లేదా ? ఆదిలో మీరంతా ఒకలాగే వుండేవారు. అంతా "గుణాలు"మాత్రమే. ఆతర్వాత మనుషుల లోభ మోహాలవల్ల పాప పుణ్యాలు ఏర్పడ్డాయి. కొన్ని గుణాలను అణచివేసి మరికొన్నింటికి స్వేచ్ఛనిచ్చారు. దానితో అంతా తారుమారూ తల్లక్రిందులూ అయింది. సంక్షోభం, విద్వేషం, విషాదం అవతరించి ప్రపంచాన్ని అలముకొన్నాయి. అందు కని మీ ఆదికాలం వైపు దృష్టి సారించండి. బహుశా మీలో ఐక్యత పుట్టవచ్చును."

అలాగ అని పరమానందయ్య ఖజానాలో పన్నులు కట్టడంకోసం తనదారిన తాను పోయాడు.

పరమానందయ్య మాటే పనిచేసిందో లేక పోరిపోరి అలసటే వచ్చిందో ఏమైతేనేమి వారు కత్తులు కిందపెట్టి ఆలోచనలో పడ్డారు.

పుణ్యాలు బుర్ర బద్దలయేలాగ తెగ ఆలోచించాయి. ఆకలిగొట్టు దరిద్రులు అంతకన్న చేసేదేముంది ? ఇక పాపాలు పోరు చల్లారగానే తమ అల్లరి చిల్లరి వ్యాపకాల్లో మునిగి పోయి అందరిచేతా ఓహో అనిపించుకొన్నాయి.

"ఆ పరమానందయ్య గుణాలను గురించి వాగడం బాగానేవుంది. గుణాల సంగతి వాడికెంత తెలుసునో మనకీ

అంతే తెలుసును" అంది వినయం. పుణ్యాలలో మొదట నోరు విప్పింది ఇదే.

"పట్టు ఉడుపులు తొడిగి బంగారం తిని కొన్ని గుణాలు దర్జాగా తిరుగుతూవుంటే మరికొన్ని గుణాలు ఆకలికి నకనకలాడుతూ చింకిపాతలతో తిరగవలసి వస్తున్నది. వీకల మొయ్యా మెక్కి బ్యావ్ అని తేనుస్తూ మనకు చెప్పొచ్చాడు ఆ పరమానందయ్యగాడు. ఇలాంటి నీతులకు లొంగేఘటాలు కావివి." అంది వినయం.

"అసలువాడీ గుణాలను ఎక్కడినుంచి తవ్వుకొచ్చాడయ్యా?" అని ప్రశ్నించింది మర్యాద.

"అసలు వాడి మాటలు మతిమాలిన మాటల్లా కనిపించడంలేదూ? పుణ్యాలు పుణ్యాలే. పాపాలు పాపాలే! శతాబ్దాలు సహస్రాబ్దాలుగా అవి అలాగే వున్నాయి. ఈ విషయాన్ని గురించి శత సహస్రాధిక గ్రంథాలు వెలువడ్డాయి. ఇప్పుడు వీడెవడో వచ్చి తనే మహా తెలివైనవాడిలాగ అన్నీ కేవలం గుణాలేనంటున్నాడు. ఎందుకూ - ఆ వేలూ లక్షలూ పుస్తకాలు తీసి చూడు వాటిలోంచి ఎంత దుమారం రేగుతుందో!" అంది మర్యాద.

ఇలాగ కొంతసేపు సిద్ధాంత రాద్ధాంతాలు జరిపి మర్యాద అన్న మాటలు అక్షరాలా నిజం అని నిర్ణయించాయి.

ఎన్ని వేల శతాబ్దాలనుంచో పుణ్యాలు పుణ్యాలుగాను, పాపాలు పాపాలుగాను వుంటున్నాయి. ఈ విషయాన్ని గురించి మహామహులు వేలాది గ్రంథాలు రచించారు. అవి

వ్రాయడానికి కాగితాల కొండలు, సిరా సముద్రాలు ఖర్చు అయి వుంటాయి. పుణ్యాలు సదా కుడివైపున, పాపాలు ఎడమ వైపున వుంటూ వచ్చాయి. ఇప్పు డెవరైనా హఠాత్తుగా ఈ మూర్ఖుణ్ణి నమ్మితే అంతటినీ కొట్టిపారేసి కేవలం "గుణాల"ను మాత్రమే మిగల్చవలసి వస్తుంది. ఒకరి హోదాని, అంతరువుని తీసివేసి కేవలం "మనిషి" అనడం ఎంత చెడ్డదో ఇదికూడా అంతే చెడ్డది. ఇది చాలా సామాన్యంగానే కనిపించవచ్చును. కాని సామాన్యత అనేది దోపిడీ కన్న దారుణంగా వుండేరోజు లున్నాయి. సామాన్యంగా ఎందులోనైనా వేలుపెట్టిచూడు – ఆదిలోనే ఎన్ని హంసపాదులు ఎదురవుతాయో! తలకాయ మెడమీద మిగిలిందా అదృష్టవంతుడవే.

అబ్బేలాభంలేదు. ఈ గుణాలను గురించి ఆలోచించి ప్రయోజనంలేదు. ఏదో రాజీకి రావడం (లేదా బేరం కుదుర్చుకోనడం) చాలా మంచిది. ఆబేరం పుణ్యాలకు హుషారిచ్చేదిగా వుండాలి. పాపాలకు ఫర్వాలేదనిపించాలి. పాపాలు కూడా అప్పుడప్పుడు చిక్కుల్లో పడుతూనేవున్నవాయె. మొన్ననేకదా లోభం కన్నంలో దొంగలాగ దొరికి పోయింది. ఇప్పుడు దానిమీద కేసు నడుస్తోంది. ఆ రాత్రే వ్యభిచారాన్ని దిగంబరంగా మేడ మీదనుంచి కిందికి తోసివేశారు. మొన్న మొన్నటి దాకా స్వేచ్ఛాలోచనపని మూడు పూవులూ ఆరు కాయలుగా ఉండేది. ఇప్పుడు దాన్ని కూకటి వేళ్లతో కుళ్లగించివేశారు. అందుకని ఏదో బేరానికి దిగడంవల్ల పాపాలకు కలిగేనష్టమేమీ లేదనిపిస్తోంది.

"ఓ పుణ్యా మహాశయులారా! ఏమిటి మీ సలహా? మీలో పాదరసం లాంటి బుద్ధి ఎవరిది?"

ఈ ప్రశ్నకు మొదట జవాబిచ్చింది ముసలి వగ్గు అనుభవం. (అనుభవాల్లో కూడా రెండు రకాలున్నాయి. ఇది పుణ్యాలకు చెందిన అనుభవం) అనుభవంచేసిన ప్రతిపాదన ఇది:

"పుణ్యాలకు గౌరవ పాత్రుడు, పాపాలకు ఆమోద యోగ్యుడు అయిన ఒక మణిపూసను వెతకండి. అతడిచేతికి సంధి పతాకాన్నిచ్చి శత్రు శిబిరానికి పంపించండి."

వారంతా ఇటూ అటూ వెతగ్గా వెతగ్గా వారికి కావలసిన మణిపూస ఇద్దరు ప్రౌఢల రూపంలో దొరికింది. ఒకరి పేరు మితవాదిని; ఇంకొకరి పేరు చండశాసని. వీరిద్దరూ పుణ్యాల బస్తీ మురికి పేటలో వుంటున్నారు. వీరు దిక్కూదివాణంలేని అనాధలు. కాపు సారా అమ్మడం వారి వ్యాపారం. పాపాలతో వారికి లావాదేవీ లున్నాయి.

ఈ అనాధలంత అందకత్తెలుకాగు. వారికి అప్పజెప్పిన పనిలో జాణలు కూడా కాదు. వారు పాపాల శిబిరంలో అడుగుపెట్టి మెల్లిగా తమ వచ్చిన పనిని ప్రస్తావించేసరికి పాపాలన్నీ వారిమీద విరుచుకుని పడ్డాయి.

"ఈ సోదంతా ఇంతకుముందు విన్నదే కాని ఇక దయచేయండి. ఇందాకటి నుంచీ ఊదర పెట్టింది చాలును. ఊం త్వరగా కదలండి. కాలికి బుద్ధిచెప్పండి"

ఈలాంటి సంధిబేరాలకు తాము లొంగేబాపతు కాదని చెప్పడంకోసం పాపాలు ఆ రాత్రి అంతా సమర్కండ్

హోటల్లో విందు వినోదాలతో గడిపాయి. ఉదయం హోటలునుంచి పోతూ పోతూ వ్రతాన్ని, మానాన్ని వదేసి పట్టాయి. పాపం ఆ యుద్ధరమ్మాయిల్నీ పాపాలు చేసిన పనిని రాయడం కష్టం. సమర్కండ్ హోటల్లోని తాతార్ ఖానులకు కూడా ఆ దృశ్యాన్ని చూసి జుగుప్సతో ఒళ్ళు జలదరించింది. "చుడ్డానికి మంచి పెద్దమనుషుల్లా వున్నారు. వారు చేస్తున్న పని చూడండి" అని ఖానులు ముక్కుమీద వేలేసుకొన్నారు.

దీనితో పరిస్థితులు విషమించాయని పుణ్యాలు గుర్తించాయి. వ్యవహారాన్ని ఇంక ముదరనీయరాదని నిశ్చయించాయి.

ఆ దశలో వారిలోంచి ఒక నపుంసక లింగం ఉద్భవించింది. అది మగువా కాదు, మగవాడూ కాదు. ఉభయుల కలగలుపు. పుట్టడంతోనే పెరిగి పెద్దదయింది. ఇదమిత్థమని చెప్పడానికి వీల్లేని ఈ అర్థనారీశ్వరం పేరు కపటం!

దీని పుట్టుక మొదలుకొని ప్రతిదీ రహస్యమే. దీన్ని గురించి ఎవరికీ ఏమీ తెలియదు. ఒకప్పుడు నిష్ట - కామం చీకటి తప్పుచేశాయనీ దాని ఫలమే ఈ బిడ్డ అనీ వృద్ధులు అంటూవుండేవారు. ఈ బిడ్డను పుణ్యాలన్నీ కలిసి సాకాయి. గొప్పింటి బిడ్డలకోసం శ్రీమతి డాంబికం నడిపిస్తున్న పాఠశాలలో చదివించాయి. కపటం ఎప్పుడు చూసినా తలవంచుకొనే కనిపించేది. అయితే అప్పుడప్పుడు దాని ముఖంలో శ్రీమతి కామం ఛాయలను పరిశీలకులు కనిపెట్టారు. అప్పుడప్పుడది నడుస్తూవుంటే ఆ కదలిక మర్యాదకు భిన్నంగా

కూడా వుండేది. శ్రీమతి డాంబికంగారి పాఠశాలలో కపటం అన్ని విద్యలనూ కూలంకషంగా అభ్యసించింది. తైరు కొట్టడం, చెవులు కొరకడం లాంటి శీలాలను అలవర్చుకొంది. మిడిసిపాటు నృత్యంలో నైపుణ్యం సంపాదించింది. అంతటితో ఆగితే బాగుండేది. శ్రీమతి డాంబికం కపటం తలిదండ్రుల సంగతంతా చెప్పేసింది.

మీ అమ్మ కామం విలాసానికి పెట్టింది పేరు. కనిపించిన వారినల్లా కుట్టనిదే ఊరుకొనేదికాదు. ఇక మీ నాన్న నిష్ట అంత అందగాడుకాడు. కాని ఎవరైనా పొడిచినప్పుడు అతడు వేసే కేక మాత్రం చాలా అందంగావుండేది అని శ్రీమతి డాంబికం చెప్పింది.

ఇలా తరిఫీదు పొందిన కపటాన్ని పుణ్యాలు తమ రాయబారిగా ఎన్నుకొన్నాయి. కపటం ఎన్నడూ తలెత్తి చూసేదికాదు. కాని కడకంటి చూపుల్లోంచి కామం తళుక్కు మంటూవుండేది. తమకూ పాపాలకూ మధ్య కపటం సంధి కుదర్చగలదని పుణ్యాలు భావించాయి.

"అయితే నీవు మా మాదిరిగా ఎలా నడుచుకొంటావు?" అని ధైర్యం ప్రశించింది – ముందు రాయబారిని పూర్తిగా పరీక్షిస్తే తప్ప లాభం లేదనుకొని. "ఏమిటి ఈ ప్రశ్న నన్ను అడుగుతున్నారు ?" అని ఆశ్చర్యంతో అడిగింది కపటం. "ఇదుగో ఇలాగా" అని చెప్పి బుగ్గలు ఎర్రపడగా చేతులు కట్టుకొనినిలబడింది. శుద్ధ అమాయకురాలైన ముగ్ధ! ఇంత కన్న ఏం కావాలి ?

"ఓహో అద్భుతం! అద్భుతం! సరే పాపాల లాగ ఎలా ప్రవర్తిస్తావు?"

ఈ ప్రశ్నకు కపటం జవాబివ్వలేదు. ఆ వెంటనే ఏదో చేసింది. కాని ఏంచేసిందో ఎవరికీ తెలియలేదు. ఒక్క నిశితదృష్టి మాత్రమే దాన్ని కనిపెట్టింది. జుగుప్సతో కుంగి పోయింది.

అప్పుడు పుణ్యాలు తమ వ్యవహారాలన్నీ నిర్వహించడం కోసం కపటానికి పవరుపట్టా ఇవ్వాలని ఏకగ్రీవంగా నిర్ణయించాయి. ఈ పవరు పట్టాను ప్రఖ్యాత చెట్టుకింద ప్లీడరు ఫలానాచేత రాయించాలనికూడా నిశ్చయించాయి.

కపటం పాపాల నగరానికి ప్రయాణమయింది. "ఈ కుళ్ళు చాలాదూరం వ్యాపించిందే!" అని ప్రకాశంగా అని "పాపాల జీవితం ఎంత హాయిగావుంది!" అని స్వగతంగా మెచ్చుకొంది. పుణ్యాల బస్తీనుంచి ఒక మైలుకూడా సాగిందో లేదో కపటం చుట్టూ నవ్వులు, నాట్యాలు, ఆటలు పాటలతో గాలి మత్తెక్కింది. పాపాలు నిర్మించుకొన్న నగరం ఎంత అందంగావుంది! విశాలమైన వీధులు, వీధుల కిరువైపులా బారులు దీరిన దీపాలు, మధ్యమధ్య ఉద్యానవనాలు, చౌకులు. కూటసాక్ష్యాల వీధి, కుమ్మక్కు-చౌకు వున్నాయి. అప్రతిష్ట రోడ్డు అనేదికూడా ఒకటుంది. అక్కడ అబద్ధయ్యకొక దుకాణంకూడావుంది. టోకుగాను, చిల్లరగాను అపవాదుల నక్కడ అమ్ముతూవుంటారు.

జిత్తులలోనూ, ఎత్తులలోనూ ఆరితేరిన పాపాలుకూడా కపటాన్ని చూసేసరికి అలాగే బిత్తరపోయాయి. చూడ్డానికి

ముగ్ధలాగా కనిపిస్తోంది. కాని నిజానికి ముగ్ధేనా అని అను మానం. అవునోకాదో దేవుడికికూడా తెలియదు. ఈ ప్రపం చంలో తనకు దీటురాగల కల్మషంలేదని గర్వించే అబద్ధయ్య కూడా అలా కళ్ళప్పగించి నిలుచుండిపోయాడు.

"ఈ ప్రపంచంలో నన్ను మించిన చీడపురుగు మరొకడు లేడని అనుకొంటూవుండేవాణ్ణి. అలా అనుకొనడం శుద్ధ తెలివితక్కువ" అను కొన్నాడు అబద్ధయ్య.

"ఇదిగో ఇది అసలైన విషప్పూచ్చే. నాదంతా ముక్కుకు సూటిగా పోయే వ్యవహారం. అందుకనే అప్పుడప్పుడు నాలుగు తాపులు, మూడు హెచ్చరికలు తగులుతూ వుంటాయి. కాని ఈ మణిపూస తగులుకొందా నిలువునా చీల్చినా చీల్చిపేనినా విడిచిపెట్టడం వుండదు."

కపటంగారి ఆగమనంతో ఎంత ఉత్సాహం పెల్లు బికినప్పటికీ ఇక్కడకూడా చిన్న పేచీ ఒక్కటి పుట్టకపోలేదు. పాపాల్లో సంప్రదాయానికి ఎక్కువ గౌరవం యిచ్చే పెద్దలు వితండం, డంబం, అసూయలాంటివారు కపటానిక ఎదుర్కోలు ఇవ్వడానికి ఒప్పుకోలేదు. అంతటితో ఊరుకొన్నారా ? "నిజ మైన పాపానికి మర్మం అవసరంలేదు" అని హెచ్చరించారు.

"ఇదేదో మనమీద ధ్వజం ఎత్తి వచ్చింది. కాని మనలో లేని ప్రత్యేకత దీనిలో ఏంవుంది. తరతరాలుగా మనకు కరతలామలకమైన విద్యలకన్న దీని కెక్కువేం తెలు సును ? ఏమీ లేదు. పైగా ఇది మన వాదాలను మన మీదికే తిప్పే ప్రమాదం వుంది. అప్పుడు మనస్థితికి మనం సిగ్గుపడ వలసిన అవసరం లేకపోయినా దాదాపు అంతపనీ చేయవల

సిన దుస్థితి కలుగుతుంది. ఇంతవరకూ మనకు అనుయాయు లకు కొదవలేదు. కాని వారుకూడా ఈ వాదాన్నే నేర్చుకొని ఈ పాపాలు నిజంగా చాలా పెచ్చుపెరిగి పోయాయని చెప్పి వారంతా మనలను విడిచిపెట్టి పోతారు. ఆ తర్వాత మన మొహం చూసేదిక్కుండదు, చూస్తూవుండండి !"

వితండం, డంబం అసూయ మున్నగు పాపాలకు కొత్త ఆలోచనన్నా, కొత్త ధోరణన్నా, కొత్తమార్పులన్నా కిట్టవు. వాళ్లుపుట్టింది పేడకుప్పలమీద. అక్కడే మునిగి తేలుతూ తమ తాతల ఆచారాలను తూచ తప్పకుండా నడుస్తూ వుండాలనేది వారిమతం.

వీరిలాగే కపటం విషయంలో మూతి విరిచినవి మరి కొన్ని వున్నాయి. కపటం అంటే వీటికి కిట్టకకాదు, ఇవి కపటం సహాయం లేకుండానే పుణ్యాలతో లావాదేవీలు పెట్టుకొన్నాయి. దగా, ద్రోహం, మోసం, కొండెం వగైరా లీబాపతు. వీరు కపటానికి స్వాగతం చెప్పలేదు. చప్పట్లు కొట్టలేదు. మర్యాదలు చేయలేదు. "మరేం ఫరవాలేదు. ఇది మీ ఇల్లే అనుకో" అన్నట్లు కళ్లు మాత్రం గీటాయి అంతే.

ఏమయితేనేం. కపట రాయబారం ఫలించడం ఖాయం. యువకులైన కామం, మోహం, మదం, మధుపానం మున్నగువారు కపటానికి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు. దాన్ని చూసి వితండం అంతటివాడు విధిలేక సణుగుడు కట్టిపెట్టవలసి వచ్చింది.

"ఇదుగో ముసిలి తొత్తుకొడుకుల్లారా! మీరు ప్రజలను ఊరికే పీడిస్తున్నారు. మీరు మమ్మల్ని కూడా సుఖంగా బ్రతకనీయడంలేదు" అని యువకులు ముసిలివారిమీద పడ్డారు.

"ఇకపైన వాచక పుస్తకాల్లో మా పేరుంటుంది. సర్వత్రా మాకు పూజలు జరుగుతాయి. బాలరండలు మమ్మల్ని భక్తితో కొలుస్తారు."

సరే సంధి షరతులు కుదిరాయి. కపటం తిరిగివచ్చి తన రాయబార విశేషాలను పుణ్యాలకు తెలియపరిచింది. పుణ్యాలు, పాపాలు శత్రుకూటాలుగా చీలివుండడం పనికిరాదు అని ఏకగ్రీవంగా తీర్మానించారు. అయితే పాత పేర్లను మాత్రం రద్దు చేయడానికి వారు ప్రయత్నం చేయలేదు. ఏమో ఏ కాలానికి ఎలా వుంటుందో! ఈ ఒప్పందాలకు విలువేమిటి బూడిద బుగ్గికాక!

అప్పటినుంచీ పుణ్యపాపాలు పరస్పర ఆదర భావంతో మెలగసాగాయి. అవినీతికి నిష్ఠతో కాలక్షేపం చేయాలని బుద్ధి పుట్టినప్పుడు కపటానికి కైదండ ఇచ్చి కొనిపోయేది. వారిని దూరాన్నుంచి చూడగానే నిష్ఠ ఎదురేగి "దయ చేయండి, దయచేయండి, నిన్ననే మీ ప్రస్తావన వచ్చింది" అంటాడు.

లేకపోతే నిష్ఠకు అతినీతి అతిథిగా కాలక్షేపం చేయాలని బుద్ధిపుట్టినప్పుడు కపటాన్ని తనవెంట తోడ్కొనిపోతాడు. అవినీతి వారికి ఎదురేగి కైదండ ఇచ్చి "దయచేయండి, దయ చేయండి, నిన్ననే తమ ప్రస్తావన వచ్చింది" అంటుంది.

ఉపవాసవ్రతాలు చేసేటప్పుడు వారు ఒకరి కొకరు ఫలహారాల విందులు చేసుకొంటూ వుంటారు. ఉపవాస వ్రతాన్ని విరమించినప్పుడు నిషిద్ధాహారం తీసుకొంటూ వుంటారు. ఒకచేత్తో పూజలు చేస్తూ మరొకచేత్తో మహా దారుణ కృత్యాలు సాగిస్తూవుంటారు. ఒకకన్ను ఆముష్మికం వైపు, మరొక కన్ను ఐహికభోగాలవైపు. పుణ్యాలు తమ జీవితంలో మొదటిసారిగా షడ్రసోపేత భోజనాలు చేస్తున్నాయి. అయితే అంతమాత్రాన పాపాలస్థితి ఏమీ తరగలేదు. "మన జీవితంలో ఇంత పసందైన విందులు ఎరగం" అని పుణ్యాపాపాలు అనుకుంటూ వుంటాయి.

ఇక పాపం పరమానందయ్యకి విషయం ఈ నాటికీ బోధపడ్డంలేదు. అసలు పుణ్యాలు, పాపాలు కేవలం గుణాలే కదా; అలాంటప్పుడు ఆ ఆదిరూపాన్ని తెలుసుకొని సఖ్యం సంపాదించడానికి బదులు కపటం ద్వారా ఈ రెండింటికీ సంధానం ఎలా కుదిరిందా అని పరమానందయ్య ఆశ్చర్యపోతూవుంటాడు.





# భల్లూక రాజ్యం

మహాక్రూరులకు మహామహులనే కీర్తి వస్తూవుంటుంది. అలాంటివారి పేరు చరిత్ర కెక్కుతుంది. కాని క్రూరుల్లోకూడా అల్పులుంటారు. వాళ్లకు మాత్రం అప్రతిష్ఠ మిగులుతుంది. పొరపాటునైనా వాళ్ళు చరిత్రని అపమార్గాలకు మళ్లించలేరు. సమకాలికుల మెప్పు పొందలేరు.

## ఆదిభల్లూక దేవర!

ఆది భల్లూక దేవరాయలవారి కీ విషయం క్షుణ్ణంగా తెలుసును. ఆయనకు చాలా అనుభవం వుంది. గుహాలు నిర్మించుకొనగలరు. చెట్లను పెకలించగలరు. ఆయనకున్న చిరకాల వాంఛ ఒక్కటే; అది చరిత్ర కెక్కడం. మరి చరిత్ర

క్కొలంకాటే ప్రపంచంలో అన్ని మార్గాలకన్నా రక్తపాతం మిన్న అని ఆయన ఎన్నుకొన్నారు. వాణిజ్యం, పరిశ్రమలు, విజ్ఞాన శాస్త్రం దేన్నిగురించి ఆయన మాట్లాడినా "రక్తం, రక్తమండీ, కావలసింది రక్తం" అన్న మాటలతో ముక్తా యించేవారు.

భల్లూక దేవరవారి ఈ రక్తదాహాన్ని కనిపెట్టిన సింహ సార్వభౌములు ఆయనకు మేజరు హోదా ప్రసాదించి దూరా నున్న ఒక అడవిలో స్థానిక తిరుగుబాటును అణచడంకోసం తాత్కాలిక గవర్నరుగా నియమించారు.

సార్వభౌముని పలుకుబడిలోని వారంతా ఈ వార్త విని తల్లడిల్లారు. వన్యప్రాణుల్లో అప్పుడు చిత్తం వచ్చినట్లు జీవించ డానికి అనుమతి వుండేది. మృగాలు పరుగెత్తేవి. పక్షులు ఎగిరేవి. పురుగులు పాకేవి. కాని కదంతొక్కడం ఎవరికీ యిష్టంలేదు. కొత్త గవర్నరు తమను పువ్వుల్లో పెడతాడని అవెప్పుడూ అనుకోలేదు. కాని అనుభవం కానిదే ఊహించే స్థితిమాత్రం వాటికేనాడో నశించింది. ఏమైతేనేం 'గవర్నరు గారిని రానీయండి చూద్దాం' అనుకొన్నాయి.

అవలా అనుకొంటూ వుండగానే గవర్నరు భల్లూక దేవరవారు రానేవచ్చారు. అమావాస్య ఆదివారం పొద్దున్నే ఆయన తమ బసకు చేరుకొన్నారు. చేరుకోగానే 'రేపు నెత్తురు కళ్ళ చూస్తాం' అని నిశ్చయించుకొన్నారు. ఈ నిశ్చ యానికాయన ఎందుకు వచ్చారో తెలియదు. ఆయనకు దురుద్దేశాలు ఆపాదించడానికి వీల్లేదు. ఆయన కేవలం ముక్కురుడు – అంతే.

శనిదేవత నెత్తినెక్కి ప్రలోభపెట్టకపోతే ఆయన ఆశయానికి భంగం కలిగివుండేది కాదు.

ఇంతకీ ఏం జరిగిందంటే—ఆయన అలా రక్తపాతాన్ని గురించి ఆలోచిస్తూ వుండగా తన పుట్టినరోజు పండుగ సంగతి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. ఒక సీసాడు ఓడ్కా తెప్పించి తానొక్కడూ కూర్చుని త్రాగాడు. ఆయనింకా గుహను నిర్మించుకోలేదు. మైకం బాగా తలకెక్కిందేమో అలా అడవి మధ్య ఆరుబైటనే గుర్రుపెడుతూ నిద్రపోయాడు. తెల్లవారేసరికి దైవాద్వా ఒక పైడిపిట్ట ఆయన మీదనుంచి ఎగిరింది. ఇది సామాన్యమైన పైడిపిట్టకాదు. చాలా తెలివైనది. కడవెడు నీళ్ళు తీసుకొని రాగలదు. అవసరమైతే గోరువంకలాగ పాడగలదు కూడా. ఈ పైడిపిట్టను చూసి పిట్టలన్నీ గర్వపడుతూ ఉండేవి. "మా పైడిపిట్ట త్వరలోనే మంచి మంచి పతకాలు సంపాదిస్తుంది" అంటూ ఉండేవి. దానికీర్తి సింహసార్వభౌముల చెవిదాకా వెళ్ళింది. సార్వభౌముల సభాసదుల్లో కల్లా బుద్ధికి బృహస్పతి అయిన గాడిదను చూసి "మా పంజాలో ఆపిట్ట పాడుతూఉంటే ఎంతబాగుండును" అని సెలవిస్తూ ఉండేవారు.

పైడిపిట్ట ఎంత తెలివైనదైనా ఈసారి పాపం పప్పులో కాలేసింది. మన భల్లూకదేవర వారిని అక్కడపడివున్న ఒక ఊకుమాను అని భ్రమించి మీద ఎక్కి కిచకిచలాడ సాగింది. దేవరవారిది కోడికునుకు. తమ వీపుమీద ఎవరో గెంతుతున్నారని తోచగానే "బహుశా వాడొక విప్లవకారుడై వుంటాడు" అని దేవరవారు భావించారు.

"గవర్నరుగారి పిసుందున ఎగిరే ఆ ఆతతాయి ఎవరు?" అని గర్జించారు.

అప్పటికైనా పైడిపిట్ట వెంటనే ఎగిరి పోవలసింది. కాని ఎగరలేదు. అది మరొక తప్పిదం. పిట్ట అలాగే కూర్చుని "ఇదేమిటి మొద్దు ఘాట్లాడుతున్నదే!" అని ఆశ్చర్య పోయింది. దానితో భల్లూకదేవర సహనం మేరదాటింది. అది సహజమేకదా? ఆ 'దుష్టుణ్ణి' పంజాతో పట్టి అమాంతం మింగేశారు.

మింగనైతే మింగేశారు. కాని 'ఏమిటి మేం తిన్నది?' అన్న మిమాంస పట్టుకొంది. ఒక పంటి చివరకూడా ఏమీ మిగలలేదే. వాడేలాంటి విప్లవకారుడు? అనుకొన్నారు. తల బద్దలయేలాగ ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోలేదు. భల్లూక దేవరవారు పైడిపిట్టను తినేశారు, అంతే. ఇదెంత స్వల్ప విషయమైనప్పటికీ మరి ప్రతిక్రియ లేదు. తిన్న తర్వాత దారుణ నేరంచేసిన తిరుగుబాటుదారులాగే ఈ అమాయకపు పిట్టకూడా ఆయన ఉదరంలో జీర్ణిస్తుంది.

"మేం దీన్నెందుకు తిన్నట్లు?" అని తర్కించుకొనడం మొదలుపెట్టారు.

"మేం బయలుదేరేముందు సింహసార్వభౌములు గట్టి కట్టడి చేశారు: గొప్పపనులుచేయి. స్వల్ప విషయాల జోలికిపోకు అని చెప్పారు. మేం చేసిన మొదటిపనేమిటి? ఒక పైడి పిట్టను భక్షించడం! సరే అయిందేదో అయి పోయింది. ఈ చుట్టుపక్కల ఎవరూ లేరుకదా?"

రాజ్యతంత్రంలో మొదటి తప్పు ప్రాణాంతకంగా ఉంటుందన్న సంగతి పాపం భల్లూకదేవరవారు మరిచిపోయి వుంటారు. గవర్నరుగారు ఆదిలోనే తప్పుదారినపడ్డారు. ఆ దారి ఇంకొన్ని తప్పిదాలకు కొనిపోతుంది. ఈ అపభ్రష్ట కార్యాన్ని ఎవరూ చూడలేదులే అని ఆయన మనసు సమాధానం పెట్టుకొన్నారో లేదో– పక్కనున్న భూర్జవృక్షంమీంచి ఒక కాటుకపిట్ట అరిచింది :

"మూర్ఖుడు ! మమ్మల్నందరినీ మట్టం చేయడానికి ఈయన్నిక్కడికి పంపించారు. ఈయనిక్కడ పైడి పిట్టలను భక్షిస్తున్నాడు !"

దానితో మన దేవరవారికి పిచ్చెక్కినంతపనైంది. కాటుకపిట్టను పట్టుకొనడంకోసం భూర్జవృక్షంమీద కెగబ్రాకారు. కాని అదేం తెలివితక్కువ పిట్టకాదు. అక్కడనుంచి తుర్రున మరో చెట్టుమీద వాలింది. భల్లూకదేవర ఆ చెట్టుకూడా ఎగబ్రాకారు. కాటుకపిట్ట మొదటి చెట్టుమీద వచ్చివాలింది. భల్లూకదేవరకి చెట్లు ఎక్కడం దిగడంతో రొప్పు వచ్చింది. కాటుకపిట్టను చూసినతర్వాత పిరికి కాకికి కూడా కలేజా వచ్చింది.

"చూడండోయ్ ఆ ముష్కరుణ్ణి ! అతడు నిజంగా రక్తపాతం చేస్తాడని అంతా అనుకొన్నారు. కాని ఇక్కడ పైడి పిట్టలను భక్షిస్తున్నాడు" అని కాకారవాలు చేసింది.

దానితో భల్లూక దేవర కాకివెంట పడ్డాడు. అంతలో ఒక పొదలోంచి కుందేలు చెంగున గెంతింది.

"బానకడుపు భల్లుకరాయా పైడిపిట్టను భక్షిస్తావా ?"

ఇంతట్లోకీ ఒక జోరీగ రివ్వున వచ్చి.

" * అలమలం అట్టహాసం! వీండు పైడిపిట్టను భక్షించి నాండు !"

"వెర్రిమొర్రి బొర్ర వెధవ ! పైడిపిట్టను తినేశాడు !" అని పక్కనున్న గుంటలోంచి కప్ప బెక బెక లాడింది.

భల్లూక దేవరం టే ప్రతివారికీ ఆటైపోయింది. తనను వుడికించేవాళ్లను పట్టుకొనడంకోసం ఎన్ని పరుగులు పెట్టినా లాభంలేక పోయింది. పరుగులు పెట్టినకొలదీ ఎక్కువ అల్లరి పడవలసివచ్చింది. ఒక గంట గడిచేలోగానే అడవి లోని ముసిలీ ముతకా, పిల్లా మేకా అందరికీ కూడా గవర్నరు గారు పైడి పిట్టను భక్షించారన్న వార్త తెలిసిపోయింది. ఈ నెకిలిపనిని చూసి అడివంతా కోపంతో ఉడుకెత్తి పోయింది. కొత్త గవర్నరు ఇలా చేస్తాడని వారనుకో లేదు. అడివిలోని చెట్టు పుట్ట, మిట్ట పల్లం అంతా ఏకం చేస్తూ నెత్తుటేరులు పారిస్తాడని అంతా ఆశించారు. కాని ఈయన చేసినదేమిటి ? భల్లూక దేవర అడుగుపెట్టిన చోటల్లా అడవి అంతా "వెర్రివెధవ పైడిపిట్టని భక్షించాడు" అన్న హేళనతో మారు మ్రోగింది.

భల్లూక దేవర పిచ్చెత్తినట్లు అడివంతా పరుగులు పెట్టాడు. ఆయన జీవితంలో ఒక్కసారి మాత్రమే ఇలాంటి యాతన పడ్డాడు. ఒకప్పుడు ఆయన గుహాలో వుండగా జాగి లాలను ఉసికొల్పారు. అందిన చోటల్లా కరచి కరచి విడిచి పెట్టాయి ఆ కుక్కలు. మృత్యువు కళ్ళముందు తారట్లాడింది.

* చాలుచాలు వెడనవ్వులు.

కాని ఎలాగో కొన్ని జాగిలాల కాళ్ళు విరగకొట్టి, మరి కొన్నింటి కంటిలో దుమ్ముకొట్టి చావుతప్పి బ్రతికి బైట పట్టాడు. ఇప్పుడెక్కడికి పారిపోవాలి? ప్రతి తుప్పా, ప్రతి చెట్టూ పనికట్టుకొని ఆయనను వెక్కిరిస్తున్నది. ఆయన చేయ గలిగినదల్లా వాటి ఎద్దేవాలను ఆలకించడం అంతే! ఆఖరికి వెధవ గుడ్లగూబకూడా "వెధవ! వీడు పైడిపిట్టను తిన్నా డోయ్!" అంటూంటే ఇంకేం చేయాలి?

వీరంతా భల్లూక దేవరను మాత్రమే అలుసు కట్ట లేదు. ఆయన అధికారాన్నే అవమానపరుస్తున్నారు. అది మరీ ఘోరం! ఈ ప్రకారు చుట్టుపక్కల అడవులకుకూడా వ్యాపించి అక్కడివారుకూడా అలుసుకడితే? ఏమో, అంతపనీ జరుగు తుందేమో!

ఒక్కప్పుడు అతి స్వల్పవిషయాలుకూడా దారుణ పరిణా మాలకు దారితీస్తూ ఉంటాయి. పైడిపిట్ట సరిగ్గా వేలెడంత కూడా వుండదే అని మీరనవచ్చును. కాని అదే మన దేవర వారి పరువు ప్రతిష్ఠలను మంటకలిపింది. పైడిపిట్టను భక్షించే వరకూ ఆయనను తిట్టడానికి ఎవరికీ గుండెలు చాలలేదు. "దేవరా" "మహాప్రభూ" "మీరు మా కన్న తండ్రిలాంటి వారు" అన్న మాటలు తప్ప మరొకటి వినిపించేది కాదు. భల్లూక దేవర వారి సంగతి బుద్ధికి బృహస్పతులవారైన గాడిద స్వయంగా సింహానికి మనవి చేసిన విషయం జగద్విదితం. అసలు గాడిదకు అకారణంగా ఎవరిమీదా అనుగ్రహం కలగదు. కాని ఇప్పుడు అల్పాల్పమైన ఈ ఘటన, పరిపాలనలో జరిగిన చిన్న పొరపాటు,

అందరికళ్లూ తెరిపించింది. అందరి నాలుకలు కత్తుల్లా పదునెక్కాయి. "వెధవ ! పైడి పిట్టను భక్షించాడు !" అని ఎద్దేవా మొదలైంది. పంతులు దండన భరింభలేక విద్యార్థి ఆత్మహత్యకు దిగినట్లుంది ఈ పరిస్థితి. అబ్బే యీ ఉపమానంకూడా సరియైనదికాదు. విద్యార్థి ఆత్మహత్య చేసుకొనే పరిస్థితి కల్పించడం ముష్కరత్వమౌతుందేమో కాని అప్రతిష్టాకరం మాత్రంకాదు. ఆ ముష్కరత్వాన్ని చరిత్ర వేనోళ్ళ పొగడ వచ్చును. కాని ఇదేమిటి ? పైడి పిట్టను భక్షించడం ?

"నవ్వాగడం లేదర్రా ?" అని చిలుకలు, కప్పలు, ఉడతలు ఒకటే విరగబడి నవ్వుతున్నాయి.

మొదట భల్లూకదేవర చేసిన పనినిచూసి అడవి ప్రాణులందరికీ కోపం వచ్చింది. అసలిది అడివికే తలవంపులు అనుకున్నాయి. ఆ తర్వాత ఉడికించడం ప్రారంభించాయి. పిట్టలు, కప్పలు, జోరీగలు, ఈగలు ఒకటేమిటి అడవి అడవంతా పగలబడి నవ్వింది.

"ప్రజాభిప్రాయం అంటే ఇదేనన్నమాట" అని ముక్కును పంజాతో తుడుచుకొంటూ రుద్ధకంఠంతో అనుకొన్నాడు భల్లూకదేవర.

"ఈ పైడిపిట్టమూలంగానైనా నాపేరు చరిత్ర కెక్కుతుందేమో !" అనుకొన్నాడు.

చరిత్ర అనేది చాలా గొప్ప వ్యవహారం. దానిపేరు స్ఫురించగనే భల్లూకదేవర ఆలోచనలో మునిగిపోయాడు. అసలు చరిత్రఅంటే ఏమిటో దేవరకంత గట్టిగా తెలియదు. కాని చరిత్ర పేరుచెపితే సింహసార్వభౌమునికికూడా వణుకు

పుడుతుందని గాడిద చెప్పగా విన్న జ్ఞాపకంవుంది. ముష్కర వేషం వేసినంతమాత్రాన ఎవరికీ చరిత్రలో స్థానంవుండదు. ఘోర రక్తపాతానికిమాత్రమే చరిత్రలో తావుంది. సామాన్య ముష్కరులను అంతా మొహంమీద ఊస్తారు. దేవర కనీసం ఒక ఆలమందను అడ్డుకొట్టివుంటే, ఒక గ్రామాన్ని కొల్లగొట్టి వుంటే, పోనీ ఒక కొంపను నిలువునా కూల్చివుంటే ఆ పరిస్థితి వేరువిధంగా వుండేది. అప్పుడు బహుశా చరిత్ర...అలాంటప్పుడు దేవర అసలు చరిత్రను లెక్కచేసి వుండేవాడేకాదు. ధన్యవాదాలర్పిస్తూ గాడిద ఆయనకు లేఖరాసేది. అంతకన్న ఇంకేంకావాలి? ఇప్పుడేంవుంది? పైడిపిట్టను తిన్న ఖ్యాతి తప్ప! ప్రయాణానికెంతో ధనం సెలవుచేసి, వందలమైళ్ళు పరుగులుపెట్టి చేసిన పనేమిటయ్యా అంటే పైడిపిట్టను పట్టి భక్షించడం! అయ్యోరామా! ముక్కుపచ్చలారని పిల్లలుకూడా ఈమాట వింటే నవ్వుతారుకదా? రాజాజ్ఞ మేరకు తిరుగుబాటును అణచడానికి బదులు గవర్నరు భల్లూక దేవర వారు ఒక పైడిపిట్టను పట్టుకొని భక్షించారని పిండారీలు, ఠగ్గులు ఒకరేమిటి అంతా ఇటుపైన ఆడిపోసుకుంటారు. దేవర పిల్లలు ఇప్పుడు పాఠశాలలో చదువుతున్నారు. ఇంతవరకూ వారిని దేవరవారి బిడ్డలు అని మర్యాదగా చూస్తున్నారు. కాని ఇప్పుడు తోటిపిల్లలంతా "ఒరే పక్షి భక్షకా? పక్షి భక్షకా!" అని ఉడికిస్తారు కాబోలు! ఇంతటి అప్రతిష్ట రావడానికి ఎంత నెత్తురు పారపోయవలసి వుండేదో, ఎంతమందిని హత్యచేయవలసి వుండేదో, ఎందర్ని కొల్లగొట్టవలసి వుండేదో ఆ దేవునికే ఎరుక!

దారుణ దురంతాలతో జాతీయ శ్రేయస్సుకు పునాది వేసే ఆ రోజులు నిజంగా దౌర్భాగ్యపురోజులు. కాని స్వల్పమైన కారణాలతో అదే ఆశయాన్ని స్థాపించాలనుకోవడం అంతకన్నా వెయ్యిరెట్లు దౌర్భాగ్యమైనది.

భల్లూక దేవరకి భయం పట్టుకొంది. కన్ను మూతపడదు. "ఈ సంగతి వింటే గాడిదేమంటుంది" అన్నదొక్కటే సదా ఆలోచన.

సరే కల నిజమైనట్లుగా ఒకరోజున గాడిద దగ్గర నుంచి ఒక లేఖ వచ్చింది. "మీరు తిరుగుబాటును అణచలేక పోయారనీ, పైగా ఒక పైడిపిట్టను భక్షించారనీ సార్వభౌములకు తెలియవచ్చింది. ఇది నిజమేనా?"

భల్లూక దేవర ఒప్పుకొనక తప్పలేదు. చేసిన పనికి చింతిస్తున్నట్లు ఒక సంజాయిషీ పంపించి ప్రత్యుత్తరంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. దానికి వచ్చిన జవాబు "వెర్రివెధవ, పైడిపిట్టను తిన్నావా?" అని మాత్రమే. కాని నువ్వుచేసిన ఈ దారుణమైన తప్పిదాన్ని మాపుకోవాలంటే అసాధారణ రక్తపాతం చేయవలసి వుంటుంది. నీ కదొక్కటే మార్గం అని గాడిద లోపాయికారీగా తెలియపరిచింది. భల్లూక దేవర గాడిదకు ఒక తేనెపెర నజరానా పంపాడు లెండి!

"బస్ ఇంతేనా? ఐతే పరవాలేదు. పోయినపేరు తిరిగి నిలబెట్టుకొనవచ్చును" అని ఒక పొలికేకపెట్టి ఆ క్షణంలోనే ఒక గొర్రెలమందపైపడి మందకుమందా మారణహోమం చేశాడు భల్లూక దేవర. అక్కణ్ణుంచి బయలుదేరి కలిం

కాయు లేసుకొంటున్న ఒక అబలనడ్డగించి తిట్టలాకొన్నాడు. తిరుగుబాటు మూలాలను పట్టడంకోసం అడవినంతా తవ్వి తలకిందులు చేశాడు. కొసకొకనాటిరాత్రి ఒక అచ్చుకూటం మీద దాడిచేసి యంత్రాలను విరగ్గొట్టాడు. అక్షరాలను చిందరవందరగా చిమ్మిపారేశాడు. మానవ మేధ సృష్టించిన ఫలితాన్ని నలిపి చెత్తగుంటలో ఊరదొక్కాడు.

అంతా అయినతర్వాత తీరిగ్గా రాజుగారి అభిప్రాయం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

కాని పాపం ఆయనపడ్డ అవస్థఅంతా వ్యర్థమై పోయింది.

భల్లూకదేవర చేసిన ఘనకార్యాలను చిలవలు పల వలు అల్లి సింహానికి మనవిచేసిందిగాడిద. అదివిన్న సింహం దేవరను మెచ్చి బహూకరించడానికి బదులు "ఈ ఉద్యోగి బీరుడని మాకుతోచదు. మా ప్రియమైన పైడిపిటను మింగే సిన బలుకరాయుడు వీడు" అని తమరాజ పంజాతో రాసింది.

వెంటనే మేజరు భల్లూకదేవరను పదాతిదళంలోకి బదలాయించారు.

భల్లూకదేవర జీవితాంతం వరకూ ఆ మేజరు హోదా లోనే వుండిపోయాడు. కాని మొన్ననే ఒక అచ్చుకూటం పెట్టాడు. అందుకని ఇంక నిస్సందేహంగా జనరల్ హోదాకు వస్తాడు.

## *ఇమ్మడి భల్లూకదేవర

దారుణమైన దురంతాలుకూడా ఒక్కొక్కప్పుడు కొరగాకుండా పోతాయి. మరొక భల్లూకదేవర వారికి ఇలాంటి శోచనీయస్థితే వచ్చింది.

ఆది భల్లూకదేవర ఇక్కడ ఏలుబడి సాగిస్తూవున్న రోజుల్లోనే సింహ సార్వభౌములు మరొక భల్లూకదేవర వారిని ఇంకొక అడవికి గవర్నరుగా పంపారు. ఈ భల్లూకదేవర కూడా మేజరే. ఈయన తన పేరింటి గానికన్న ఆరిందా. అంతేగాక గవర్నరు భవిష్యత్తు అంతా ఆయన తొలిచర్యమీదే ఆధారపడి వుంటుందని ఈయనకు బాగా తెలుసును. అందుకని ప్రయాణభత్యం ఇంకా చేతికి రాక ముందే ఈయన తన కార్యక్రమాన్ని జాగ్రత్తగా ఆలోచించి మరీ బయలుదేరడు గవర్నరు పదవి స్వీకరించడానికి.

అయినా ఈయన ఏలుబడి ఆది భల్లూకదేవర పాటి కూడా సాగలేదు.

ఆయన రాగానే ఒక అచ్చుశాలను ధ్వంసంచేయాలని నిశ్చయించారు; అలాగని స్వయంగా గాడిద సలహా ఇచ్చింది. కాని ఇమ్మడి భల్లూకదేవర పలుకుబడికి అప్పగించిన అడివిలో ఒక్క అచ్చుశాలకూడా మచ్చుకైనా లేదు. "అల్లక్కడామూల చెట్టుకింద" "అడివి శోభ"ను అచ్చువెయ్యడంకోసం ఒక కొయ్యప్రెస్సువుండేదని ముసలివాళ్ళు చెపుతూవుండడం

---

*ఇమ్మడి అంటే రెండవ అనీ ముమ్మడి అంటే మూడవ అనీ అర్థం.

కద్దు. కాని * మాగ్నిటోస్కీ హయాంలో సదరు ప్రెస్సును బహిరంగంగా భోగిమంట వేశారు. ఇప్పుడక్కడ మిగిలివున్న సాంస్కృతికసంస్థ అల్లా సెన్సార్‌షిప్పు ఒక్కటే. ఈ సంస్థ అడివి వార్తలను అందించే బాధ్యతను కాటుకపిట్టల నెత్తిన పెట్టింది. ప్రతి ఉదయం ఈ వైతాళికపక్షులు అడివి అంతా తిరిగి అందరికీ తాజా రాజకీయ సమాచారాన్ని అందిస్తూ వుండేవి. మార్పువల్ల ఎవరికీ ఎట్టి కలతా కలగకుండేలాగ జాగ్రత్తవహించేవి. అలాగే నల్లంకిపిట్ట చెట్టుపట్టలమీద "ఆటవిక చరిత్ర"ను రచించడానికి ఉపక్రమించింది. కాని ఆ రచన కూడా ఎక్కువకాలం నిలవలేదు. పని సాగుతున్న కొలదీ తిరుగుబాటు చీమలు ఆ పట్టను కొరికి ముక్క-ముక్కలు చేశాయి. అందుకని అడివివారికి గతం సంగతీ, ప్రస్తుతం సంగతీ బొత్తిగా తెలియదన్న విషయం సువిదితం. వారు భవిష్యత్తుపట్ల ఏనాడూ ఆసక్తి చూపలేదు. ఏదో అలా అలా కాలక్షేపం చేస్తున్నారు. అంతే.

ఈ అడవిలో తగలబెట్టడానికి కనీసం ఒక విశ్వవిద్యాలయం, ఒక పరిషత్తుఅయినా లేదా ?అని భల్లూక దేవరవారు దర్యాప్తుచేశారు. కాని ఈ విషయంలోకూడా మాగ్నిటోస్కీ గవర్నరుగారి చిత్తాన్ని కనిపెట్టినవాడై యూనివర్శిటీ విద్యార్థులందర్నీ సైనికులుగా నమోదుచేసి దూరదూర ప్రాంతాలకు పంపించివేశాడు. ఆచార్యులందరినీ ఒక చెట్టుతొర్రలో బంధించాడు. అక్కడ వారు జనసత్త్వాలుడిగి ఈనాటికీ అలాగే పడి

*మాగ్నిటోస్కీ : మొదటి అలెగ్జాండరు హయాంలో వుండేవాడు. విద్యకు సర్వశత్రువు కరడుగట్టిన కర్కశవాది. (1777-1825)

వున్నారు. భల్లూక దేవరవారు క్రోధానల దందహ్యామాన మానసులై సదరు మాగ్నిటొస్కీని ఖండఖండాలుగా ఖండించే నిమిత్తం హాజరు పరచవలసిందని హుకుంచేశారు. కాని సదరు మాగ్నిటొస్కీ యిప్పుడు రద్దుఅయిపోయాడన్న వార్త చేరింది.

ఇక చేయగలిగినదేమీలేదు. భల్లూక దేవర కొంత కాలంపాటు ఊరికే వున్నాడు. అయితే హాతాశుడు కాలేదు. "ఈ వెధవలకు హృదయాలులేవు. అందుకని హృదయ పరివర్తన అనే సమస్యలేదు. కనుక వారి శరీరాలనే మరమ్మత్తు చేస్తాను" అని మనసులో అనుకొన్నాడు.

అనుకొన్నదే తడవుగా ఆచరణలోకి దిగాడు. ఒక అమావాస్యరాత్రి బయలుదేరి ఒక రైతుదొడ్లో దూరాడు. అక్కడున్న గుర్రాన్ని, ఆవునీ, పందినీ, గొర్రెల్నీ వరసపెట్టి ఊచకోతకోశాడు. ఇంతటితో రైతు పూర్తిగా దివాలా తీశాడని భల్లూక దేవరకి తెలుసునుకాని అంతటితో తృప్తి కలగలేదు. "వుండు నీకొంపకూడా కూల్చేసి చిప్ప చేతికి వచ్చేట్లు చేస్తాను" అని యింటి కొప్పెక్కాడు. కాని యింటి వాసాలలో ఒకటి చివికిపోయిందన్న సంగతి ఆయనకు తెలీదు. వాసంమీద అడుగు పడీపడ్డంతోనే, అది విరిగింది. భల్లూక దేవరవారు గాలిలో ఊగసాగారు. మరొకక్షణంలో కింద పడ్డంఖాయం అని ఆయనకు తెలుసును. కాని పడకూడదని ప్రయత్నం. అందుకని ఆ విరిగిన వాసాన్ని వాటేసుకొని బొబ్బరించాడు.

ఆ బొబ్బలు విని గొర్రెలు గొడ్లతో రైతులు వందలాదిగా చుట్టుముట్టారు. అంతా కల్లోలం. కంచెలు కూలిపోయాయి. తలుపులు విరిగి ఉన్నాయి. గోశాలలో నెత్తురు మడుగుకట్టింది. ఈ దారుణ హత్యాకాండ కంతకీ కారకుడయిన హంతకుడు వాసం పట్టుకుని వేలాడుతున్నాడు. "వీడి తల్లి సిగ దరగ చూడు! దొరల మెప్పు పొందాలని వాడి యాశ. మనం ఆకలికి మాడాలి. రండెహే ఒక పరువు వేద్దాం!" అని రైతులు భల్లూకదేవర పనిపట్టించారు తోట వలిచి కంకాళాన్ని దూరంగా పారేశారు. తెల్లవారి గద్దలు రాబందులు విందు చేసుకొన్నాయి.

అప్పటినుంచీ ఆ అడివిలో ఒక సంప్రదాయం ఏర్పడింది. దురంతాలు దుఃఖానికి చేటు అని అక్కడ సామెత పుట్టింది.

ఈ విషయాన్ని గాడిద సింహానికి నివేదించగానే సింహం తన రాజపంజాతో యిలా బరికింది:

"చరిత్ర యిచ్చిన తీర్పును ముమ్మడి భల్లూకదేవరకి తెలియజేసేది. ఒళ్లు దగ్గర పెట్టుకొమ్మని చెప్పేది. ఇతి సింహ సార్వభౌమ లిఖితమ్!"

## ముమ్మడి భల్లూకదేవరరాయలు

ముమ్మడి భల్లూకదేవర తన పూర్వీకులకన్న ఘటికుడు. సింహసార్వభౌముని శ్రీముఖాన్ని చదువుకొంటూ "కాని కాలం వచ్చింది" అనుకొన్నాడు. "చిన్న నేరాలు చేస్తే సిగ్గు సిగ్గు అంటారు. పెద్దవి చేస్తే అసలు కే ఎసరు నస్తుంది.

అసలు నేను వెళ్ళక నేపోతే?" అని ఆలోచించాడు. కొసకు అనుమాన నివృత్తికోసం గాడిద కొక లేఖ రాశాడు. "స్వల్ప దురంతాలకూ, దారుణ దురంతాలకూ అనుమతి లేదు. కాబట్టి నేను మధ్యరకం దురంతాలు చేయవచ్చునా" అని అడిగాడు. దానికి గాడిద తొంకతిరుగుడు సమాధానం యిచ్చింది. "ఇందుకు సంబంధించిన అన్ని ఆదేశాలూ అటవీ శాసనంలో వున్నాయి" అని. భల్లూక దేవర అటవీ శాసనం పరిశీలించాడు. అందులో ఊహాకందే ప్రతి విషయంమీదా నియమనిబంధన లున్నాయి. బొచ్చు పన్నులు, కాయాకసురూ సుంకాలు, కట్టె పుల్లల శిస్తులు. కాని దురంతాల విషయంలో మాత్రం చట్టం మూగవోయింది. దానిమీద గాడిదకు తిరిగి రాయగా అన్నిటికీ "తగువిధంగా నడుచుకో" అని అంటీ ముట్టని జవాబు వచ్చింది.

"ఆహా ఏమిటిదారి? పెద్ద పదవిమాత్రం ఇస్తారూ? ఆ పదవికి అలంబనంగా వున్న దురంతాల విషయంలో మాత్రం పల్లెత్తి పలకరూ?" అని గొణుక్కొన్నాడు ముమ్మడి భల్లూక దేవర.

వెళ్ళనా? మాననా? అని మళ్ళీ తటపటాయించాడు. ఖజానాలో ఆయన ఖాతాకు జమ అయ్యే కొల్లలు కొల్లలు డబ్బు జ్ఞాపకం రాకపోతే అసలు వెళ్ళివుండేవాడేకాదు.

భల్లూక దేవరరాయలు తన స్వంతకాళ్ళమీదే నడుస్తూ అడవి చేరుకొన్నాడు అతి నిరాడంబరంగా. అధికార సన్మానాలు ఏర్పాటు చేయలేదు. నివేదికలు సమర్పించేందుకు నియమితకాలాలు పెట్టలేదు. వెళ్ళడం వెళ్ళడ తన గుహ

లోకి నెళ్ళి నోట్లో పంజా పెట్టుకొని పడుకొన్నాడు. "ఒక్క కుందేలునికూడా చీల్చి చెండాడడానికి వీల్లేదు. అలాచేస్తే అది దురంతం అంటారు. అలా అని ఎవరంటారు? గాడిదా? సింహమూ? ఎవరైతేనేం ఎవరైనా పరవాలేదు. కాని ఈ అడవిమూక అంటుంది. అదేచిక్కు. పైగా వాళ్ల చరిత్ర ఒకటుంది ఛీ చరిత్ర!" అని చరిత్రను చీదరించుకొంటూ చాలాసేపు అలాగే పడివున్నాడు. కాని కడుపులో దేవు రించినట్లు యిదయ్యాడు. చరిత్ర పేరు చెపితే సింహానికికూడా మాడలేనన్న సంగతి అతడికి తెలియదు. అన్ని బాధ్యతలూ తన నెత్తినేకాని కొల్లకొట్టడంమాత్రం వల్లకాదు. ఇలాంటి విడ్డూరం ఎన్నడైనా విన్నామా? ఏ పద్ధతిని అనుసరించి నప్పటికీ "ఆగు తప్పుదారిన పడుతున్నావు" అని ఆదిలోనే అరుస్తారాయె ఈరోజుల్లో ప్రతివారికీ హక్కులున్నాయి. కొసకు ఉడతకుకూడా. ఉండేలు ఉండట్లా గింజలను ఊదే హక్కుంది దానికి. హక్కులన్నీ వాళ్ళవి. బాధ్యతలు తనవి. ఆహాహా ఎంత వింతవ్యవహారం! వున్న విధులు కూడా నామమాత్రమే. అలగా సరుకంతా ఒకరినొకరు తిట్టు కొంటారు. తానుమాత్రం ఒక్క కుందేలుకికూడా డొక్క చించడానికి వీల్లేదు. దీనికంతటికీ కారణం అదుగో ఆ గాడిద. దాని కుతర్కం, కూహకం. అసలా గాడిదకు అద్భుతమైన ఆ కాళ్ళెవడిచ్చాడు. దొడుతీయడానికి అనుమతి ఎవడిచ్చాడు? హక్కుల సంగతి అటుంచి ముందు ఈ విషయం ఆలోచిం చాలి. తగువిధంగా నడుచుకోవాలిట! ఛీ!

చాలాసేపటివరకూ ఇలాగే గోళ్ళు కొరుక్కుంటూ ఆలోచించాడు భల్లూకదేవర. తన గవర్నరుగిరీ మొదలు పెట్టనుకూడా లేదు. అడివిలో అన్నింటికన్నా ఎత్తయిన చెట్టెక్కి బలంకొద్దీ బొబ్బరిస్తూ తన వునికి "తగు విధంగా" చాటడానికి ఒకసారి ప్రయత్నించినమాట నిజమే. కాని దానివల్ల కూడా లాభం కలగలేదు. అడివిలోని పోకిరీమూకకు దురంతాలసంగతి చాలాకాలంగా తెలియదు. వాళ్ళు దేన్నీ లెక్కచేయరు. వాళ్ళ పెంపకం అలాంటిది. ఆ బొబ్బరింత విని వారన్నమాటేమిటో తెలుసునా? "భల్లూకదేవర బొబ్బలు విన్నారా? బహుశా నిద్రలో పంజా కొరుక్కొని వుంటాడు!" అని. ఇంతకుమించిన ఫలితాలు లేకపోవడం చూసి భల్లూకదేవర గుహకు తిరిగివచ్చారు.

అయితే మేం ఇంతకుముందే చెప్పినట్లు ముసలిడి భల్లూకదేవర చాలా ఘటికుడు. ఏదో అర్థంలేని బకీర్లు పంపడంకోసం తన గుహకు తిరిగిరాలేదు. అతడేదోవ్యూహం పన్నుతాడు.

నిజంగానే ఒక ఎత్తు ఎత్తాడు.

అత డలా గుహలో పడుకొనివుండగా అడవిలో వ్యవహారాలన్నీ యథాప్రకారం సాగిపోయాయి. వ్యవహారా లిలాగనే వుంటే దీన్ని శ్రేయోరాజ్యమని పిలవడం ఉచితం కాదు. ఇంతకీ గవర్నరు పని ఏదో ఆదర్శరాజ్యాన్ని నెల కొల్పడం కాదు. తరతరాలుగా వస్తూన్న పవిత్ర వ్యవస్థను రక్షించడం అతడి విధి. ఆ వ్యవస్థలో లోపాలుండుగాక! దానితో అతడికి నిమిత్తంలేదు. ఈ విధి నిర్వహణతో పెద్దా

చిన్నా దురంతాలకు నిమిత్తం లేదు. "సహజమైన" దురంతాల తోనే అతడు సంతృప్తిపడాలి. తోడేళ్లు కుందేళ్ళను చీల్చుకు తినాలనీ, గద్దలూ గూబలూ కాకుల్ని పొడుచుకు తినాలనీ ప్రాచీన సంప్రదాయం విధిస్తావుంటే - అది శ్రేయోరాజ్యానికి భిన్నమైన దైనప్పటికీ అదీ ఒక వ్యవస్థే కాబట్టి దాన్ని మన్నించాలి. గౌరవించాలి. అయినప్పటికీ కాకులూ కుందేళ్లు ఫిర్యాదులు చేయకపోవడంవల్లా, నిరంతరం సంతానాభివృద్ధిని చేసుకొంటూ వుండడంవల్లా సదరు వ్యవస్థ దాని పరిమితు లను ఉల్లంఘించడం లేదని స్పష్టమవుతుంది. కాబట్టి యీ "సహజ దురంతాలు" సరిపోవా ?

ప్రస్తుతం అడివిలో అంతా అనుకొన్నట్లే జరిగి పోతోంది. అడివి సంప్రదాయాలు ఒక్కసారికూడా విచ్ఛిత్తి కాలేదు. రేయింబవళ్లు అడివిలో కోటానుకోట్ల గొంతులు ప్రతిధ్వనించుతున్నాయి. కొన్ని బాధతో మూలుగుతూవుంటే మరికొన్ని విజయగర్వంతో వికటహాసం చేస్తున్నాయి. ఆ బాహిరరూపం, ఆ శబ్దాలు, ఆ వెలుగు, ఆ నీడలు, ఆ ప్రాణి కోటిఅంతా ఘనీభవించినట్లు చలనం లేనట్లు కనిపించింది. లోతుగా పాతుకొనిపోయిన ఈ వ్యవస్థనుచూస్తే వాలును యెంత ముష్కర గవర్నయినా దురంతాలతో కీర్తి నార్జించ గలనన్న ఆశ కలలో కూడా పెట్టుకోడు. అలాంటప్పుడు ఇంక "దేవరవారి స్వంత పూచీమీద" జరిగేవాటికి ఆస్కారం యెక్కడిది ?

ఇలాగ శ్రేయోరాజ్యాన్ని గురించి ఒక పెద్ద సిద్ధాంతం ముమ్మిడి భల్లూక దేవరవారికి మనోనేత్రాలముందు గోచ

రించింది. ఒకప్పుడు గాడిద ఇష్టాగోష్ఠిగా తనతో అన్న మాటలు యిపుడు జ్ఞాపకం వచ్చాయి.

"ఇదుగో ఈ దురంతాల వ్యవహారాలడిగి నన్నెందుకు చంపుతావు ? వర్ణాశ్రమాచార ధర్మాలను ఉన్న వాటి నున్నట్లు వుండనీ అనేది రాజ్యతంత్రంలో ప్రధాన సూత్రం. తేట తెలుగుమాటల్లో చెప్పాలంటే ఒక మూర్ఖుడింకో మూర్ఖునిపై సవారిచేస్తాడు. మూడో మూర్ఖుడు కొరడా అవుతాడు. తెలిసిందా నేస్తం ? దురంతాలు వాటంతటఅవే సంభవిస్తాయి అన్న సూత్రానికి నువ్వు కట్టుబడివున్నావా అంతా సవ్యంగా నడిచిపోతుంది" అని గాడిద చెప్పింది.

అచ్చం గాడిద చెప్పినట్లే ఇప్పుడంతా నడుస్తోంది. ఎవరైనా చేయవలసింది తీరిగ్గా కూర్చొని ఒక మూర్ఖుడు ఇంకొక మూర్ఖునిపై స్వారీచేసి మూడవ మూర్ఖునితో తోలుతూవుంటే చూసి ఆనందించడం. మిగతా వ్యవహారాలన్నీ సజావుగా సాగిపోతాయి.

"అసలింతకీ గవర్నర్లను ఎందుకు నియమిస్తారో అర్థం కావడంలేదు..." ఇలా ఆలోచన సగం సాగేసరికి తన పెద్ద జీతం సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే తన "అల్లరి చిల్లరి" ఆలోచనలను అణచివేశాడు. అంతా సజావుగానే సాగిపోతుందనుకొన్నాడు.

అలా అనుకొని జీతం తీసుకొనడానికి తప్ప తన గుహ దాటి రాకూడదు – అని నిశ్చయించుకొన్నాడు. అప్పటి నుంచీ అడవిలో వ్యవహారాలన్నీ సజావుగా సాగిపోతున్నాయి. భల్లూకదేవర నిద్రపోయాడు. జనం పందులు, కోళ్ళు, తేనె,

కాపుసారా, కానుకలు తెచ్చి గుహముందు రాసులుపోశారు. నిర్ణీతసమయంలో భల్లూకదేవర మేల్కొని గుహ వెలుపలకు పాకి అన్నింటినీ ఆరగించాడు.

భల్లూకదేవర అలాగ ఆ గుహలో అనేకసంవత్సరాలు గడిపాడు. అప్పటినుంచీ ఆటవిక జీవితానికి ఎట్టి అడ్డంకులూ సంభవించలేదు. "సహజ" దురంతాలు తప్ప మరేలాంటి దురంతాలూ జరగలేదు. భల్లూకదేవర వారిని సింహ సార్వభౌములు మరిచిపోలేదు. తొలుత ఆయనకు లెఫ్టినెంట్ కర్నల్ హోదా ప్రసాదించారు. ఆ తర్వాత కర్నలు హోదా. కొసకు...

కాని భల్లూకదేవర వారికి ఆనందదాయకమైన ఈ దశలో వేటగాళ్ళు వచ్చి ఆయనను గుహలోంచి బైటికి ఈడ్చారు. మొత్తం బొచ్చుగల అన్ని జంతువులకు పట్టినగతే ఆయనకు కూడా పట్టింది.





# దగాకోరు సంపాదకుడు

అనగా అనగా ఒక పత్రికా సంపాదకుడూ, ఒక పాఠకుడు. పత్రికా సంపాదకుడు పచ్చి అబద్ధాలకోరు. విధీ విరామం లేకుండా అబద్ధాలాడుతూ వుండేవాడు. పాఠకుడు అమాయకు డవడంవల్ల అన్నీ నమ్మేసేవాడు. అసలు ప్రపంచం పుట్టినప్పటినుంచీ ఇంతే. అబద్ధాలకోర్లు అబద్ధాలాడ్డం. అమాయకులు వాటిని నమ్మడం.

సరే పత్రికా సంపాదకుడు తన గుహలో కూర్చుని అబద్ధమాడేశాడు. "ప్రియ పాఠకా జాగ్రత!" "శీతజ్వరం వ్యాప్తి!" "తొలకరి నుంచీ వర్షాభావం!" "కరువు ముంచుకొని వచ్చేసూచనలు" "పల్లెలూ పట్నాలూ అగ్నికాహుతి!" "ప్రెయివేటు ప్రభుత్వ ఆస్తులను కొల్లగొట్టిన సైనం" పాఠకుడు వీటన్నింటినీ మూటకట్టుకొన్నాడు. పత్రికా సంపాద

కుడు తన కళ్లు తెరిపించాడని నమ్మాడు. "ఆహా! మనకు పత్రికాస్వాతంత్ర్యం వుంది. ఎక్కడ చూసినా అగ్ని, కరువు, శీత జ్వరాలు!" అని ఒక్క నిట్టూర్పు విడిచాడు.

తన అబద్ధాలు పాఠకుని మనసుకు హత్తుకొన్నాయని తెలిసిన సంపాదకుడు ఆ సంతోషంతో మరిన్ని పచ్చి అబద్ధాలు కుమ్మరించాడు. "సాంఘిక భద్రత ప్రజల, మాన ప్రాణ రక్షణ, కలికానికికూడా మిగల్లేదు! పాఠకుడా వీధుల్లోకి వెళ్ళకుండావుండడం మంచిది. వెళ్ళావా అరదండాలు తగిలించి జైల్లో తోయడం ఖాయం!"అని హెచ్చరించాడు. అమాయక పాఠకుడు వీధులన్నింటినీ జాగ్రత్తగా పరికించాడు. "భద్రత బొత్తిగా లేదని పత్రికాసంపాదకుడు చెప్పినమాటలు అక్షరాలా నిజంగా కనిపిస్తున్నాయి!" అనుకొన్నాడు. అది చాలనట్లు మరొక అమాయక పాఠకుణ్ణి కలుసుకొని "ఇవాళ పత్రిక చదివావా? భద్రతారాహిత్యాన్ని గురించి రాసింది అద్భుతంగా లేదూ? నీకు కూడా అలాగే అనిపించిందికాదూ!" అని అడిగాడు "నిజం! ఇంత దారుణం ఎన్నడూ లేదు" అని రెండవ అమాయక పాఠకుడు జవాబిచ్చాడు.

"అవునండీ సరిగా మాడు పగలగొట్టాడం చే నమ్మండి. వీధుల్లో నడవడమే కష్టమైపోయింది. ఎప్పుడు అరదండాలు తగిలిస్తారో, ఎప్పుడు జైల్లో తోస్తారో ఏమీ చెప్పలేం."

ఇలాగ వారు పత్రికా స్వాతంత్ర్యాన్ని పొగుడుతూ మాట్లాడుకొన్నారు. "ఇంతకుముందు ఈ శీతజ్వరం సంగతి మనకేమీ తెలియదు. ఇప్పుడు తెలుసుకొన్నాం" అని తాము కొత్తగా ఆర్జించిన విజ్ఞానానికి వారెంతో మురిసి

పోయారు. పత్రికా సంపాదకు డిప్పుడు స్వయంగావచ్చి ఇదంతా అబద్ధమన్నా లాభంలేదు !

ఇక పత్రికా సంపాదకుడు చాలా ఆనందించాడు. అబద్ధాలు అతనికి కనకరాసులు కురిపిస్తున్నాయి. అసలు నిజం రాసే వ్యాపారం ఎవరికి కావాలి ? అయినా ప్రయత్నించి చూడండి. పంక్తికి దమ్మిడీ చొప్పునకూడా కిట్టుబాటు కాదు. ఇక అబద్ధాలన్నారా వాటి వ్యవహారమే వేరు. చేతికొచ్చిన చెత్త రాసిపారేయండి. పంక్తికి దమ్మిడీలు కొల్లలు కొల్లలుగా వస్తాయి.

పత్రికా సంపాదకుడు, పాఠకుడు ప్రాణస్నేహితులై పోయారు. సంపాదకుడు అబద్ధా లాడినకొలదీ కోటీశ్వరు డయ్యాడు. అబద్ధాలకోరు కంతకన్న కావలసిన దేముంది ? ఇక పాఠకుడు ఎక్కువ అబద్ధాలు చదివిన కొలదీ ఎక్కువ పైసలు పత్రిక ఏజంటుకి ధారపోశాడు. పత్రికా సంపాదకుడు చిల్లరగాను, టోకుగానుకూడా ధనమార్జిస్తున్నాడు.

కిట్టనివా ళ్ళతణ్ని చూసి "చూడవోయి మొన్నటి దాకా వీడికసలు ఒంటిన సరైన బట్టలుకూడా వుండేవికావు. అలాంటివాడు ఇప్పుడెలా ఊరేగుతున్నాడో చూడు ! ఇప్పుడొక పక్షిగాడ్ని జానపదకథా రచయితనీకూడా కొలువులో పెట్టుకొని ఒక వెలుగు వెలుగుతున్నాడు!" అని రుంజుకుంటూ వుంటారు.

అతనిచేత నిజమైన వార్తలు రాయించాలని ఇతర పత్రికలవాళ్ళు చాలా ప్రయత్నాలు చేశారు. బహుశా ఆ పత్రిక పాఠకులంతా తమ పత్రికలవైపు మొగ్గుతారేమోనని

ఆశించారు. కాని అలా జరగలేదు. పాఠకులు తమ పద్ధతిని మానలేదు.

హుషారు కొలిపే అబద్ధ
మొక్కటున్నచాలు
బలాదూరు దానిముందు
పదివేల నిజాలు!

ఇలా ఎంతకాలం గడచిందో ఎవరికీ తెలియదు. కాని కొంతమంది దయాళువులు అమాయక పాఠకుణ్ని గురించి చింతించారు. వారు దగాకోరు పత్రికా సంపాదకుణ్ని పిలిపించి "సిగ్గూ లజ్జాలేని ఈ దగాకోరు వ్యాపారాన్ని కట్టిపెట్టు. ఇంత వరకూ అబద్ధాలమ్మి ధనమార్జించావు. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని నిజాన్ని అమ్ముకో" అని హితవు చెప్పారు.

క్రమంగా పాఠకులలోకూడా కొందరు విషయం గ్రహించి పత్రికా సంపాదకునికి లేఖలు రాశారు.

"మహాశయా! నిన్నరాత్రి నేనూ, మా అమ్మాయీ కలిసి అలా షికారు వెళ్లాం. ఆ రాత్రంతా లాకప్‌లో వుండ వలసివస్తుందని ముందే అనుకొన్నాం. ఎందుకైనా మంచిదని ముందు జాగ్రత్తపడి ఇన్ని రొట్టెలుకూడా సంచీలో వేసు కొన్నాం. జరగనున్నదంతా ఊహించుకొనేసరికి ఒళ్ళు గగుర్పొడిచింది. కాని ఇద్దరమూకూడా సురక్షితంగానే ఇంటికి తిరిగి వచ్చాం. ఇటీవల సాంఘిక భద్రతను గురించి మీరు రాసిన సంపాదకీయాలకూ, ఇప్పటి మా అనుభవాలకూ పొందుకుదరడంలేదు. తమ రాతలకు అర్థం ఏమిటో సెల విస్తారా?"

అసలిలాంటి లేఖలు వస్తాయని పత్రికా సంపాదకునికి ముందే తెలుసును. నిజం చెప్పాలంటే అతడి కిప్పుడు అబద్ధాలాడి ఆడి విసువు పుట్టింది. చాలాకాలంనుంచీ నిజంచెప్పడం కోసం ఉవ్విళ్లూరు తున్నాడు. అబద్ధాలు చెపితే తప్ప పాఠకులకు నచ్చనప్పుడేం చేయాలి? అబద్ధాలాడ్డం ఘోరనే అనుకోండి. కాని బ్రతికాలంటే అబద్ధాలాడక తప్పదుమరి. ఇప్పుడంతా నిజం తెలుసుకోవాలని ఇంతలా కుతూహలపడుతున్నప్పుడు సంపాదకునికి అభ్యంతర మేం వుంటుంది?

సంపాదకుడు తన పాఠకులకు దినదిన సత్యాలు పంచడం ప్రారంభించాడు. "శీతజ్వరం మటుమాయమై పోయింది" ఇలాంటి వార్తలెలా వున్నాయి. లాకప్పులులేవు. అగ్ని ప్రమాదాలు లేవు. ఫలానా వూరు కాలిపోయినప్పటికీ దాన్ని తిరిగి పూర్వంకన్నా సుందరంగా నిర్మించారు. ఇటీవల పడ్డ వర్షాలమూలంగా పంటలు ఏపుగా పెరిగాయి. కావలసినంత తినడమే కాకుండా కొంత మనకాళ్లముందు జర్మనీ వాళ్లకు కూడా పారేయవచ్చును. తీసుకోరా జ...కు...!

పత్రికా సంపాదకుడు కేవలం సత్య ప్రవచనాలనే వ్రాసినప్పటికీ పంక్తికి పైసా చొప్పునే చెల్లించుకొంటూ వచ్చాడు. కాని చిల్లర అమ్మకంలో నిజం విలువ పడిపోయింది. అప్పుడు నిజాలూ, అబద్ధాలూ రెండూ ఒకటేననీ, నిజానికి రెండింటికీకూడా విలువ సూన్యమేననీ కనిపెట్టాడు. పత్రికల వార్తలు చప్పపడలేదు. పైగా చాలా హుషారిచ్చేవిగా తయారయ్యాయి.

పాఠకుడు తేరుకొన్నాడు. స్పష్టంగా చూడగలిగిన శక్తిని తిరిగి సంపాదించాడు. అబద్ధాలను నిజాలని నమ్మిన రోజుల్లో పాఠకునికి బాధ అనిపించలేదు. ఇప్పుడు మనస్సుకు కావలసినంత శాంతి దొరికింది. రొట్టెల దుకాణానికి వెళితే "రొట్టెలు చవక అయేట్లు కనిపిస్తోందే" అని రొట్టెలవా డంటాడు. పిట్టల దుకాణానికి వెళితే. "అసలు ముందుముందు కోజులకు ఖరీదే పెట్టవలసివుండ దనిపిస్తోంది" అంటాడు.

"నిజం! ఇప్పుడు వాటి ధరఎంత ?

"జోడు రెండు రూపాయలు."

ఎంత మార్పు వచ్చింది ?

ఒకరోజున అమాయక పాఠకుడు చక్కగా ముస్తాబై వీధిన బయలుదేరాడు. చేతికర్ర తిప్పుకుంటూ కులాసాగా కూనిరాగం తీస్తూ "ఇదుగో చూశారా, ఇప్పుడు నేనెంత క్షేమంగా వున్నానో" అన్న ధోరణిలో నడిచాడు.

కాని ఈ సందర్భంలో దౌర్భాగ్యవశాత్తు ఒక సంఘటన జరిగింది. అతడలా నాలుగడుగులు వేశాడో లేదో చట్ట సంబంధమైన పొరపా టొకటి జరిగింది. దానితో మన అమాయక పాఠకుడు కటకటాల వెనకకుచేరాడు. అక్కడ రోజంతా తిండీ తిప్పలూ లేకుండా పడివుండవలసి వచ్చింది. అతనికి అన్నం తీసుకొచ్చారు. మర్యాదగానే ముందు పెట్టారు. కాని దానివైపు ఒకసారి కన్నెత్తిచూసి "అయితే బాగా పండినపంట ఇదన్నమాట" అని గొణుక్కున్నాడు.

ఆ మర్నాడే అతనికి శీతజ్వరంకూడా తగిలింది.

చట్ట సంబంధమైన పొరపాటును ఆమర్నాడే దిద్దుకొన్నారు. మన పాఠకుణ్ణి విడిచిపెట్టారు. అయితే జామీను తీసుకొన్నారు. (అతడిని తిరిగి తీసుకొని రావలసివస్తుందేమో ఎవరికెరుక !) పాపం ఇంటికి తిరిగివచ్చి చచ్చిపోయాడు.

ఇక దగాకోరు సంపాదకుని సంగతి. అతడు రోజురోజుకూ గొప్పవాడవుతున్నాడు. ఇప్పుడతని నాలుగో మేడ తయారవుతోంది. పొద్దుటినుంచీ సాయంత్రం వరకూ అతడు ఒకే ప్రశ్నను గురించి ఆలోచిస్తూవుంటాడు. ఆమాయక పాఠకుణ్ణి దగాచేయడానికి మంచిమార్గం ఏది? అబద్ధంచెప్పడమా? నిజం చెప్పడమా?





# గ్రద్దరాజుగారి కళాపోషణ

గ్రద్దరాజులుంగారి మీద చాలామంది కావ్యాలు వ్రాశారు. అంతా గళమెత్తి దాని గుణగణాలను కీర్తించారు. సాటిలేని సౌందర్యం, మేటిచూపు, ఎగురుతూవుంటే రాజఠీవి ఉట్టిపడుతుంది అని కవులు పొగిడారు. గ్రద్ద ఇతర పక్షుల్లాగ రెక్కలల్లారుస్తూ ఎగరదు. ఆకాశంలో తేలియాడుతుంది. సూర్యుణ్ణి సూటిగా చూడగలుగుతుంది. పిడుగుల్ని లెక్క చేయదు. కొందరు కవులు గ్రద్దది దయార్ద్ర హృదయమని కూడా ప్రస్తుతించారు. ఏ కవి అయినా పోలీసువాణ్ణి పొగడాలనుకొన్నాడనుకోండి. అప్పుడతడు గ్రద్దతో అతడిని పోల్చుతాడు. ఫలాన పోలీసు కానిస్టేబు గ్రద్దలాగ ఒడిసిపట్టాడు. విన్నపాలు విన్నాడు, కరుణించాడు అని పోల్చేవారు.

ఈ స్తోత్రాలను నేను చాలాకాలం నమ్మాను. 'ఒడిసి పట్టడం ఆ తర్వాత కరుణించడం,' ఎంత గొప్ప విషయం! కరుణించడం అన్నది చాలా అద్భుతమైనది. ఈ కరుణ ఎవరి మీదననుకొన్నారు? ఒక ఎలకమీద! ఒక ఎలక! వెంటనే ఒక కవి మిత్రునివద్దకు పరుగెత్తి గ్రద్ద మహౌదార్య వార్తను అందించేవాణ్ణి. కవి వెంటనే భద్రాసనంలో వైరాయించి ఒక్క క్షణంసేపు గాలి మేసి కవిత్వాన్ని కక్కుతాడు.

కాని ఒకరోజున హఠాత్తుగా నాకోభావం కలిగింది. అసలు గ్రద్ద ఎలక నెందుకు క్షమించాలి! ఎలక ఏదో తన స్వంత పనిమీద దారినపోతుంది. గ్రద్ద దాన్ని పసిగట్టింది. నేలకు దూసుకొనివచ్చి ఒడిసిపట్టింది. ఆ పట్టడం పట్టడం గొంతు నులిమినంత పని చేసింది... ఆ తర్వాత కరుణించింది. గ్రద్ద ఎలక నెందుకు కరుణించాలి? ఎలకే గ్రద్ద నెందుకు క్షమించరాదు?

ఆలోచించిన కొలదీ అనుమానాలు ఎక్కువయ్యాయి. ఎవరేం చెప్పినా విన్నాను. పరిశీలించాను. ఎక్కడో మెలిక వుంది. మొదటి విషయం గ్రద్ద ఎలకను క్షమించడంకోసం పట్టిందా? సరే గ్రద్ద ఎలకను క్షమించగలదనే అనుకొందాం. అటువంటప్పుడు ఎలక విషయంలో అసలు జోక్యంచేసుకొనడ మెందుకు? గ్రద్ద కానీయండి గ్రద్ద తాత కానీయండి ఏమైనా అది పక్షి. అయినప్పుడు ఆ పక్షితో పోల్చినప్పుడు పోలీసు వాడైనప్పటికీ సంతోషించడు.

గ్రద్దను గురించి నా భావాలు చెప్పమంటారా? గ్రద్దలు గ్రద్దలే. అంతకుమించిన హోదా వాటికిలేదు. క్రూరపక్షులు.

వాటికి ఆశ ఎక్కువ. ప్రకృతి సిద్ధంగానే అవి శాకాహార విరోధులు అని సమర్థించవచ్చును. అయినా వాటిని క్రూర పక్షులేనని చెప్పాలి. బలంగల పిట్టలు. దూరదృష్టి. వేగం, నిర్దాక్షిణ్యం వాటి ప్రత్యేకతలు. వాటిని చూస్తేచాలు పక్షి ప్రపంచమంతా హడలిపోతుంది. ఈ హడలు వాటిమీద భయంతోనేకాని కవులు చెపుతున్నట్లు భక్తితోకాదు. గ్రద్ద లకూ సమాజ జీవితానికీ చుక్కెదురు. అగమ్య ప్రదేశాలలో ఒంటరిగా బ్రతుకుతాయి. పొరుగుపచ్చను సహించవు. ఎప్పుడూ ఏదో కొట్టుకొని తినడం, తినవలసిన అవసరం లేనప్పుడు కునుకుపాట్లుపడ్డం ఒకటే పని.

*  *  *  *

ఒకప్పుడొక గ్రద్ద వుండేది. ఏకాంతవాసంతో విసువు పుట్టి ఒకరోజున భార్యను పిలిచి ఇలా అంది :

"మనిద్దరమూతప్ప మరో పలుకుతోడు లేకపోతే ఏమీ తోచడంలేదు. పగలంతా అలా సూర్యుడికేసి చూస్తూ కూర్చుంటే కొసకు పిచ్చెత్తుతుందేమోకూడా."

గ్రద్ద ఆలోచనలో పడింది. ఆలోచించినకొద్దీ పూర్వ కాలపు జమిందార్లలాగ వుంటే ఎంత బాగుంటుంది. అని పించింది. మందిమార్బలాన్ని పోగుచేసి దొరలాగ ఎందుకు బ్రతకకూడదు అనుకొంది. కాకులు తాజా పుకార్లు మోసు కొనిరావాలి. చిలకలు పిల్లి మొగ్గలు వేయాలి. ఏంట్రింత వంటకాలు చేయాలి. గూబలు, పెద్దపులుగులు, పసిడిగంటలు రాత్రి పహరా కాయాలి. వేటపులుగులు, డేగలు, రాబందులు

భోజన సంభారాలను తీసుకొని రావాలి. తాను రక్తపాతాన్ని కావిస్తూ వుండాలి. ఇలాగ ఆలోచించి, ఆలోచించి కొసకు నిశ్చయానికి వచ్చింది. డేగనీ, వేటపులుగునూ, రాబందునూ పిలిచి ఇలా ఫర్మానా జారీ చేసింది.

"మందిమార్బలాన్ని తోలుకొని రండి. వారంతా నాకు కొలువు చేయాలి. నాకు వినోదం కల్పించాలి. నేను వారిని నిరంతరం భయం కొల్పుతూ వుంటాను. అంతే."

ఆ పక్షులు గ్రద్ద ఆజ్ఞలను శిరసావహించి నలుమూలలకూ ఎగురుతూ పోయాయి. మొదట అవి ఒక కాకుల మూకను పోగుచేశాయి. వాటి నన్నింటినీ జనాభా పట్టికలో నమోదుచేసి పన్ను సన్నదు లిచ్చాయి. కాకి మెత్తనిపక్షి. దేనికైనా సరే వెంటనే ఒప్పుకొంటుంది. దాని ప్రధాన లక్షణం ఒకటుంది. పల్లెబైతుగా వుండగల అసాధారణ ప్రజ్ఞ దానికుంది. సరే ఇక పల్లెబైతులు అంటే రైతులు అందుబాటులో వున్నప్పుడు మరికొన్ని హంగులు సమకూర్చుకొనడం చాలా సులభమన్న సంగతి అందరికీ తెలుసును. గ్రద్ద అనుచరులు ఆ పనే చేశారు. నీటి పిట్టల్ని చేర్చి నౌబత్ ఖానా ఏర్పరచారు. చిలకలకు విదూషక వేషం వేశారు. ఏంట్రింత పేరుమోసిన దొంగ కాబట్టి దానికి ఖజానా తాళం చెవులు అప్పగించారు. గూబలను పసిడి గంటలను పహరాకు నియోగించారు. ఆస్థానం హంగు అంతా ఏర్పడింది. కోయిలనుకూడా మరిచిపోలేదు. దాన్ని గ్రద్దరాణీ వారివద్ద శకునపక్షిగా నియమించారు. కోయిల పిల్లలకోసం ప్రత్యేక అనాథ శరణాలయం కట్టించారు.

కాని ఆ స్థానం అనుకొన్నట్లు సాగలేదు. ఏదో కొరవడింది. ఆ కొరవడింది ఏదా అని చాలాకాలం ఆలోచనలు చేశారు. కొసకు అదేమిటో తట్టింది. ప్రతీ జమిందారుగారి ఆస్థానంలోనూ కళలకు, శాస్త్రాలకు స్థానం వుండాలి. కాని గ్రద్దగారి దర్బారులో ఈ రెండూ లేవు.

ఈ కొరతను ముఖ్యంగా మూడు పిట్టలు తమకు అవమానంగా భావించాయి. అందులో ఒకటి కత్తెరపిట్ట, రెండవది వల్లంకిపిట్ట, మూడవది బుల్బులు.

కత్తెర పిట్ట చాలా తెలివైనది. చాడీలు దానికి వెన్నతో పెట్టిన విద్య. సిపాయి పిల్లల స్కూల్లో చదివింది. ఆ తర్వాత సేనలో రెజిమెంటు గుమాస్తాగా పనిచేసింది. క్రమశిక్షణకు సంబంధించిన నిబంధనలన్నీ క్షుణ్ణంగా తెలియడంవల్ల "అడవి గోల" అనే పత్రికకు సెన్సారు లేకుండా నడపుకొనడానికి అనుమతి సంపాదించింది. కాని ఎంత ప్రయత్నించినా అధికారుల మెప్పు దొరకలేదు. నిషిద్ధ విషయాలను తడవడమో చెప్పవలసిన విషయాలను మరిచి పోవడమో ఏదో ఒకటి జరిగేది. దీనితో పాటు తల బొప్పిలుకడుతూ వుండేది. అందుకు గ్రద్ద కొలువులో చేరాలని నిశ్చయించింది. ప్రతి వుదయం గ్రద్దగారి కీర్తిని ఉగ్గడించే వందిగా కుదురుతే ఎట్టి అపాయమూ రాదనుకొంది.

వల్లంకి పిట్ట బాగా పాండిత్యంగల దిట్ట. ఏకాంతవాసి. ఎన్నడూ ఎవరినీ చూసి ఎరగదు. పగలంతా ఓ చెట్టుకొమ్మ మీద కూర్చుని చెలిస్తూ వుంటుంది. అడివి చరిత్రమీద అనేక గ్రంథాలను చెక్కింది. "బ్రహ్మరాక్షసి వంశాను

క్రమణిక" "పేదరాసి పెద్దమ్మకు పెళ్ళయిందా?" "మాయల మల్లి మదన విలాసమూ జనాభా లెక్కలు" ఇలాంటి గ్రంథాలెన్నో గిలికింది. కాని ఎంత గిలికినా దానికి ప్రచురణకర్తలెవరూ దొరకలేదు. అందుకని నల్లంకిపిట్టకూడా ఆస్థాన ఐతిహాసికునిగా గ్రద్దకొలువులో చేరాలని నిశ్చయించింది. ఏమో గ్రద్ద తన రచనలను అచ్చు వేయిస్తుందేమో(కాకుల్ని కొట్టి) ఎవరికి తెలుసును?

ఇక బుల్బులు కెప్పుడూ అసంతుష్టి అన్నమాటే లేదు. దాని తీయని పాటల్ని విని లేత మొక్కలుకూడా మత్తిల్లి పోయాయంటే ఇక షావుకార్ల సంగతి వేరే చెప్పాలా? బుల్బులు గొంతులోంచి రాగాలు సాగుతూవుంటే ప్రపంచమంతా ఊపిరి బిగబట్టివింది. విని మూర్ఛపోయింది. కాని బుల్బులికి కామం మెండు. కీర్తి కామం అంతకన్న మెండు. స్వతంత్ర అటవీ ప్రాంతమంతటినీ తన గాన మాధుర్యంతో ముంచెత్తి ప్రతి హృదయాన్ని మత్తెక్కించినా చాలలేదు. గ్రద్ద స్వయంగా చీమగ్రుడ్ల హారాన్ని తన మెడలో అలంకరిస్తుందనీ, బ్రతికివున్న బొద్దెంకనే పతకంగా బహూకరిస్తుందనీ ఆశపడింది. గ్రద్దరాణి వెన్నెల రాత్రులలో తనకు సంకేతా లేర్పరుస్తుందని కలలుకంది.

ఇంతకీ చెప్పవచ్చే దేమిటంటే ఈ మూడు పిట్టలూ తమకు ఆస్థాన ప్రవేశమిమ్మని డేగని వేధించాయి.

ఆస్థానంలో కళలకు, శాస్త్రాలకు స్థానం కల్పించవలసిన అవసరాన్ని గురించి డేగ చేసిన మనవిని గ్రద్ద చిత్తగించింది. కాని అది చిత్తాని కెక్కడానికిమాత్రం చాలాకాం పట్టింది.

అద్రుమీాది ఎరకలను అటూ ఇటూ కదిలిస్తూ అలాగే కూర్చుంది. కళ్ళు ఎండలో కెంపుల్లా మెరిశాయి. గ్రద్ద జీవితంలో ఎన్నడూ పత్రిక చూసి ఎరగదు. మాయలాడినీ, మంత్రకత్తెనూ గురించి ఎన్నడూ ఆలోచించలేదు. బుల్బులు అంటే అదొక చిన్నపిట్ట అనీ ఒక పంటికిందికికూడా రాదు అని మాత్రమే తెలుసును.

"అసలు బోనాపార్టీ చనిపోయిన సంగతికూడా మీాకు తెలియదు. కావలిస్తే పందెం వేస్తాను" అంది డేగ.

"బోనాపార్టీ ? ఎవడు వాడు ?" వాడిని గురించి తెలుసుకోనడంవల్ల వచ్చే నష్టమేమీా లేదు. మీారెవరికైనా విందుచేశారనుకోండి అప్పుడెవరైనా బోనాపార్టీ కాలంలో అది అలా వుండేది. ఇది ఇలా జరిగింది అన్నారనుకోండి. అప్పుడు మీారు కళ్ళుమిటకరిస్తు కూర్చోవాలి. అవునా?"

గూబను సలహాకోసం పిలిచింది గ్రద్ద. ఆస్థానంలో శాస్త్రిలను, కళలనూ పోషించాలని గూబకూడా సలహా ఇచ్చింది. దానివల్ల గ్రద్ద జీవితం మహోజ్వలంగా వుండగలదనీ మంచి కీర్తిరాగలదనీ చెప్పింది.

"విజ్ఞానం వెలుగు. అజ్ఞానం చీకటి. పొట్టనింపుకోనడం, నిద్రపోవడం గొప్పకాదు. ఒక గుంపులో ఎన్ని బాతులున్నాయో లెక్కపెట్టడానికి ప్రయత్నిస్తే అప్పుడు తెలుస్తుంది. లెక్క చేతకాకపోతే ఎంత అవమానం ? ఆ పైడి పిట్టను చూడండి. దానికి తెలిసిన విద్య అల్లా ఒక నీళ్ళ కడవ మోయడం. ఆయన దాన్ని చూడ్డానికి ఎంత ధనం ఖర్చుపెడుతున్నారు ?

"నేను చీకటిలో చూడగలను. అందుకని నన్నంతా విజ్ఞాని అని పిలుస్తారు. ఇక మీరు మీరుకూడా రెప్పార్పకుండా సూర్యునివైపు గంటలకొలదీ చూడగలరు. అయినా అంతా ఏమంటున్నారో తెలుసునా ? గ్రద్ద చురుకైనదేకాని మట్టిబుర్ర అని"

"సర్ ర్ ర్ శే! నేను శాస్త్రానికి విరోధినికాను" అంది గ్రద్ద.

అనడం తరవాయి. అంతా అమరింది. మర్నాడు గ్రద్ద ఆస్థానం "స్వర్ణయుగం"లో అడుగుపెట్టింది. కాటుక పిట్టలు "బాలలకు విజ్ఞాన ఫలమిచ్చు బలము" అన్న కొత్త జాతీయ గీతాన్ని సాధనచేశాయి. నీటి పిట్టలు నౌబత్ ఖానాలో సన్నాయిమేళం కట్టాయి. చిలుకలు కొత్త కొత్త జాతీయాలు నేర్చుకొన్నాయి. కాకులపైన కొత్త పన్ను విధించి దానికి "చదువుల పన్ను" అని పేరు పెట్టారు. వేట పులుగులు డేగల పిల్లలను పౌజు పాఠశాలలో చేర్చారు. గూబలను విజ్ఞాన శాస్త్ర పరిషత్తులో చేర్చారు. కాకి పిల్లలకుకూడా కానీ కానీ బాలశిక్ష లిచ్చారు. కాటుక పిట్టల్లో పెద్దదాన్ని ఏరి ఆస్థానకవిగా నియమించారు. మర్నాడు ఉదయం బుల్బులుతో పోటీకి సిద్ధం కావలసిందని హుకుం చేశారు.

ఎలాగైతేనేం తెల్లవారింది. కొత్తగా సంస్థానానికి వచ్చిన పండితులు, కళాకారులూ గ్రద్ద దొరవారిముందు తమ తమ విద్యలు ప్రదర్శించడానికి నిలిచారు.

కత్తెరపిట్ట గొప్ప విజయం సాధించింది. గ్రద్దను ప్రశంసిస్తూ ఉదయం పత్రికలోంచి ఒక వ్యాసాన్ని ధారాళంగా

చదివి వినిపించింది. అదంతా గ్రద్దకు అర్థమయినట్లే అనిపించింది. బ్రతుకు హాయిగా గడుస్తోందని కత్తెరపిట్ట చదివింది. బాగో! అని గ్రద్ద తలూపింది.

"నా పత్రిక బాగా అమ్ముడుపోవడం ఒక్కటే నేను కోరుకొంటున్నాను" అని చదివింది కత్తెరపిట్ట.

'బాగో!' అని మళ్ళీ తలూపింది గ్రద్ద.

"ప్రభువు జీవితం కన్న భృత్యుని బ్రతుకు హాయి. ప్రభువుకు బోలెడన్ని పుస్తకాలు. భృత్యునికేం వుంది. సత్ప్రభువులు తనభృత్యులను కంట కనిపెడుతూనే వుంటారు."

"బాగో!"

"నిజాయితీ వున్నంతకాలం కట్టబట్టకూడా లేదట. అది చచ్చిన తర్వాత చీనిచీనాంబరాలు కడుతున్నాడట."

"బాగో !"

కాని కొంతసేపటికి గ్రద్దకు విసుగెత్తింది. "తర్వాతెవరు ?" అని ఒక్కసారి అరిచింది.

వల్లంకిపిట్ట గ్రద్దవంశక్రమాన్ని సూర్యుని దగ్గరనుంచీ ప్రారంభించింది. గ్రద్ద తన తండ్రిద్వారా ఇలాంటి దెప్పుడో విన్న జ్ఞాపకం. అందుకని ఇక్కడకూడా మాటమాటకు "బాగో" అంది.

వల్లంకిపిట్ట చదువుకు పోతోంది. సూర్యునికి ముగ్గురు పిల్లలు. అందులో సౌరమీను ఆడపిల్ల. సింహమూ గ్రద్దా మొగ పిల్లలు. సౌరమీను భ్రష్టాచారాలకు దిగింది. అందుని తండ్రి దాన్ని సముద్రంలో పారేశాడు. సింహంకూడా

తండ్రిమాట జవదాటింది. అందుకని దాన్ని అడవులకు పంపివేశాడు. కాని గ్రద్దమాత్రం పితృభక్తి గలిగివుంది. అందుకని తండ్రి దానికి తనదగ్గరలోనే స్థానం కల్పించి ఆకాశ రాజ్యం ఏలమని ఆనతిచ్చాడు.

ఇలా నల్లంకిపిట్ట ఇంకా పీఠికనైనా ముగించలేదు. గ్రద్దకు విసుగెత్తిపోయి "తర్వాతెవరు?" అంది.

ఇప్పుడింక బుల్బులు పిట్ట వంతు. గొంతెత్తడంతోనే జీరబోయింది. తనకొక ప్రభువును పంపినందుకు భృత్యుడు ఆనందిస్తూ దేవుణ్ణి స్తోత్రంచేసే ఒక కీర్తన పాడింది. సేవా భావం పుట్టిపడేలాగ పాడ్డానికి బుల్బులు ఎంతో ప్రయత్నించింది. కాని దానిలో నిగూఢమైవున్న కళ మాత్రంచావలేదు. బుల్బులులో నఖశిఖ పర్యంతం సేవకభావంవుంది. అయినా కళమాత్రం అణగి వుండక అడుగడుగునా కట్టలు తెంచుకొని పైకుబికింది. బుల్బులెంత పాడినా గ్రద్దకుమాత్రం అర్థం కాలేదు.

"ఏమిటా వెధవ అలా అరుస్తాడు?" అని అరిచింది గ్రద్ద.

"ఆస్థాన కవిని పిలవండి"

ఆస్థానకవి హాజరయ్యాడు. ఆపాద సేవ్యసేవక ఇతి వృత్తాలనే తీసుకొని కవిత్వం చెప్పాడు. కాని కవిత్వం చాలా గొప్పగావుంది. గ్రద్ద "బాగో బాగో" అని మెచ్చుకొంది. కావ్యగానం అయిన తర్వాత కాటుక పిట్టకు చీమగ్రుడ్ల కంఠ హారాన్ని బహూకరించింది గ్రద్ద. కళ్ళవెంట నిప్పులుకక్కుతూ బుల్బులు వైపుచూసి "ఆ వెధవ ననతలికి తరిమి వేయండి" అని ఉరిమింది.

దానితో బుల్బులు పని అయిపోయింది. కనుమూసి తెరిచేంతలో దాన్ని ఒక బుట్టలోపెట్టి ఒక హోటేలు యజమానికి అమ్మివేశారు. అదక్కడ ఈ నాటికీ మధుర విషాన్ని మదనార్తుల హృదయాల్లో నింపుతూ పాడుతూవుంది.

అయినా విద్యాశాఖనుమాత్రం ఎత్తివేయలేదు. వేట పులుగు పిల్లలూ, డేగ పిల్లలూ కాలేజీలో చదువుతూనే ఉన్నాయి. "విజ్ఞాన శాస్త్ర పరిషత్తువారు ఒక నిఘంటువు రచన కుపక్రమించారు. అతికష్టంమీద "అ" అనే అక్షరం సగంవరకూ సాగిందిబండి. వల్లంకి పిట్ట "బ్రహ్మరాక్షసి వంశానుక్రమణిక"లో పదవభాగాన్ని పూర్తి చేసింది. కాని పండితత్రయంలో మూడవది మాత్రం అంతా చూస్తూ కూర్చుంది. విద్యా వ్యాప్తిని గురించి చేసే ఈ రభసంతా ఏదో ఒకరోజున హఠాత్తుగా అంతరిస్తుందని కత్తెర పిట్ట ఆదినుంచీ అనుకొంటూనేవుంది. దాని భయాలు నిరాధారాలేమి కాదు.

ఇంతకీ ఏం జరిగిందనుకొన్నారు ? విద్యాధికారి పద విని స్వీకరించిన పెద్ద పులుగూ, వేట పులుగూకూడా పెద్ద పొరపాటు ఒకటి చేశాయి. గ్రద్దకు వ్యాకరణం నేర్పాలని అవి నిశ్చయించాయి. చాలా సులభమైన ధ్వని పద్ధతినే అనుసరించి పాఠాలు మొదలు పెట్టాయి కాని ఏడాది గడచినా గ్రద్ద తన పేరును "గద" అనే రాస్తూంది. (కాని, ఒకోసారి పలకవలసివస్తే వర్ణక్రమంకూడా తప్పుతోంది) ఇలా ఎవరైనా ప్రామిసరీనోటుపై సంతకం చేస్తే ఆత్మగౌరవంగల ఏ షావుకారూ దాన్ని అంగీకరించడు.

అంతటితో ఆగిపోయేది. కాని ఉపాధ్యాయులందరి లాగానే ఈ రెండు పిట్టలూకూడా తమ శిష్యునికి ఊపిరి సలప నివ్వలేదు. అదే అన్నింటికన్నా పెద్ద పొరపాటు. గూబ కదం తొక్కుతూ క్క...చ్చ...ట్ట...త్త...ప్ప అని విధీ విరామం లేకుండా ఒకమూలనుంచి రొదచేస్తూ వచ్చింది. లెక్కలలో ప్రాథమిక సూత్రాలు నాలుగూ తెలియకపోతే కొల్లగొట్టిన సరుకును పంచుకోనడం కష్టం అని వేటపులుగు గ్రద్దను ఊదర పెట్టింది.

"ఉదాహరణకు మీరు పదిబాతుగ్రుడ్లను దొంగిలించా రనుకోండి. అందులో రెండు పోలీసువాడికి లంచంపెట్టారు. ఒకటి తిన్నారు. ఇంకెన్ని వుంటాయి?" అని అడిగేది వేట పులుగు.

ఈ లెక్కకు జవాబు తెలియని గ్రద్ద ఊరుకొనేది. కాని లో లోపల మాత్రం వేటపులుగును నమిలి మింగేద్దా మన్నంత కోపం రాజు కొంటూవచ్చింది.

ఈ విధంగా ఉద్రేకాలు పెరిగాయి. కుట్రదారులు ఈ పరిస్థితిని పూర్తిగా వినియోగించుకొన్నారు. కుట్రకు మూల స్తంభం రాబందు. కోయిల నది కూడగట్టుకొంది. కోయిల గ్రద్దరాణీ చెవిలో ముక్కుపెట్టి —

"ఇదుగో ఈ చదువు పేరుతో వాళ్ళు గద్దదొరగారి ప్రాణం తీస్తారు. నామాట నమ్మండి" అని నూరిపోసింది. డేగమీద రాబందూ, కోయిలా కలిసి కొండాలు చెప్పి గ్రద్ద మనసు విరిచాయి.

ఒకరోజున తెల్లవారేసరికి గూబపాఠలకు హాజరైంది. అప్పటికింకా గ్రద్ద కళ్ళయినా తెరవలేదు. గూబ గ్గ-జ్జ-డ్డ-ద్ద బ్బ-అని పాఠాలు ప్రారంభించింది.

"ఏమిటా సొద - ఫో అవతలికి !" అని కసిరింది గ్రద్ద.

"దేవరవారు చిత్తగించాలి. నేను చెప్తూ వుంటాను. తమరు వల్లెవేయాలి — ప్ప...బ్బ—మ్మ—"

"పోతావా పోవా ?"

"య్య...ర్ర...ల్ల...వ్వ..."

గ్రద్ద మహా కోపంతో లేచి గూబను నిలువునా చీల్చి పారేసింది.

ఒకగంట తర్వాత వేటనుంచి తిరిగి వచ్చింది వేట పులుగు. జరిగిన సంగతి దానికేమీ తెలియదు.

"దేవరవారి కొకలెక్క. రాత్రి దోపిడిలో నలభై శేర్ల మాంసం వచ్చింది. దేవరవారికొక భాగం - దాసగణాని కొకభాగం - సమానంగా రెండు వాటాలు వేశాం. తమ వాటా ఎంత వస్తుంది ?" అంది వేట పులుగు.

"మొత్తం అంతా" అని గ్రద్ద జవాబు.

"ఇదుగో అదేం జవాబు ? అంతా మీదే అయితే నేను లెక్కెందుకు అడుగుతాను ?" అంది వేట పులుగు.

వేట పులుగు ఇలాంటి లెక్కలివ్వడం కొత్తకాదు. కాని ఈసారి వేట పులుగు ధోరణి గ్రద్దకు అగ్గిమీద గుగ్గిల మైంది. తాను అవునన్నదాన్ని ఒక నౌకరు కాదనడమా ? ఎంత బేహద్బీ ! గ్రద్ద నెత్తురు కళ పెళ ఉడికింది. గ్రద్దనెత్తురు ఉడుకెత్తినప్పుడు విద్యకు, తిరుగుబాటుకుగల భేదం దానికి

తెలియదన్న సంగతి జగద్విదితం. ఇప్పుడుకూడా అంతే అయింది.

వేట పులుగును కూడా నిశ్శేషంగా సంహారించిన మీదట "శాస్త్ర విజ్ఞాన పరిషత్తు పూర్వంలాగే పనిచేస్తుంది" అని గ్రద్ద ఫర్మానా జారీ చేసింది.

"బాలలకు విజ్ఞాన ఫలము బలమిచ్చు" అని కాటుక పిట్టలు తిరిగి జాతీయగీతాలాపన చేశాయి. కాని స్వర్ణ యుగం చరమదశలో పడ్డదనిమాత్రం అందరికీ తెలిసి పోయింది. ఇక అజ్ఞానాంధకారం ఆవరిస్తుంది. దానితో కుట్రలు కూహకాలు, కల్లోలాలు చెలరేగుతాయి.

వేట పులుగుస్థానంలో డేగ, రాబందు అధికారంలోకి వచ్చాయి. దానితో కల్లోలాలకు బీజం పడింది. పెద్ద ఉద్యోగులు స్పర్ధల్లో, స్వార్థాల్లో మునిగి వుండగా నౌకర్ల సంగతి చూసేనాథుడు లేకపోయాడు.

ఒకనెల గడిచేసరికి "స్వర్ణయుగ" చిహ్నాలు కలికానికి కూడా కానరాకుండా అంతరించాయి. కాటుకపిట్టలకు సోమరి తనం బలిసింది. నౌబత్ ఖానాలో అపస్వరాలు పలుకు తున్నాయి. గోరువంక అందింది అందినంతవరకూ జాగ్రత్త చేసుకొంది. కాకుల పన్ను బకాయీలు పేరుకొనిపోయాయి. వాటిని వసూలు చేయడానికి దొరతనంవారు కొరడాలు వాడ వలసివచ్చింది. ఆనాటి కానాడు పరిస్థితులుమరీ అధ్వాన్నం అయ్యాయి. కొసకు గ్రద్దరాజుగారి సువారానికి కుళ్లు మాంసం వస్తోంది.

ఈ స్థితిని సమర్థించుకొనడంకోసం ౹ డేగా, రాబందూ తాత్కాలికంగా మిలాఖత్తు అయి నెపమంతా విద్యా విధానంమీద నెట్టాయి. "విజ్ఞాన శాస్త్రం లాభదాయకమైనదే కాని దాన్ని అదునుచూసి నేర్చాలి. ఇంతకీ మన తాతముత్తాతలకేం శాస్త్రాలు తెలుసును? వారికి మహారాజులా గడవనేలేదూ? మనకూ అంతే" అని వాదించాయి.

దోషమంతా ఈ విద్యలోనే వుందని నిరూపించడంకోసం అవి కుట్రలను కనిపెట్టి పట్టుకొన్నాయి. పెద్దబాలశిక్ష-ప్రాథమిక ఉపాధ్యాయుడు ఇలాంటి కుట్రలలో వుండడం సహజమేకదా? సోదాలు, తణిఖీలు, దరియాప్తులు, విచారణలు, ఎడతెరిపిలేకుండా సాగాయి.

ఒకనాడు హఠాత్తుగా "చాలించండి" అని గ్రద్ద గర్జించింది. విద్యావిధానం అంతటితో ఆఖరయింది. నాటినుంచీ ఆ రాజ్యమంతా నీరవత నిండుకొంది. ఆ నీరవ నిస్తబ్దతలో గుసగుసలుగా వేసే కీలాపనిందలు కూడా భూమి నలుచెరగులకూ ప్రాకాయి.

కొత్త రాజనీతికి వల్లంకిపిట్ట ప్రథమ కబళమయింది. దానికి వ్యాకరణం వచ్చును. అంతకన్న నేరం ఇంకేంకావాలి?

"నీకు సంధులు వచ్చునా?"

"వచ్చు దేవరా వచ్చు. సంధిపరిచ్ఛేదం అంతా నిద్రలో లేపి అడిగినా అప్పజెప్పగలను."

"స్త్రీ లింగ పుంలింగాలకు భేదం గుర్తించగలవా?"

"ఆహా! చీకటిలోకూడా వాటిభేదం గుర్తించగలను."

చాలును. వల్లంకిపిట్టకు అరదండాలు వేసి ఒక చెట్టు తొర్రలో బంధించారు. కాని పాపం అక్కడ బతికుండగానే దాన్ని చీమలు తినేశాయి. ఆ మర్నాడు ఆ తొర్రలోనే పంచత్వం పొందింది.

వల్లంకిపిట్ట వ్యవహారం ఇలా ముగిసిందో లేదో అక్కడ విజ్ఞానశాస్త్ర పరిషత్తులో పెద్ద దొమ్మీ బయలుదేరింది. కాని గూబలూ, పెద్దపులుగులూ ఆదొమ్మీని ఎదుర్కొన్నాయి. వాటికి ప్రభుత్వం ఇచ్చిన భవనాలు, ఆ భవనాల్లోని విలాసాలు వదులుకోనడం ఇష్టంలేదు. అసలు విజ్ఞానం దుష్టుల చేతుల్లో పడకుండా చూడ్డమే తమకు ముఖ్యం. కాని దాన్ని ప్రచారంచేయడం తమ ప్రధానాశయం కాదని వాదించాయి. అయితే శాస్త్రంవల్ల కలిగే మేలేమిటి అని అడిగింది గ్రద్ద. దానికి జవాబు దొరకలేదు గూబలకు. అంతటితో వెనక్కు తగ్గాయి. ఈ నేరానికిగాను ఆ గూబల్ని చంపి, రైతులకు అమ్మేశారు. రైతులు వాటిని కాకుల్ని తరమడంకోసం దిష్టిబొమ్మలుగా ఉపయోగించారు.

పిల్లకాకులదగ్గర నుంచి బాలశిక్షలను లాక్కొని నానవేసి రుబ్బి చీట్లపేకగా అచ్చువోశాను.

ఆ తర్వాత పరిస్థితులు ప్రచండవేగంతో పరిణమించాయి. గూబల తర్వాత కాటుకపిట్టలు, నీటిపిట్టలు, చిలుకలు, పైడిపిచికలు, వంతులవారీగా రాజాగ్రహానికి గురయ్యాయి. కొసకు చెవిటి కొజుకుకూడా ఏవో భావాలున్నాయని అనుమానించారు. అది పగలంతా మౌనముద్ర ధరిస్తుంది. రాత్రంతా నిద్రపోతూవుంటుంది.

గ్రద్దగారి హావేలీ ఖాళీ అయిపోయింది. మిగిలినది గ్రద్ద దంపతులిద్దరూ. సిబ్బంది మొత్తం మీద డేగా వేట పులుగూ ఇంతే. దూరాన మాత్రం మాగికాకులమూక తమ కేమీ పట్టనట్లు సంతానాభివృద్ధి సాగిస్తున్నాయి. వాటి సంతానం పెరిగినకొలది పన్నుల బకాయీలు కొండల్లా పేరుకొంటున్నాయి.

వేట పులుగూ, డేగా ఇక ఎవరిమీదపడాలో తెలియక (కాకులు ఒక లెక్కకాదు) పరస్పరం కారాలు, మిరియాలూ నూరుకోసాగాయి. ఇదంతా శాస్త్రం పేరనే జరుగుతుంది. వేటపులుగు రహస్యంగా ప్రార్థన పద్యాలు చదువుతోందని డేగ పోలీసులకు మాటజేరవేసింది. డేగ ఒక పాటల పుస్తకాన్ని చెట్టుతొర్రలో దాచుకొందని వేటపులుగు పోలీసుల చెవికొరికింది.

గ్రద్దకు ఏమిచేయడానికీ పాలుపోలేదు. అలాంటిస్థితిలో ఈ గందరగోళాన్నంతనీ పరిష్కరించడానికా అన్నట్లు చరిత్ర గతి మారిపోయింది. తమ సంగతి పట్టించుకొనే నాథుడు లేడని కాకులు తెలుసుకొన్నాయి. దీన్నిగురించి అణా కానీ బాలశిక్షలో ఏమని వ్రాశారు? అదేదో సరిగా జ్ఞాపకానికి రాకముందే అనుకోకుండా మాగి కాకుల మూక ఆకాశ మార్గాన్ని పట్టాయి.

గ్రద్ద వాటివెంట పడింది. కాని లాభంలేక పోయింది. దారిలో ఒక పల్లెటూరి పెద్దమనిషి గ్రద్దని పట్టుకొని బడితె బాజా వాయించాడు. దానితో రెక్కలు పులిసి ముద్దయి పోయాయి.

అప్పుడు గ్రద్దరాణీ దగ్గరకు ఎలాగో అతికష్టం మీాద చేరుకొని "ఇది గ్రద్ద లన్నింటికీ గుణపాఠం అగుగాక!" అని ఒక ఫర్మానా జారీ చేసింది.

గుణపాఠం అంటే విద్యహానికరమా? లేక విద్య రాక పోవడం హానికరమా? ఆ గ్రద్ద ఉద్దేశ్యం ఏమిటి అన్న ప్రశ్న ఉదయిస్తుంది. కాని అంతకుమించి గ్రద్ద ఇంకేమీా చెప్పలేదు.





# ఆదర్శవాది - జెల్లచేప

ఒక జెల్లకూ బొమ్మిడాయికీ వాదం వచ్చింది. నిజాయితీగా బ్రతకడం సాధ్యం అని జెల్ల అంది. లౌక్యంలేకపోతే లాభంలేదని బొమ్మిడాయి వాదించింది. లౌక్యం అంటే బొమ్మిడాయి వుద్దేశ్యం ఏమిటో తెలియదుకాని అది ఆమాట అన్నప్పుడల్లా మొహం కందగడ్డలా చేసుకొని "ఆమాటనకు నాకు ఒళ్ళుమంట" అనేది జెల్ల. "సరే చూద్దాంగా!" అనేది బొమ్మిడాయి.

జెల్ల ఒకరిజోలికీ సొంటికీపోదు. దానిది ఆదర్శవాదం. అలాంటప్పుడు బైరాగులకి అది ప్రీతికరం కావడంలో ఆశ్చర్యం ఏంవుంది? రోజంతా ఎక్కడో రాళ్ళమధ్య పడి వుంటుంది. నలుసుల్లాంటి చిరుమీలను ఏరుకు తింటుంది. అలా

గంటల తరబడివుంటే ఏవేవో వ్యూహాలు పుట్టడం సహజమే కదా. అందులోకొన్ని మరీ తెంపరి వ్యూహాలు. జెల్లల అభిప్రాయాలకు సెన్సారు గొడవలేదు. పోలీసుల బెడదా లేదు. అందుకని రాజకీయంగా ప్రమాదకరమైన భావాలు అన్న అనుమానం వాటినిగురించి ఎవరికీ కలగదు. అప్పు డప్పుడు జెల్లలమీద దాడులు జరగడం మనం చూస్తూ వుంటాం. అయితే ఆ దాడి తినడం కోసమేకాని అవి స్వేచ్ఛగా ఆలోచిస్తున్నాయనికాదు.

అసలు జెల్లలను మాంవులు (జల్లి గంపలు) వేసి కాని వలలువేసికాని పట్టాలి. కాని వాటిని పట్టాలంటే ఒడుపు చాతనవాలి. వర్షం పడిన తర్వాత నీరు అల్లకల్లోలంగా వుంటుంది. అనుభవంగల జాలర్లు చాపలు పట్టడానికి అదే మంచి అదునంటారు. వలలువేసి నీటిపైన కర్రలతోనూ తాళ్ళతోనూ కొట్టి నానా హంగామా చేస్తారు. ఆ హంగామా అంతా విని విప్లవ భావాలకు విజయం కలిగిందనే వుద్దేశ్యంతో జెల్లలు మెల్లిగా లేచి తాము కూడా పాల్గొనవచ్చునా అని అడుగుతాయి. దానితో అన్నీ కట్టకట్టుకొని మానవుల వలలో పడతాయి. జల్లల్ని వేపుడు చేసినట్లయితే పెద్దపెద్ద గవర్నర్లకు కూడా వడ్డించ తగినంత రుచిగా వుంటుంది.

ఇక బొమ్మిడాయికి ప్రతిదానిమీద అనుమానమే. పైగా అన్నీ ముళ్లు. అయితే సరైన పాకంలో వండితేమాత్రం మహారుచిగా వుంటుంది.

జెల్లకీ బొమ్మిడాయికీ తగువెలా వచ్చింది అని అడిగితే చెప్పడం కష్టమే. అవి మొట్టమొదట తారసిల్లగానే వాదన పెట్టుకొన్నాయి. ఒకసారి అయింది. రెండుసార్లు అయింది. రెండింటికీ కూడా వాదన లేకపోతే తోచేది కాదు. అందుకని ప్రత్యేకంగా వాదనకోసం స్థలకాల నిర్ణయాలు కూడా చేసుకొనేవి. ఏదో ఒక నాచుమొక్క కిందచేరి జ్ఞాన చర్చలు సాగించేవి. ఆ జ్ఞానాన్ని జీర్ణం చేసుకొనడం కోసం చందువా ఆ చుట్టుపక్కలే పొంచి తారట్లాడుతూ వుండేది.

సిద్ధాంతం ప్రతిపాదించడం ఎప్పుడూ జెల్లనంతు.

"సంఘర్షణ న్యాయంవల్లనే జీవులు అభివృద్ధి పొందుతున్నాయన్న మాటను నేను నమ్మను. అభివృద్ధి శాంతియుతంగా అహింసాత్మకంగా సాగాలి. సామరస్యం వుండాలి. సుఖం అన్నది ఏదో ఊహాఫలం కాదు. నేడో రేపో ప్రాణులన్నీ కూడా సుఖపడతాయని నా దృఢ విశ్వాసం"

"మన్ను - మశానం" అనేది బొమ్మిడాయి.

బొమ్మిడాయికి తొందర ఎక్కువ. మనసులో కక్ష పెట్టుకొనేరకం. దానిది రాతిగుండె. ఇంకా నయం ప్రాణులను అసహ్యించుకొనే దాకా వెళ్ళలేదు. కాని నమ్మకాలన్నీ నశించి చాలా కాలమైంది. ప్రతిచోటా దానికి శాంతికి మారు సంక్షోభం, అభ్యుదయానికి మారు ముష్కరత్వం కనిపిస్తుంది. బ్రతకతలుచుకొన్న ప్రతివారు నిజాన్ని సూటిగా చూడాలంటుంది. జెల్లకి ఆలోచన లధికం అంటుంది. కాని ఈ ప్రపంచంలో ఎవరైనా నమ్మదగ్గవారున్నారా అంటే అది జెల్ల ఒక్కటేనని ఒప్పుకొంటుంది

బొమ్మిడాయి అన్నమాట జెల్లను వాదాని కీడ్చింది.

"ఏ మన్నావు? మన్నూ - మశానమా? మనమంతా క్రమంగా సుఖపడతాం. మనమిప్పుడు చీకటిలో యీదు లాడుతున్నాం. ఈ చీకటి అంతా అదృష్ట భావన దుష్ఫలితం. ఆధునిక విజ్ఞానశాస్త్రం అదృష్ట భావనను అంతంచేస్తోంది. చీకటి రోజులు పోతున్నాయి. భవిష్యత్తు అంతా కాంతి మయం. వెలుగు వస్తుంది. నా మాట విను! వెలుగు వస్తుంది!!"

"నీ వుద్దేశ్యం ఏమిటి? వాలగల నేవిలేని రోజొకటి వస్తుందంటావా?"

"వాలగలంటే?" అని అడిగింది జెల్ల మొహం చిట్లించి.

"వాలగలుంటాయి, జెల్లలు కలలుకంటూ కూర్చుంటే లాభంలేదు - అని ఎవరైనా ఎప్పుడైనా అంటే అవన్నీ కాకమ్మ కథలనీ పిల్లలను దడిపించడానికి కనిపెట్టిన బూచి అనీ జెల్ల భావిస్తూ వుండేది.

"మడ్డిమొహం! వాలగంటే తెలియదుకాని ప్రపంచాన్ని మరమ్మత్తు చేస్తాడట" ఒకసారి రెక్కలు విదిలించి ఈదుకొంటూపోయేది బొమ్మిడాయి. కాని తర్వాత రెండూ మళ్ళీ ఒక నిర్జన ప్రదేశంలో కలుసుకొని తమ తర్కాన్ని కొనసాగించేవి.

జెల్ల సిద్ధాంతం ప్రతిపాదించేది.

"మంచి అన్నది జీవితానికి సహజలక్షణం. ఏవో అపోహలవల్ల దుర్బుద్ధులు పుడుతూవుంటాయి. అంతేకాని మంచే ప్రధాన జీవశక్తి.

"నీ బొంద"

"ఇదిగో బొమ్మిడాయ్! మర్యాదతప్పి మాట్లాడకు. నీబొంద ఏమిటి? అదేనా మాట్లాడవలసిన పద్ధతి?

"అసలు నీతో మాట్లాడ్డమేమిటి? నీకాయోగ్యత కూడా వుందీ? నువ్వు ఉట్టి నస్మరంతివి. అంతే!"

"ఇదిగో ఒక్కక్షణం ఆగు! నా వాదన పూర్తిగావిను. చెడుఅన్నది ఏనాడూకూడా సృజనాత్మక శక్తిగా లేదు. చరిత్ర సైతం మనకీ విషయాన్నే బోధిస్తోంది. చెడువల్ల కలహాలు క్షామాలు, అనర్థాలూ వినాశాలూ కలిగాయి. ఇక మంచి అన్నావా? ఆ మంచి ఒక్కటే జీవసదాయిని. మంచి అనేది పీడితులకు తోడ్పడింది. వారి శృంఖలాలను ఛేదించింది. ఉదాత్తాశయాలను పురికొల్పింది. ఉత్తమఆలోచనలను రేకెత్తించింది. ప్రాణశక్తి అయిన ఈ మంచే లేనినాడు చరిత్ర అనేదే వుండదు. నిజానికి చరిత్ర అంటే ఏమిటి? చెడుగుమీాద మంచి సాధించిన విజయాల వీరగాధ కాదా?"

"చెడుగు పూర్తిగా నశించిందని నమ్మినట్లు కనిపిస్తున్నావే!"

"ఇంకా పూర్తిగా నశించలేదు. కాని నశించి తీరుతుంది. అందులో సందేహం లేదు. ఈ విషయంలో కూడా మనకు చరిత్రే దాఖలా. గతాన్ని ప్రస్తుతంతో పోల్చిచూడు. చెడుగు బాహ్య స్వరూపం కొంత మెత్తపడినట్లు అనిపించ

డమేకాదు; ఆ చెడుగనేది మొత్తానికే చాలా తగ్గినట్లు కని పిస్తుంది. ఉదాహరణకు మన సంగతే తీసుకో. పూర్వం వేసం గికి ముందు మనలను పట్టుకొనేవారు. అసలు మనంతట మనమే ఎఱ్ఱి వలలో పడేవారం. కాని ఇప్పుడలా జరగడం లేదు. వేసంగికిముందు మనం వలసపోతామనీ అలా వలస పోయేటప్పుడు మనల్ని పట్టుకొనడం తగదనీ భావిస్తున్నారు. పూర్వం మనలను అతిముష్కరంగా నాశనం చేసేవారు. ఆ రోజుల్లో పెద్దనదిలో ఈ టెలువిసిరి చేపలు పట్టినప్పుడు మైళ్ళ పర్యంతం నీరు ఎర్రపడేదని చెప్పగా విన్నాను. ఇప్పుడ లాంటి దెక్కడైనా చుశావా ? లేదు. వలలు, జల్లి గంపలు గాలం చువ్వలు ఇవే ఇప్పటి సాధనాలు. ఇంతెందుకు ఎలాంటి వలలుకావాలి ? ఏ రోజుల్లో వలలు వేయాలి ? ఎందుకోసం వేయాలి? అన్న విషయాలను ఇప్పుడు కమిటీల్లో కూడా చర్చిస్తున్నారు."

"నువ్వు కూరకుండలో పడే పద్ధతిని తెలుచుకొని మురిసిపోతున్నట్లున్నావు."

"ఏమిటీ ?"

"అయ్యోరాత ! కూరకుండ సంగతి పేరుకూడా విన లేదే జెల్లా! పైగా నాతో వాదిస్తున్నావా ? నువ్వు నాతో వాదించాలంటే కనీసం యీ విషయాన్ని తెలుసుకొని వుండాలి. ప్రతీ జెల్లకోసం ఒక కూరకుండ యెదురుచూస్తూ వుంటుందన్న సత్యంకూడా తెలియని నీకు యీ వాదా లెందుకు ? తగ్గు తగ్గు. లేదా తడాఖా చూపిస్తా"

అలా అని బొమ్మిడాయి కోపంతో జేవురించేసరికి జెల్ల ఏటి అడుగుకేమూలకో వురక పెడుతుంది. కాని మర్నాడు ఆ రెండూ ఎక్కడో ఒకచోట కలుసుకొని చర్చలు ప్రారంభిస్తాయి.

"నిన్న వాలగ మన కలుగుసైపు చూసింది" అని బొమ్మిడాయి జెల్లతో చెప్పింది.

"మొన్న నీవు చెప్పావు అదేనా ?"

"అదేనయ్యా ! అదే. అలా ఈదుకొంటూవచ్చి ఇటూ అటూ చూసింది. 'ఇక్కడ ప్రశాంతంగావున్నట్లుందే! జెల్లలు కొల్లలుగా వుండవచ్చునన్నమాట.' అని గొణుక్కుంది.

"అయితే నీ సలహా యేమిటి ?"

"సిద్ధంగావుండు. అంతే. అది నీ దగ్గరకొచ్చి నోరు తెరిచేవరకూ కాచుకొనివుండు. తర్వాత రెక్కలు ముడుచు కొని నోటిలోంచి గొంతులోకి దూకు !"

"ఎందుకు దూకాలి ? నేను చేసిన నేరమేమిటి ?"

"నీకు బుర్ర లేదు. వచ్చిన చిక్కల్లా అదే. మెదడులో కొవ్వు చాలాపెరిగింది. కొవ్వుబలిసినవారు వాలగ గొంతులో దూకాలని శాస్త్రాలు చెపుతున్నాయి కాదూ ?"

"అలాంటి శాస్త్రమెక్కడా లేదు" అని కోపంతో అరిచింది జెల్ల.

"నన్ను అలా మింగే హక్కు వాలగకు లేదు. అది ముందు నాకు తగిన సమాధానం ఇవ్వాలి. అది కనిపించనీ ఏం చేస్తానో చూద్దువుగాని, ఉన్నదున్నట్లు నిజం చెప్పేస్తాను. నిజం అంటే అచ్ఛమైన నిజమన్న మాట."

"నీవొక గాడిదవని ఇంతకు ముందే చెప్పాను. ఇప్పుడు మళ్లీ చెపుతున్నాను. నీవు గాడిదవి. అప్పటికీ ఇప్పటికీ కూడా అడ్డగాడిదవే."

చర్చ ఈదశకు చేరేసరికి బొమ్మిడాయికి కోపం మిన్ను ముట్టింది. ఇకమీద నీతో మాట్లాడితే ఒట్టు అని జెల్లతో చెప్పింది. కాని కొన్నిరోజులు పోయేసరికి అలవాటు ప్రకారం రాక మానదు.

"అసలు మన చాపలన్నీ ఒకకట్టడి చేసుకొంటే..." అని ముందు జెల్ల యథాప్రకారం చర్చను మొదలు పెట్టింది.

దీనితో బొమ్మిడాయికి దిమ్మ రేగింది.

"హే భగవాన్ ఏమిటీ బుర్ర లేని వాదన. అదేం మాట్లాడుతుందో దానికే తెలిసిచావదు. పక్కనే వుంది దొంద. దాని చెవినపడితే? ఏమో కానికాలం." అనుకొంది బొమ్మిడాయి మనసులో. జెల్లకు నచ్చజెప్పాలనే వుద్దేశ్యంతో అనునయిస్తూ అంది :

"అనవసరంగా నోరు పారేసుకోకు. మాట్లాడేది జాగ్రత్తగా ఆలోచించి మరీ మాట్లాడు. అదీకాక అంత పెద్ద గొంతుకతో ఎందుకు అరుస్తావు? చెప్పతలుచుకొన్నది చెవి దగ్గర చెప్పు చాలును"

"ఈ గుస గుసలు నాకు నచ్చవు. ఢంకామీద దెబ్బ కొట్టినట్లు గట్టిగా చెప్పవలసిందే. మన చేపలన్నీ ఒక కట్టడి చేసుకొంటే..."

బొమ్మిడాయి ఇంక సహించలేకపోయింది. "నీతో వాదిస్తూ కూర్చుంటే కడుపునిండేనా కాలునిండేనా?" అని

అక్కడినుంచి దారిపట్టింది. బొమ్మిడాయికి ఎంత కోపము వచ్చినా జెల్ల మీద జాలికూడా లేకపోలేదు. జెల్ల ఎంత మూర్ఖంగావున్నా అంతకన్నా నమ్మిదగ్గ చేప మరొకటిలేదు నిన్ను చూసి విసుక్కోదు. విడిచిపెట్టదు. ఈ రోజుల్లో ఇలాంటి సద్గుణాలు ఎవరికున్నాయి ? రోజులా బాగులేవు. తల్లీ తండ్రిని కూడా నమ్మడానికివీల్లేదు. దొందేవుంది. దానిలో చెప్పుకోతగ్గ దోషం ఏమీలేదు. కాని దానితో మాట్లాడేటప్పుడుమాత్రం మహా జాగ్రత్తగా వుండాలి. తెలియకుండానే గోతిలో పడతాం. చిల్లరమల్లర చేపలసంగతి చెప్పనే అక్కరలేదు. వాటికొక పురుగును పారేస్తేచాలును ప్రమాణం చేసి మరీ చెప్తాయి నామీద చాడీలు. ఇలాంటి మూకమధ్యపడితే పాపం జెల్లకింకేమైనావుందా ?

"అసలు నిన్ను నీకొకసారి చూసుకో జెల్లా" అంది ఒక రోజున బొమ్మిడాయి.

"అవసరమైతే నీ ఆత్మరక్షణ కేంచేస్తావు ? నీకు బుర్ర పెద్దది బుర్ర చిన్నది. ఇక నీ నోరు. దానిసంగతి చెప్పనే అక్కర్లేదు. పోనీ పొలుసులు చూద్దామా ? వాటిని చూస్తేనే నవ్వు వస్తుంది. వేగంగా పోలేవు. పైగా కంగారు. దేని పంటి కిందనైనా నీవుపడ్డాని కెంతసేపు ?"

"అసలు నేనొకరి పంటికింద ఎందుకు పడాలి ? నేనేమీ తప్పుచేయలేదే ? ఎవరికీ అపకారం తలపెట్టలేదే ?" అని ఎప్పటిలాగే ఎదురుప్రశ్న వేసింది జెల్ల.

"ఓయి తెలివితక్కువ దద్దమ్మా విను ! తప్పు చేసి నందు కెవరినైనా మింగారా ? మనల్ని ఎవరో తినాలను

కొంటారు కనుక మనం హతమారుతూవుంటాం. తెలిసిందా? తిండి నాకూ అవసరమే. కాదంటావా? నీవు బురదలో మూతెందుకు దూరుస్తావు? చిరుమీను దొరుకుతుందేమో ననేకదా? అవికూడా నీలాగే బ్రతకాలనుకొంటాయి. కాని నీ వొకడివి తయారై ముప్పొద్దులా పొట్ట నింపుకొంటూ వుంటావు. వాటినలా ప్రతిక్షణం నీవు శిక్షించడానికి అవి చేసిన నేరమేమిటి? చెప్పు. చేపలన్నీ ఒక కట్టడి చేసుకొంటే అని మొన్న నీవు చెప్పావే నీతి? అదెందుకు జ్ఞాపకంరాదు నీకు? సరే. చిరుమీలన్నీ కలిసి నీపై కుట్రపన్నితే ఏమవుతుంది? సంతోషిస్తావా? ఇంతకీ నీకు బుర్ర శూన్యం?"

ఇలా మొహాన పట్టుకొని దులిపేసరికి చచ్చినంత పనైంది జెల్లకు. గొంతు పూడిపోయింది. మాట పెకల్లేదు.

"చిరుమీలు...కాని అవి..."మాటలు తడబడ్డాయి జెల్లకు.

"చీరుమీలు చిరుమీలే. జెల్లలు జెల్లలే. చిరుమీలను జెల్లలు తింటాయి. జెల్లలను వాలగలు మింగుతాయి. అందులో చిరుమీలు చేసిన పాపమూ లేదు. జెల్లలు చేసిన నేరమూ లేదు. అయినా అవి రెండూ అనుభవించక తప్పదు. కావాలంటే యుగాలు యుగాలు ఆలోచించు. నీకు వేరే దారి కనిపించదు."

దీనితో జెల్ల చాలా దీర్ఘాలోచనలో మునిగిపోయింది. ఆలోచించింది. ఆలోచించింది. అంతసేపూ చీరుమీలను నములుతూనేవుంది. నమిలినకొలదీ ఇంకా నమలాలనే అనిపిస్తోంది. కొసకు ఏలాగైతేనేం ఒక ఆలోచన తట్టింది.

"కాదోయ్ బొమ్మిడాయ్. చిరుమీలు ఏదో నేరం చేశా యని నేను వాటిని తినడంలేదు. నీవు చెప్పింది నిజమే, చిరు మీలు నాకు ప్రకృతిసిద్ధమైన ఆహారం. అందుకని వాటిని తింటున్నాను."

" ఈ సిద్ధాంతాన్నెక్కడినుంచి తీసుకొచ్చావు ?"

"నాకే తోచింది. చిరుమీలకు ఆత్మలు లేవు. వాటిని తిన్నాననుకో. ఆ విషయాన్నవి తెలుసుకోనేలేవు. అదీకాక వాటి ఆకారవికారాలు చూస్తే తినకుండా ఎలా ఉండగలం? నోటినిండా నీరుపీల్చి, పుక్కిటినిండా చిరు మీలు వస్తాయి. వాటిని కావాలని నేను మింగడంలేదు వాటంతట అవేవచ్చి నా నోట్లో పడుతున్నాయి. మరి జెల్ల లన్నావా? అది వేరే విషయం. మూరెడు పొడవు జెల్లలు కూడావున్నాయి. అలాంటి వాటిని తినడం మాటలుకాదు. అది నిజంగా ఏదైనా నేరంచేస్తేనే అప్పుడు..."

"సరే ఒక వాలగ నిన్ను కబళించే వరకూ అలాగే వుండు. అప్పుడు తెలుస్తుంది. అంతవరకు నోరు మూసుకొని కూర్చో."

"నేను నోరు మూసుకోను. నేను వాలగను స్వయంగా చూడలేదు. కాని నీవు చెప్పినదాన్నిబట్టి అది సత్యాన్ని వినలేని చెవిటిదేమీకాదని తెలుసుకొన్నాను. అభం శుభం ఎరగని జెల్ల బురదలో పడివుంటే నిష్కారణంగా ఒక వాలుగ వచ్చి దాన్ని కబళించడం మహాఘోరం. అసలింత దుర న్యాయం వుంటుందా? నేను నమ్మను."

నువ్వొక అడ్డగాడిదవి. పొద్దున్నే ఆ జాలరి ఒక వల వేసి మనవాళ్లనందర్నీ పట్టుకొన్నాడు చూడలేదూ? వాటి నన్నింటినీ కూరోచ్చెపెట్టి కుశల ప్రశ్నలు వేయడానికి గట్టున చేర్చాడంటావా?

"ఏమో నాకేమీ తెలియదు. ఇంతకీ వాటిని తిన డానికే పట్టాడో ఒక కోనేరులో పెంచడానికే పట్టాడో ఏం చెప్పగలం? ఇక్కడకన్నా అక్కడ అవిహాయిగా వున్నా యేమో?"

"అయితే నీవుకూడా అక్కడికేపోరాదూ?"

రోజులకు రోజులు గడిచినా ఈ వాదనలకు చర్చలకు అంతుకనిపించడంలేదు. అవి వుంటున్నది చాలా ప్రశాంతమైన ప్రదేశం. నలువైపులా పచ్చని నాచు అలముకొనివుంది. చర్చలు జరపడానికి ఇంతకన్న చక్కని స్థలం ప్రపంచంలో మరెక్కడుంటుంది. ఎంత చర్చలు సాగించినా ఏంచేసినా భయమనేదిలేదు. దీనితో జెల్ల వాదాలు సాగుతున్నకొలదీ దాని గొంతుకూడా ఉచ్ఛస్థాయి నందుకొంటోంది. ఒక రోజున —

"చేపని చేప ప్రేమించాలి. ఒక చేప కాపదవస్తే అన్నీ కలసి ఆదుకోవాలి. ప్రతి ఒకటీ అందరి క్షేమం కోసమూ పాటుపడాలి. అసలు సామరస్యం అప్పుడు వస్తుంది."

"ఈ ప్రేమ సిద్ధాంతాన్ని వాలగకు బోధించు" అంది బొమ్మిడాయి ఎత్తిపొడుపుగా.

"అదికూడా చేస్తాను. చూస్తూవుండు. ఒకటి రెండు మాటలు వినేసరికి ఎలాంటి వాలగయినా జెల్లగా మారి పోతుంది"

"అంతకన్నా కావలసినదేముంది. అలాగేకానీ"

"మంచి అనేదివుందా? వుంటే మన చేపజాతిపట్ల ఎలాప్రవర్తించాలో తెలుసునా? అని వాలగను అడిగేస్తాను."

"ఓహో అది నిజంగా సమ్మోహనాస్త్రంలా పనిచేస్తుం దనుకో! నీ పొట్టచీల్చి ఈ పసిడి పలుకుల్ని ఏరుకోవాలని పిస్తోంది!"

"వేళాకోళాలు చాలిద్దూ"

మరొక రోజున జెల్ల చర్చకు ఉపక్రమిస్తుంది.

"అసలు చేపలన్నిటికీ చిన్నతనంనుంచీ పౌర ధర్మాల విషయంలో తరిఫీదిస్తే మన హక్కులేమిటో మనకు సదా జ్ఞాపకం వుంటాయి."

"పౌరధర్మంవల్ల ఏమి సాధిద్దామనుకొంటున్నావు?"

"సరే – ఏమైనప్పటికీ..."

"ఏమైనప్పటికీ కట్టిపెట్టు. పౌర మర్యాదను అమలు జరపగలిగినప్పుడు బాగానే వుంటుంది. కాని నీవీ బురదలో పౌరస్వాతంత్ర్యాల నెలా అమలుపరుద్దామనుకుంటున్నావు?"

"అది బురదలోనే వుండాలనడం లేదు. సర్వత్రా వుండాలంటున్నాను."

"ఉదాహరణకు?"

"ఒక జాలరి నన్ను కూర కుండలో వేశాడనుకో! అప్పుడు విచారణ లేనిదే ఇంతదారుణమైన శిక్షనాకు విధించే హక్కు నీకు లేదని అంటాను."

"అలా అన్నందుకు కుండలోంచి తీసి నిన్ను తిన్నగా కుంపటిలోనే పడేస్తాడు. ఈ బురదలో పౌరస్వాతంత్ర్యాలు –

అంటే తెలివితక్కువ ఆలోచనలు - పనికిరావోయ్. నోరు మూసుకొని బురదలో దూరి ఒళ్లు దాచుకో. తెలిసిందా బుజ్జినాన్నా ?"

"ఇదుగో, అసలు చేపలు తమ జాతిని తినకూడదు. ప్రకృతి మనకోసం కమ్మని పదార్థాల నెన్నిటినో సృష్టించింది. చిరుమీలు, ఈగలు, దోమలు, లూతలు, పీతలు, పాములు, కప్పలు, ఇవన్నీ కమ్మగానూ వుంటాయి. పుష్టినీ ఇస్తాయి. ఏమంటావు ?" అని అడిగింది ఒక రోజున జెల్ల.

"జెల్లలు - వాలగ నోటికి చాల కమ్మగా వుంటాయి కాదూ ?"

"జెల్లలను వాటిలో చేర్చడాని వీల్లేదు. జెల్లకు ఆత్మ రక్షణకు కావలసిన ఏర్పాటు ఏదీ ప్రకృతి చేయలేదు. అందుకని వాటి రక్షణకోసం ఒక ప్రత్యేక చట్టాన్ని చేయడం అవసరం."

"ఆ చట్టాన్ని ఎవరూ ఖాతరు చేయరనుకో ! అప్పుడు?"

"అప్పుడు శాసన ధిక్కారం చేసినవారిని తగు రీతిగా మందలిస్తూ - అంటే శాసన ధిక్కారంకన్న శాసన రాహిత్యమే మేలు - లాంటి ఒక ప్రకటన చేయాలి."

"అది సరిపోతుందనుకొంటున్నావా ?"

"ఆ. అది చూసి చాలామంది సిగ్గుతో తలవంచు కొంటారు."

ఇలాగ జెల్ల రేయింబవళ్లు వాదన పెట్టుకొంటోంది. మరొకరు మరొకరు అయివుంటే ఈనాటికి బాగా దేహశుద్ధి జరిగేదే. కాని జెల్ల కలాంటిదేమీ జరగలేదు. జెల్ల

కొంచెం మెలకువ చూపివుంటే ఈ నాలిక కల్పాంతం వరకూ అలాగే ఆడుతూవుండేదేమో. కాని ఆలోచనా ప్రవాహంలో బుర్ర కొట్టుకొనిపోయింది. పాపం. వాలగ దొరసానిగారు ఈ ప్రాంతాలను సందర్శించడానికి వస్తున్నారని ఒకనాడు దొంద (శ్రీ) ముఖాన్ని కొనివచ్చింది. "రేపు ఉదయం ఆరు గంటలకు స్వాగతానికి సిద్ధంగావుండు!" అని జెల్లను హెచ్చరించి పోయింది.

అయితే జెల్ల గాభరాపడలేదు. వాలగను గురించి చాల కథలు వింది. అందుకని ఇప్పుడు పరిచయభాగ్యం లభించనున్నదికదా అని సంతోషించింది. అదీకాక మంత్రాల లాంటి తన మాటలు వింటే మహామహా వాలుగలుకూడా జెల్లలైపోవాలి అనుకొంది.

జెల్ల నమ్మకాన్ని చూసి బొమ్మిడాయికి ఆశ్చర్యం వేసింది. ఇంతకాలంనుంచీ తాను ఎతి అంటే ప్రతి అని మరీ మూర్ఖత్వం చూపించానేమో అనుకొంది. వాలగ నిజంగా ప్రేమకోసం తపిస్తోందేమో ? మంచి మాటలు విని తరించాలని ఆలోచిస్తున్నదేమో ఎవరికి తెలుసును ? అసలు వాలగ నిజంగా దయాళువేమో ? జెల్ల పైకి కనిపించేటంత అమాయకుడు కాకపోవచ్చును. పూర్వాపరాలు జాగ్రత్తగా బేరీజు వేయగల రాజనీతి దురంధురుడు కావచ్చును. జెల్ల తాను కనిపెట్టిన సత్యాల్లో ఒకటి వాలగకు చెప్పి, దాన్ని నిర్ణిణ్ణాను చేయవచ్చును. ఎవరికి తెలుసును ? అది విని 'జెల్లా' నీవు నిజం చెప్పినందుకు ఈ జలరాశికంతా నిన్ను అధిపతిని చేస్తున్నాను, అని వాలగ అంటుందేమో ?

మర్నాడు ఉదయం అన్నమాట ప్రకారం వాలగ ఈదుకొంటూ వచ్చింది. దానివైపు చూసింది జెల్ల. "వాలగను గురించి అనవసరంగా ఉన్నవీ లేనివీ చెప్పారు. ఇదికూడా అందరిలాగానే వున్న సాధారణమైన చేప. కాగా నోరు మాత్రం మహాపెద్దది. గొంతులోంచి జెల్లలు సులభంగా దూరిపోతాయి" అనుకొంది మనసులో జెల్ల.

"నీవు చాలా తెలివైనదానివనీ, మంచి వక్తవనీ మాకు వినవచ్చింది. నీతో చర్చ జరపాలని వుంది. కానియ్యి" అంది వాలగ.

జెల్ల వినయగాంభీర్యాలతో ప్రారంభించింది వాదం.

"నే నెప్పుడూ సుఖాన్ని గురించే ఆలోచిస్తూ ఉంటాను. సుఖం నా కొక్కనికే కాదు, అందరికీ వుండాలి. చేపలన్నీ తమ కిష్టం వచ్చిన నీటిలో స్వేచ్ఛగా ఈదగలగాలి. బురద కావాలనుకొన్నవారు మనసారా బురదలో మునగడానికి స్వేచ్ఛ వుండాలి."

"ఇలాంటిది సాధ్యమనే అనుకొంటున్నావా ?"

"ఆహా ! అంతేకాదు, ఏ క్షణంలోనైనా ఇలాంటి వ్యవస్థ రావచ్చునని ఎదురు చూస్తున్నాను."

"సరే – నేనే ఒక జెల్ల పక్కన ఈదుతున్నాననుకో ! అప్పు డెలా వుంటుంది, ఆలోచించు !"

"ఎలా వుంటుం దేమిటి చాలా బాగా వుంటుంది."

"ఇలాంటి వాదన వినడం ఇదే ప్రథమం. సరే. నేను పక్కకు తిరిగి దాన్ని కబళించాననుకో, అప్పుడు ?"

"దేవరవారు మన్నించాలి. అలాంటి దెక్కడా చట్టంలో లేదు. చీమమీలు, ఈగలు, పురుగులు శరీర పోషణకు విని యోగపడాలి అని చట్టంలో స్పష్టంగా వుంది. ఆ తర్వాత సవరణలుచేసి దానికి బాతులు, పీతలు, మిడతలు, కప్పలు తదితర జలచరాలను చేర్చారు. అంతేకాని చేపలను చేర్చ లేదు."

"నాకు నచ్చలేదు. ఏమోయ్ దొందా అసలలాంటి చట్టం వుందా ?

"దానికి కాలదోషం పట్టింది దేవరా !" అని దొంద ఆరిందా అధికారిలాగా జవాబిచ్చింది.

"మేమూ అలాగే అనుకొన్నాం. అసలలాంటి చట్టం ఉండడానికి వీల్లేదు. సరే జల్లా ! ఏక్షణాన్నయినా ఇంకేం జరుగుతుందని ఆశిస్తున్నావు ?"

"న్యాయం జయించాలని నా అభిమతం. బలవంతులు బలహీనులను, ధనవంతులు దరిద్రులను బాధించకూడదు. ప్రతి చేపకూ సముచితస్థానం గల సమాజాన్ని నిర్మించాలి. ఆ సమాజంలో ప్రతిచేపా తన సముచిత పాత్రను నిర్వ హిస్తుంది. బలమూ, తెలివీ గల మీ వాలగల కందులో ముఖ్యమైన స్థానం వుంటుంది. నాలాంటి జెల్లలు ఏవో చిన్న చిన్న పనులు శక్తికొలదీ చేయగలుగుతాయి. ప్రతివారూ

సమాజం శ్రేయస్సుకూ, సమాజం ప్రతివారి శ్రేయస్సుకూ పాటుపడాలి. మనం ఒకరి కొకరం బాసటగా వుంటే మన కెవరూ ఎర వేయజాలరు. ఎవరికి తోచినరీతిని వారు రాళ్ళ కింద, నాచుకింద, బొరియల్లో, బురదలో తలదాచుకొంటే వలలు మనల నేమీ చేయలేవు. చాపల పులుసు సంగతి వారింక మరిచిపోవలసివుంటుంది."

"నా కంతనమ్మకం లేదు. రుచిగల వాటిని జనం మరిచి పోలేరు. సరే అలాంటిది జరుగుతుందనే అనుకొందాం. కాని అ దెప్పుడు జరుగుతుందో ఎవరికీ తెలియదు. సరే ఒక ప్రశ్న అడుగుతున్నాం. నీ వాదాన్ని బట్టి చూస్తే మేంకూడా పనిచేసి తీరాలని చెపుతున్నట్లు అనిపిస్తోంది. నిజమేనా?"

"ఆహా. అందరూ చేసినట్లే మీరూను."

"ఈ మాట వినడం ఇదే మొదలు. అబ్బీ పోయి కాస్త నిద్రపో!"

జెల్ల నిద్రపోయిందో లేదో ఎవరికీ తెలియదు.

ఏమైనా ఆ తర్వాత వాలగను కలుసుకొన్నప్పుడు మాత్రం జెల్ల తెలివి తెల్లవారింది. మధ్యాహ్నం వాలగతో వాదన చేయడానికి జెల్ల వచ్చింది. నిర్భయంగా రావడమే కాదు, మహా సంతోషంగా కూడా వచ్చింది.

"మేం పనిచేయాలి. ఫలితాన్ని నీవు అనుభవించాలి, కానా?" అని అడిగింది వాలగ!

"మనం ఉమ్మడిగా పనిచేస్తాం. ఇతరుల శ్రమ ఫల సాయాన్ని ప్రతివారూ అనుభవిస్తారు."

"అదా సంగతి... తెలిసింది. ఇతరుల శ్రమ ఫలితాన్ని ప్రతివారూ అనుభవిస్తారు. అంటే నా శ్రమ ఫలితాన్ని కూడా అన్నమాట. నీ ప్రసంగాలు ప్రమాద రహితాలు కాకపోలేదని ఇప్పుడు నాకు తోస్తోంది. దొంగా ఇలాంటి ప్రసంగాల నీ రోజుల్లో ఏమని పిలుస్తారు?"

"శేషలిజం! దేవరా"

"మాకు తెలుసును. ఈ జెల్ల విద్రోహాన్ని రెచ్చగొడు తున్నదని చాలా కాలంనుంచీ వింటున్నాం. జెల్ల చెప్పేమాట లను స్వయంగా విందామని బుద్ధి పుట్టింది. నీ వ్యవహారం ఇదన్నమాట!"

అలా అని వాలగ తోక కొరడాలాగ జళిపించింది. దాని అర్థమేమిటో జెల్లకు తెలిసిపోయింది.

"తమకు ద్రోహం తలపెట్టలేదు దేవరా. నేను వినయం గానే మనవి చేస్తున్నాను దేవరా" అని ప్రాధేయపడింది.

"వినయం ధూర్తలక్షణమన్నారు. బుద్ధిహీనుల్ని స్వేచ్ఛగా విడిచిపెడితే నానారభసా చేస్తారు. నీ సంగతి చాలా విన్నాం. కాని నీవు సామాన్య జెల్లవేననీ, నీలో ప్రత్యేకత ఏమీ లేదనీ ఇప్పుడు తెలుసుకొన్నాం. నీతో మాట్లాడ్డం మొదలుపెట్టి అయిదు నిమిషాలు కాలేదు. తలనొప్పి పట్టు కొంది."

వాలగ క్రీగంట జెల్లను చూస్తూ అలా కొంతసేపు కూర్చుంది. దానితో జెల్లకు అంతా అర్థమైపోయింది. అంతకు ముందు కడుపునిండా ఆరగించిందేమో ఆవులింతలు వచ్చి గుర్రుపెట్ట సాగింది వాలగ.

వాలగ గురక ప్రారంభించగానే దొందలు జెల్లను చుట్టుముట్టి నిర్బంధంలో వుంచాయి.

ప్రొద్దు క్రుంకగానే మరొకసారి వాదనకోసం జెల్లను వాలగముందు హాజరుపెట్టాయి. ఈసారి మాత్రం జెల్లను కుళ్ళపొడిచి చుట్టూ కావలి నిలిచాయి దొందలు. దరియాప్తు సమయంలో ఒక దొంద జెల్ల తోకను సగం కొరికింది. మరొకటి వీపుమీదనుంచి ఒక కండ ఊడబెరికింది.

జెల్ల జంకలేదు. తన మాటల మహాత్తుమీద ఇంకా దానికి నమ్మకంవుంది.

"నీవు మాకు శత్రువువైనప్పటికీ వాదన లేనిదే మాకు తోచదు. అందుకని ఏదీ మొదలు పెట్టు" అంది వాలగ.

దీనితో జెల్ల హృదయంలో అగ్ని రాజుకొంది. సగం తెగిన తోక నాడిస్తూ వాలగ కళ్ళల్లోకి సూటిగా చూసింది. ఉన్నశక్తినంతనీ కూడదీసుకొని "మంచితనం అంటే ఏమిటో తెలుసునా?" అని ప్రశ్నించింది.

వాలగ తెల్లపోయి నోరు తెరచింది. తనకు తెలియకుండానే గొంతులోకి నీరు లాక్కొంది. ఆ నీటితో జెల్ల కూడా వాలగ గర్భకుహరంలో పడిపోయింది.

ఈ దృశ్యాన్ని చూసిన చేపలు నిర్ఘాంతపోయాయి. వెంటనే తేరుకొని వాలగవద్దకు చేరాయి. దేవరవారికి అది గొంతు కడ్డుపడలేదు కదా అని కుశలప్రశ్నలు వేశాయి. ఇలాంటిది జరుగుతుందని ఏనాడో ఊహించగలిగిన బొమ్మిడాయి ముందుకు ఈది ఇలా ప్రకటించింది:

"మన తగువులు ఇలాగే ముగుస్తాయి!"





# బ్రతికిచెడ్డ పైడిపిట్ట

పికిలిపిట్టను పైడిపిట్టకిచ్చి పెళ్లిచేశారు. పెళ్లి మహా వైభవంగా జరిగింది. "ఆటపాటలు" అనేదుకాణంలో ఒక చిన్న కొయ్య దేవాలయాన్ని కొన్నారు. ఆ గుళ్లోనే పెళ్లి జరిగింది. కత్తెరపిట్ట పౌరోహిత్యం చేసింది. బెగ్గురు పిట్టలు మేజువాణీ కట్టాయి. చూడవచ్చినవారి సందర్శ సర్దడం కోసం పోలీసు సూపర్నెంటు ఒక వేట పులుగు పటాలాన్ని పంపించాడు.

ఆ దంపతులను చూడ్డానికి అడివిలోని పిట్టలన్నీ వచ్చాయి. కొంతమంది గొప్పగొప్ప అతిథులు కూడా విచ్చేశారు. ఏంట్రెంత పైడిపిట్టకు తోడుపెళ్లి కొడుకు అయింది. బుల్బులి పికిలిపిట్టకు తోడిపెళ్లికూతురుగా వచ్చింది.

పెళ్లికొడుకు తరఫున పెద్దగా వుంటానని రాబందు కబురు పెట్టింది. అందుకు ఒప్పుకోజాలమని సవినయంగానే తిరిగి కబురు పెట్టారు. పెళ్లిపెద్దగా చెవిటి కొంగను తీసుకొని వచ్చారు. దానికి చెవుడుకు తోడు మతిమరుపు కూడా ఎక్కువ. అందుకని రాజాస్థానంలో సలహాదారు పదవి దానికి లభించింది.

పెళ్ళికి వచ్చిన పెద్దలు, దంపతులు, కన్యాదాతలు అంతా పెళ్ళి వైభవానికి ఆనందించారు. పైడిపిట్ట రానున్న మధురక్షణాలను ఊహించుకొంటూ గర్వంతో నెమిలిపిట్టలా మురిసిపోయింది. పికిలిపిట్ట వయ్యారంగా ముక్కుతో రెక్కలను గీరి కులుకులు చూపింది. "అమ్మయ్య ఇప్పటికి పెద్ద పిల్లనొక ఇంటిదాన్ని చేసి గట్టెక్కాం" అని పిల్ల తలిదండ్రులు బరువు దించుకొన్నట్లు సంతోషించారు. విందులో తాము ఆరగించబోయే పురుగుల పులుసునూ, పంచదార పాకం పట్టిన ఈగలనూ, రాసులుగా పోసేగింజలనూ తలుచుకొని నోళ్ళు చప్పరిస్తున్నారు అతిథులు. ఒక్క కాకి మాత్రమే శకున పక్షిలాగ అపశ్రుతి పలికింది. "ఈ దాంపత్యం నిలిచేది కాదు. నిలిచేదికాదు. నిలిచేదికాదు" అని అపశకునపు కూతలు కూసింది.

మనుషులు కాకిని శుద్ధ తెలివితక్కువ వాజమ్మకింద జమకడతారు కాని, కారణం లేనిదే కాకి కూయదని పక్షుల నమ్మకం. కాకి కూత మానగానే "ఈ శకునపక్షి మాట నిజమౌతుందేమో" అని కోకిల దీర్ఘాలు తీసింది. కాటుకపిట్ట, తేనెపిట్ట, పాలపిట్ట ఆ రాగాన్నందుకొని ఆలాపన చేశాయి.

వచ్చిన వారందరి కళ్ళు దంపతులమీదికి తిరిగాయి. వారిద్దరి పుట్టుపూర్వోత్తరాలనూ గుర్తుచేసుకొనడానికి మధన పడ్డాయి. దంపతుల పూర్వ చరిత్రను, వారి అలవాట్లను, అభిరుచులను ఒకొక్కటే నెమరు వేసుకొన్నాయి. ఇలాంటి సందర్భాలలో ఫలితం ఎప్పుడూకూడా మహారసవత్తరంగా వుంటుంది.

పైడిపిట్ట సాధు స్వభావంగలది. దానికి మూడు సుగుణాలున్నాయి. ఒకటి డాంబికంఅనేది లేదు. రెండు ఎప్పుడూ నీటుగా గోటుగా వుంటుంది. మూడు అయినింట పుట్టింది. అవసరమైతే క్రూరాళ్ళతో కుస్తీ పట్టగలననే నమ్మకం దానికుంది. అయినా వయస్సుమాత్రం మళ్లిందనే చెప్పాలి. బ్రతుకంతా పటాలం కొలువులో గడిచిపోయింది. అక్కడ అది మేజరుహోదా వరకూ వెళ్లింది. అక్కడ దాని తెలివి పదునెక్కింది. రసికతకూడా ఒంటపట్టింది. లంచా లెప్పుడూ పట్టలేదు (ఆశపోతుల రాజ్యం అంతరించిందిలెండి). అయినా కిందామీదాపడి ఆస్తి బాగానే సంపాదించింది. ఒకమా టొక వ్యవహారంలో ప్రతిఫలం పికిలిగింజల రూపంలో ముట్టింది. "నేను పికిలిపిట్టను పెళ్లాడి ఈ పికిలిగింజలతో సంతానాన్ని పోషిస్తే బాగుండదూ ?" అన్న అభిప్రాయం అప్పుడే ఏర్పడింది. చిన్నప్పుడే తల్లీ తండ్రీ పోయారు. పిత్రార్జితం ఏమీ లేదు. అందుకని దానికున్న గౌరవప్రతిష్టలన్నీ కేవలం స్వార్జితమే కాని ఇతరులవల్ల వచ్చినవి కావు. స్వయంకృషిమీదే పైకి వచ్చింది.

పెళ్లికొడుకు క్వైఫియ్యత్తు ఇది. చెడ్డగా చెప్పుకోదగిందేదీ లేదు. న్యాయశాస్త్రరీత్యా చూసినా లోపమేమీ లేదు.

చూపుల కంత స్ఫురద్రూపి కాదు. సామాన్యమైన రూపం. సామాన్యమైన వేషం. అంతే. ఏ యువతినైనా మెచ్చుకోనవలసివచ్చినప్పుడు రెక్కలల్లార్చి, కళ్ళు గిరగిర తిప్పేది. అది చూసి పిచికలు పగలబడి నవ్వేవి. పైగా ఆ మెచ్చుకోలు మాటల్లోకూడా చమత్కారం ఏమీ వుండేది కాదు. ఏదో పాత పటాలం పరిహాసాలకు మించి కొత్తేమీ వుండేదికాదు. బండివాడు బాడుగ ఎంత చెప్పినాసరే దానికి అర్ధణాతగ్గించి ఇచ్చేవాణ్ణనో లేదా నీలెక్కమిటని నడిచిపోయే వాణ్ణనో చెప్పేది. అదే దానికి తెలిసిన చమత్కార సంభాషణ.

"సరే ఇప్పుడు నాకేమీ లోటులేదు. దేవుడు నేలు చేస్తే పిల్లా పీచూ పెరిగినా పోషించ గలను"అంటూవుండేది.

ఇలాంటి మాటలు ఆడపిల్లలు గలవారి చెవులకు అమృతంలా వుంటాయి. అలాంటి అల్లుణ్ణి సంపాదించడాని కవి ఏ పనైనా చేస్తాయి. ఒకసారి యీతల్లుల మధ్యపడి ఊపిరి సలపక ఉక్కిరి బిక్కిరి అయింది పైడిపిట్ట. కూతుళ్లు మాత్రం దానికి "పటాలం బడుద్ధాయి" అని పేరుపెట్టి ఉడికిస్తూ వుండే వారు. తల్లులు కసురుతూ వుండేవారు. కాని పైడిపిట్ట ఉడుక్కునేదికాదు. పైగా ఎందుకలా కసురుతారు అని తల్లుల నడిగేది.

"మరేం పరవాలేదండీ. ఇలాంటివి నాకలవాటే. మా పటాలం ఆఫీసులో ఒక పంట్రెంత వుండేది. మహా అంద మైందిలెండి. మొదట అదికూడా నన్నుచూసి హీహీహీ

అని ఇకిలిస్తూ వుండేది. 'మనం నేస్తాలుగా వుందాం అమ్మాయ్' అనేవాణ్ణి. కాని అది 'పోవోయ్ బడ్డూ' అని కసిరికొట్టేది. నేను వెంటపడినకొలదీ అది నా కందకుండా పరుగెత్తేది. కొసకు పట్టుకొన్నాను. అప్పు డేమయిందో తెలుసునా ? నన్నెంతలా పొగిడిందను కొన్నారు !"

"ఎంత అద్భుతం" అనేవారు తల్లులు. "అయితే అబ్బాయి నీకు ప్రేమ సంతానం ఏమీ లేదుకదా ?" అని అడిగేవారు.

"నేను నికరంగా చెప్పలేనండీ ! నా కాలంలో నేను కూడా ఇంద్రియ దౌర్బల్యానికి లోనయ్యాను. ఈ విషయంలో నా అభిప్రాయం ఇది : ప్రతిదీ మితంగావుంటే తప్పులేదు. అమితత్వం మాత్రం పనికిరాదు. ఆనందం అనుభవిస్తే తప్పే ముంది ? సారాకూడా అంతే. నే నెప్పుడూ ఒళ్లు తెలియ కుండా తాగలేదు. కాని అడపాదడపా ఒకటి రెండు మోతాదులకు నా కభ్యంతరం లేదు."

ఇక చాలును అనుకొని కొద్దిరోజుల క్రిందటే కొలువు చాలించుకొంది. అవసరాలు బహుకొద్ది. దేవుని దయవల్ల వుద్యోగరీత్యా ఆర్జించిన ఆస్తి కావలసినంతవుంది. అసలు పొదుపరి. ఉన్న ఆస్తిమీాద వచ్చే సామాన్య వడ్డీతోనే కాలం హాయిగా గడుస్తుంది. ఇక చక్రవడ్డీ కిస్తే ఆ డబ్బునంతా ఏం చేయాలోకూడా తెలియదు.

"నాకు దుస్తులు ఉచితంగా వస్తాయి. దేవుని దయవల్ల భోజన భాజనాలు కూడా ఉచితంగానే దొరుకుతున్నాయి. ఎప్పుడైనా వినోదం కావాలనుకొంటే అదికూడా చవకగానే

లభిస్తుంది. ఈ ప్రపంచంలో ఈగలకూ లూతలకూ కొరత లేదు- వాటిని పట్టగల బలం వుండాలే కాని. దానికి లోటు లేదు. బలం ఉడిగిననాడు కన్నుమూస్తాను. మూస్తేనేం? అన్ని పిట్టలూ ఆఖరికం తేకదా ?" అని అంటూవుంటుంది.

పటాలంలో పనిచేస్తున్నంతకాలమూ సంసారసౌఖ్యాల మీదికి మనసుపోయేది. పందిరి పట్టిమంచమూ, పడక దుస్తులూ జ్ఞాపకం వచ్చేవి. ఇవి జ్ఞాపకం వచ్చినకొలదీ ఒక ఇంటివాడు కావాలని మనసు పీకుతూవుండేది. అందుకని ఒక పికిలిపిట్టను వరించింది. దుస్తులు వేసుకొని కాబోయే అత్త మామలతో సంబంధం మాట్లాడుకోవడానికి బయలుదేరింది.

జీవితంలో తొలిసారిగా గర్వం మనసులో పొంగులు వారింది మొదటిసారిగా గొంతులో ఒక కూనిరాగంకూడా గులగులలాడింది. కానున్న వధువు పికిలిపిట్ట మనస్సంతా నిండిపోయింది. ఇంతకీ ఆ పిట్ట ఎలాంటిది? కట్నమెంత ఇస్తారు? అన్న విషయాలనుకూడా అడగడం మరిచిపోయింది పైడిపిట్ట. ఇది దాని స్వభావానికి విరుద్ధమే అయినా ప్రేమ సముద్రంలో తలమునకలై స్వభావాన్నే విస్మరించింది.

పెళ్లికూతురు గొప్పవారిళ్ళల్లో తిరగనేర్చిన నెరజాణ. హొయలు, వయ్యారాలు చూపడం సరదా. వేషభూషల మీద మక్కువ ఎక్కువ. సంగీతం వచ్చును. హార్మణీ వాయి స్తుంది. పాడేటప్పుడు చుట్టుపక్కల యువకులు తారట్లాడక పోతే నిరుత్సాహంతో నీరై పోతుంది. మనసులో కరుణవుంది. కాని దాన్ని చూపించడానికి తగిన తీరికా లేదు, అవకాశమూ కగలేదు. సరికొత్తగా దిగిన బట్టల నెవరో ఒకరు తెస్తూ

వుంటారు. లేదా తన అన్న చదువుతూన్న పటాలం స్కూలు కుర్రాళ్ళు కాలక్షేపానికి వస్తూవుంటారు. ఇలా తీరికలేని పనుల్లో మునిగి వుండడంవల్ల పికిలిపిట్టకు తనలో కరుణవుందన్న విషయం తెలుసుకోనడానికైనా అవకాశం లేకపోయింది.

"నీ సుందర పాదార విందాలను చుంబించే వరం ప్రసాదిస్తావా బాలా" అని ఒక పటాలం విద్యార్థి అంటాడు.

"అబ్బో నువ్వా నీ...సరే అలాగే కానీ."

అలాగే జరుగుతుంది.

పికిలిపిట్ట తలిదండ్రులు ఘరానా కుటుంబంవారు. తమ బిడ్డకూడా ఘరానా సమాజంలో తిరగాలని వారి అభిమతం. దాని తండ్రి పికిలి రాష్ట్రంలో పదిహేనేళ్ల పాటు ఖిల్లేదారుగా పనిచేశాడు. నాలుగు ఆస్తులు కలిసిరాగా ఆ నాలుగింటినీ కూడా ఆర్పేశాడు. ఒక ఏడాదికిందటే ఆఖరి విక్రయ దస్తావేజు మీద సంతకం పెట్టాడు. ఇప్పుడు చిల్లర మల్లర వాయిదా బేరాలే జీవనాధారం. అయితే వాటిలో మాత్రం అతడు సిద్ధహస్తుడు. బండివాడికి బురిడీకొట్టి పెద్దభవంతులలోదూరి పక్క వీథిలోకి జారగల తెలివితేటలుకూడా వున్నాయి. ఇక తల్లి. ఆమె తనకాలంలో పికిలిపిట్టగా వుండేది. ఇప్పుడూ అంతే. గండు పిట్టలకోసం ఆ కంచెమీంచి ఈ కంచెమీదికి, ఈ కంచె మీంచి ఆ కంచెమీదికీ గెంతేది. వాళ్లాయన ఖిల్లేదారుగా పనిచేస్తున్న రోజుల్లో తాను వెన్న బిస్కత్తులు తినేది. అప్పుడు గవర్నరుగా వుండిన నెమిలిపిట్ట తాను కంటపడితేచాలును పురివిప్పేది. ఇప్పటికీ ఆ జ్ఞాపకాలు మాసిపోలేదు. ఆ జ్ఞాపకాలతోనే తన పెద్దకూతుర్ని పెంచింది.

"అసలు దాన్ని కాలేజీకి పంపాలని నే నెప్పుడూ అను కోలేదు" అంది తల్లి, పైడిపిట్ట పెళ్లి ప్రస్తావన తేగానే.

"ఆడపిల్లకి ఇంగ్లీషు మాట్లాడడం, కొమ్మమీంచి కొమ్మ మీదికి ఎగరడం చక్కగా ముస్తాబు చేసుకొనడం, అతిథుల్ని సంతోషపెట్టడం చేతనైతే చాలునని నా అభిప్రాయం. ఆడది సుఖపడాలంటే అది చాలును."

"చాలా బాగా చెప్పారు. మీ అమ్మాయిని మీరు మంచి కట్టడిలో పెంచారు. మగవాళ్ళకంటే దేశ సమాచారం కొంత తెలిసివుండాలి. అధికారులు ఎప్పుడు ఎక్కడికి బదిలీ చేస్తారో తెలియదాయె. ఆడపిల్లలకన్నా రూ ఏ పెద్ద మనిషైనా సంతోషంతో దారి చూపుతాడు. కాగా తప్పు దారిన పడకుండా తగు జాగ్రత్తలో వుంటే చాలును" అంది పైడిపిట్ట.

"తప్పుదారులు? అలాంటిది మాయింటా వంటా లేదు. నా మాట నమ్మండి. మా అమ్మాయికి పాపభీతి మెండు. ఇంతెందుకు అడివిలో ఒంటిగా రౌడీమూక చేతిలో పడినాసరే, చెక్కు చెదరకుండా నలగని పువ్వల్లే తిరిగి వస్తుంది."

"నేనూ అలాగే అనుకొంటున్నానండీ."

పికిలిపిట్ట కుటుంబంలో ఇప్పుడు చెప్పిన ముగ్గురూ కాక ఇంకొక అమ్మాయి, ఇద్దరు మగపిల్లలూ వున్నారు. చిన్న మ్మాయిలో పికిలిపిట్ట లక్షణాలకన్న బొంతకాకి లక్షణా లెక్కువ. అందుకనే దానికి విదారిణి అని పేరు కూడా పెట్టారు (పెద్ద మ్మాయి పేరు విలాసిని). కథల్లో సవితికూతురులాగ విదారిణి కష్టశీల అని తలిదండ్రు లనుకొంటూవుండేవారు. మొత్తని

మనసు. ఇంటి పనులన్నీ చేస్తూ వుంటుంది. ఎప్పుడూ కలకల లాడుతూవుంటుంది. ప్రతీవారు దాని కదీ ఇదీ పురమాయించి చాకిరీ చేయించుకొంటూ వుంటారు. పైగా తిండి దండగ అని ఈసడిస్తూ వుంటారు. అయినా అన్నలన్నా, అక్కన్నా, అమ్మా, నాన్నా అందరిమీదా దానికి తగని అభిమానం. ఇంటి చాకిరీతోనే కాలం సరిపోతోంది కాని, కాలేజీ కెళ్ళ డానికి తీరిక లేదే అన్న చింత ఒక్కటే దానికుంది. ఇక అన్నలున్నారు. అందులో పెద్దవాడు పిండారీ పటాలంలో తరిఫీదు అవుతున్నాడు. నీతిశాస్త్రం పరీక్షలో ఎప్పుడూ సున్నా లేవస్తాయి. రెండవవాడు కాలేజీలో చదువుతున్నాడు. అయితే అక్కడ గ్రీకుభాష నేర్చుకోవాలని ఎందుకు కోరు తున్నారో మాత్రం వాడి కర్థంకాదు.

"ఆ చచ్చుభాష నేర్చుకొనడంవల్ల లాభమేమిటే అమ్మా? ఇక లాటిన్ అన్నావా దాన్ని వల్లించడం సులభం. నాలుగు పద్యాలు చదవడానికి పనికివస్తుంది. వ్యాసాల్లో అక్క డక్కడ నాలుగు ముక్కలు వాడితే వాటికొక హుందాతనం వస్తుంది. ముందు చీటీలు రాయడానికి పనికివస్తుంది. గ్రీకు భాష ఏం చేసుకోవాలి?"

"అది నేర్చుకొంటే నడవడి బాగుపడుతుందేమోరా" అని వాళ్ళమ్మంది.

"ఏమో అమ్మా!"

రోజు రోజంతా ఇల్లు సందడిగా వుంది. అంతా పరు గులే. వచ్చే అతిథులు, పోయే అతిథులు. విందులు, వినో దాలు. కొమ్మనుంచి కొమ్మకు గెంతులు, పాటలు.

పచారీ కొట్టువాడికి ఆర్నెల్లనుంచీ ఒక్క పైసాకూడా చెల్లించలేదు. అయినా ఇంట్లో వేసే విస్తరీ తీసే విస్తరీ. ముసిలి పికిలిపిట్ట సంసారసాగరాన్ని ఈదలేక తల ముక్కలాతోంది. తెల్లవారి లేవగానే పరిచయస్తుల్నందరినీ చూడ్డానికి బయలుదేరుతుంది. వాళ్ల ముసలమ్మ చచ్చిపోయినట్లు ఇప్పుడే వార్త వచ్చిందనీ వారసత్వం దక్కాలంటే కొంత డబ్బు అవసరమనీ ఒకరితో చెప్తుతుంది. తన జమీలో బొగ్గు గనులు వెలువడ్డాయనీ, వాటిని తవ్వడానికి మదుపు కావాలనీ మరొకరితో చెపుతుంది. ఎర్రని ఏగానీకూడా లేక చాలాబాధ పడుతున్నట్లు వేరొకరితో స్పష్టంగా చెప్పేస్తుంది. అప్పుడప్పుడు ఇంటికివచ్చే పటాలం కుర్రవాళ్ళవద్దకు వెళ్ళి "ఇదుగో ఒక పావలా వుందటోయ్ బాబూ! రేపిచ్చేస్తానులే" అంటుంది. పటాలం కుర్రవాళ్లు వెంటనే ఇస్తారు. అందుకు ప్రతిగా వాళ్ళ సరదా వాళ్లు తీర్చుకొంటారు. ఒకసారి తండాకితండా ఇంటికి వస్తారు. పెద్దమ్మాయిని చుట్టుముట్టి మీసాలు దువ్వుతారు. అక్కకొచ్చిన అపాయాన్ని చూసి పాపం చిన్నమ్మాయి కుమిలి కుమిలి ఏడుస్తుంది.

ఇలాంటి కుటుంబంతో సంబంధం చేసుకొనడానికి పైడిపిట్ట నిశ్చయించుకొంది. ముసిలి పికిలిపిట్ట దివాలా తీసినసంగతి ఇరుగు పొరుగు ఎవరి నడిగినా చెప్పివుండేవారు. మొన్న మొన్ననే తల్లి పికిలి వడ్డీవ్యాపారి బొంతపిచికతో ఒక తుప్పచాటు గుసగుసలాడ్డం అంతా చూశారు. పెద్దమ్మాయి సంగీత పాఠాలు చెప్పకొనడానికని మిష పెట్టి రోజూ బుల్బులి దగ్గరకు పరుగెత్తుతూ వుండేది. ఆ తర్వాత గాలిగుడ్లు కూడా

పెట్టిందని అంతా చెప్పుకొన్నారు. కాని పైడిపిట్ట మాత్రం ఇవి వినదలుచుకోలేదు. చూడదలుచుకోనూలేదు. పిల్ల నివ్వడానికి ముసలివాళ్ళు ఒప్పుకొన్నదే తడవుగా సంతోషంతో కొమ్మ కొమ్మకూ గంతులేసింది పిట్ట కొలనులో స్నానం చేస్తున్న తన ప్రియురాలు కనిపిస్తుందేమోనని మిర్రి మిర్రి చూసింది. ప్రియురాలు కంటపడేసరికి గొంతులో కూని రాగాలు తారాడేవి. పాటలో అన్నీ అపశ్రుతులే అయినా తన కింతటి అదృష్టాన్ని ప్రసాదించిన ఆ పరమాత్మను స్తుతించడాని కంతకన్నా వేరుమార్గంలేదు.

"నా అర్హతకు మించిన అదృష్టం నాకు పట్టిందని తెలుసును. దానికి తగినట్లు నడుచుకొనడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను" అని గొణుక్కునేది.

కాని విలాసిని మాత్రం పైడిపిట్టను చూస్తే ముఖం తిప్పుకొనేది. తన అయిష్టాన్ని దాచడానికికూడా అదెప్పుడూ ప్రయత్నించలేదు. ఈ సంబంధం చేసుకొనడానికి మేజరు పైడిపిట్ట అంగీకరించి తమను కృతార్థులను చేసిందని ముసిలిపిట్టలు విలాసినితో చెప్పాయి.

ముహూర్తంకూడా పెట్టేశామన్నాయి. ఆ మాట విన్నప్పుడు విలాసిని విరగబడి నవ్వింది.

"అమ్మా వాడు బలే గంధోళిగాడిలా వున్నాడే?"

ఇద్దరికీ ఎక్కువ చనువు ఏర్పడడంకోసం తలితండ్రులు వారి నేకాంతంలో విడిచిపెట్టేవారు. అప్పుడు సరదాగా కబుర్లు చెప్పుకొనడానికి బదులు మాటలన్నీ పుల్లవిరుపుగా సాగేవి.

"నీవు పిసినిగొట్టువా?" అని అడిగింది విలాసిని.

"పిసినిగొట్టును కాదు కాని పొదుపరిని. నీ దగ్గర కావలసినంత ధనం వుందనుకో! దాన్ని పారేసు కోవలసిన అవసరం లేదు. కాని నీవు కోరేపక్షంలో నా అలవాటు మార్చుకొంటాను" అని జవాబిచ్చింది పైడిపిట్ట.

తర్వాత లేచి పటాలంబాణీలో చెప్పులను కిర్రు మనిపించింది. అది చూసి విలాసిని మళ్ళీ విరగబడి నవ్వింది.

"ఆ చెప్పు అలా కిర్రుమనిపించినప్పుడు నీ వెంత తమాషాగా వున్నావు? అదీ అద్దదీ! హా హా హా! సరే. ఇంటి దగ్గ రేంతింటావు? ఏదో చెత్తాచెదారం అయివుంటుంది. అవునా?"

"ఆ భగవంతు డేం ప్రసాదించాడో అది తింటాను. సామాన్యభోజనమే కావచ్చును కాని సంతృప్తికరమైన తిండి. కాని నీకోసం మాత్రం పికిలిగింజలు తెస్తాను."

"అబ్బే నాకు కూరగాయలంటే ఇష్టం."

"కూరగాయలా? నీకోసం వాటిని సంపాదించడ మెంతపని? పొద్దున్నే ఎగిరి ఎవరి పెరటిలోకైనా వెళ్లి తేనచ్చును. ఇతరులైతే డబ్బుపోసి కొనుక్కొంటారు. ఎంత డబ్బు పోస్తారో ఆ దేవునికే తెలియాలి. కాని నేనుమాత్రం నీకోసం ఉల్ఫాగానే తెస్తాను."

"బాగానేవుంది. అయితే నాకు పెళ్లిబహుమతి ఏమిస్తావు? కొత్తగా పారిస్ నుంచి దిగుమతి అయ్యాయి లేసులు. మొన్ననే చూశాను. అవి నాకు కొనిపెడతావా?"

"చాలా సంతోషం. అందుకభ్యంతరమేమి. రేపొద్దుటికల్లా తయారుగా నేసివుంచమని లూతకు పురమాయిస్తాను."

"సరేకాని నా మనసుకు నచ్చిన లేసులుమాత్రం చాలా ఖరీదైనవి."

"ఖరీదు విషయం పట్టించుకోకు. డబ్బు, అడగడానికి లూతవచ్చినప్పుడు గప్‌చిప్‌గా దాన్ని కబళించేస్తాను. మన కింక అప్పూగిప్పూ వుండదు."

"బలే తమాషా అయినవాడివి."

ఇలాగే బాతాఖానీ సాగింది. ప్రియా ప్రియతమా అనే సంబోధనలు లేవు. విలాసిని పైడిపిట్టను అసలు లెక్క చేయడం మానేసింది. పటాలం కుర్రాళ్ళను చుట్టూ చేర్చుకొని రోజంతా సిగ్గూ ఎగ్గూ లేకుండా వాళ్లతో గుసగుసలాడ్డంతోనే సరిపోయేది.

ఒకనాడు పైడిపిట్టను పట్టుకొని "వారంతా నిన్నేమంటున్నారో తెలుసా మేజర్" అని అడిగింది. గత యుద్ధంలో నీవు "పటాలానికి కుళ్ళు బిస్కట్లు సరఫరాచేశావని చెపుతున్నారు" అని మొహంమీదే అనేసింది.

పాపం పైడిపిట్ట చాలా బాధపడింది. కాని వచ్చిన ఆరోపణను కాదనడానికి గుండె చాల్లేదు. అప్పుడు బిస్కట్ల సరఫరా బాధ్యత తనది కాదు. అయినప్పటికీ మనసు తేటగా లేదు. ఆశ్వికదళానికి ఆ రోజుల్లో తాను "వింత గడ్డి" సరఫరా చేసినమాట నిజం. మనుషులైతే కనీసం ఫిర్యాదైనా చేస్తారు. కాని గుర్రాలకు నోరు లేదే? అది మరీ ఘోరంకాదూ?

అప్పుడు తాను చేసిన పని నిజంగా చాలా చెడ్డది.

ఒకొక్కప్పుడు విలాసిని పటాలంకుర్రాళ్ళందరిముందూ మేజర్ని వెర్రివెంగళాయనిచేసి ఆడించేది. అంతా దాగుడు

మాత్ర లాడేవారు, కాని ఈ "పీడ" ఎప్పుడూ వారి నంటి పెట్టుకొనే వుండేది. అందుకని పైడిపిట్టనుకూడా ఆటలోకి దింపి కళ్ళకు గంతలు కట్టేవారు. రెక్కలు సాచి వారిని పట్టుకొనడానికి వెంటపడేది. కాని విలాసినీ దాని, పటాలంనేస్తాలూ తుప్పల్లో దూరిపోయేవారు. అప్పుడప్పుడు తుప్పల్లోంచి తొంగి చూచి పట్టుకోగలిగితే పట్టుకోచూద్దాం మేజర్ అని అల్లరిగా అరిచేవారు. కొసకి మేజరు ఏ చెట్టుకో గుద్దుకొని తల బొప్పి కట్టుకొనేవరకూ ఈ ఆట సాగేది.

ఈ వ్యవహారమంతా చూసి మేజరుకు కోపం వస్తుందేమోనని ముసిలి పికిలిపిట్ట భయపడింది. ఈ ఆటలు చాలించమని కూతుర్ని మందలించేది. కాని తర్వాత తర్వాత మేజరుకి దేమీా పట్ట లేదన్న సంగతి తెలిసింది. అప్పటినుంచీ మందలించడం మానుకొంది. ప్రతి సాయంత్రం మేజర్ని "ఒకరూపాయుందా మేజర్ ? రే పిచ్చేస్తాను" అని క్రమం తప్పకుండా అడిగి పుచ్చుకొనేది.

పైడిపిట్ట దుస్థితిని చూసి విదారిణి జాలిపడేది. జాలికన్నా మెత్తని భావం మరేంవుందో దాని మనసులో ఎవరికి తెలుసును ? ఏ మయితేనేం ఒకనాటి సాయంత్రం మేజర్ తీరిగ్గా తన గూటివైపు ఎగురుతూన్నప్పుడు, విదారిణి దాన్ని కలుసుకొంది.

"నిజం చెప్పు ! ఆ సీతాకోకచిలుకను ప్రేమించడం నీకు భాగ్యమేనా ? నన్ను పెళ్లాడు. నిన్ను కనిపెట్టుకొని వుంటాను."

కాని మేజరు కిది చెవిటివాని ముందు శంఖం వూదిన ట్లయింది. అసలు విదారిణి చెప్పింది పూర్తిగా వినడానికి కూడా మేజరుకు మనస్కరించ లేదు.

"ఇదుగో! నే నొక బొంతకాకిని పెళ్ళాడదలుచుకొంటే అప్పుడు నీ సంగతి ఆలోచించేవాణ్ని. కాని మీ అక్కతో సంబంధం కలుపుకోవాలనుకొన్నానంటే అర్థం ఆవిడనే పెళ్లాడుతానని! తెలిసిందా?" అని నిర్మొహమాటంగా చెప్పింది పైడిపిట్ట.

అయితే పైడిపిట్ట ఏమీ చూడకుండా కళ్ళు మూసుకొని కూర్చుందని చెప్పడానికి వీల్లేదు. దాని కన్ని విషయాలూ స్పష్టంగా తెలుసును. అంతా నిర్ణయమైపోయిందని కూడా తెలుసును. ఎందు కలా నిర్ణయమైందో చెప్ప లేదుకాని అంతా నిర్ణయమైపోయిందనిమాత్రం గొణుగుకొంటూ వుండేది.

సరే పెళ్లి అయిపోయింది. వేడుకలూ, వినోదాలూ ముగిశాయి. రాత్రి చాలా పొద్దుపోయిన తర్వాత పైడిపిట్ట నవోఢతో కలిసి గూడు మరమ్మత్తు మొదలుపెట్టింది.

రాత్రి చాలా అందంగావుంది. గాలి సువాసనలతో మత్తెక్కింది. వినీలాకాశంలో చుక్కలు రవ్వల్లా మిల మిల మెరుస్తున్నాయి. పైడిపిట్ట మదన జ్వరంతో కాగిపోయింది. నరాలలో ఒక కొత్తజవం ప్రవహించింది. పాడాలో ఏడవాలోకూడా తెలియని అయోమయంలో పడ్డది. కాని నిగ్రహించుకొంది. పైడిపిట్ట ప్రేమను చూసి విలాసినికూడా పరవశం చెందింది. ఆ పారవశ్యంలో కన్నులరమోడ్చి వయ్యారంగా కంపిస్తూ పైడిపిట్ట తలను కొనముక్కుతో దువ్వింది. సరీగా

అప్పుడే ఒక తాగుబోతుల తండా వచ్చిపడింది. విలాసిని సోదరులు, వారి స్నేహితులు తాగిన మైకంలో తూలుతూ అక్కడికి వచ్చారు. ఈలలు వేస్తూ పదాలు పాడారు. వారి గొంతు వినిపించేసరికి పెళ్ళికూతురిలో పెద్ద మార్పు వచ్చింది ఆ పడకటింటి దుస్తులతో అలాగే ద్వారం దగ్గరకు పరుగెత్తింది. అక్కడ ఆ పటాలం పిల్లకాయలతో ఇకిలిస్తూ కోడికూసేవరకూ అలాగే వుండిపోయింది. పైడిపిట్ట కూడా పటాలం దుస్తులు వేసుకొని భార్య వెనుక నిలబడి కులాసాగా నవ్వడానికి ప్రయత్నించింది. కాని మేజరు హోదాలో వున్నవారికి వేడుకలూ, వినోదాలూ సరిపడవనే విషయం జ్ఞాపకం వచ్చింది. పైడిపిట్ట ఎంత ప్రయత్నం చేసినా, పై పడిన వయస్సు విజ్ఞతను మప్పుతూనే వచ్చింది. అందుకని ఆ దృశ్యాన్ని అలా చూస్తూ వుండడం సాధ్యపడలేదు. వెంటనే తొర్రలో దూరి గుర్రు పెట్టింది. ఆ తర్వాత పటాలం పిల్లకాయలు నవ్విన వెడనవ్వులకుకూడా దానికి తెలివిరాలేదు. ఇలా ఆ పటాలం దుస్తులలోనే గాఢనిద్రలో ఆ తొలిరేయి గడిచింది.

అప్పటినుంచీ భార్య కతనిమీదగల కొద్దీ గొప్పా గౌరవంకూడా అంతరించింది.

పైడిపిట్ట ఇంకా చీకటి వుండగానే లేచింది. కాని విలాసిని జాడమాత్రం ఎక్కడా కానరాలేదు. ఇంటిపనులు చేయడానికి కుదుర్చుకొన్న పూరిపిట్ట నడిగింది. "విలాసినీ కుమారిగారు కన్నవారింటికి వెళ్ళిపోయారు. భోజనానికి తిరిగి వచ్చేదీ రానిదీ ఏ విషయమూ చెప్పలేదు" అని చెప్పింది

వూరిపిట్ట. "విలాసినీ కుమారి" అన్నమాట వినేసరికి గుండె జల్లుమంది పైడిపిట్టకు.

పైడిపిట్ట తల అటూ ఇటూ తిప్పి పక్కనున్న కొమ్మ మీదికి పోయి వాలింది. అడవి అంతా నీరవంగా నిస్తబ్దంగా వుంది. ఉదయానికి కొద్ది ముందు ప్రకృతి జీవం లేనట్లు కని పిస్తుంది. పిట్ట లింకా నిద్రపోతున్నాయి. ఆకు అల్లాడ్డం లేదు. తూర్పున మాత్రం కెంజాయలు అలము కొంటున్నాయి. ఉషోదేవి మూతివిరిచి వెక్కిరిస్తున్న ట్లనిపించింది పైడిపిట్టకు. దాని జీవితంలో ఏదో ఒక విషాదఘటన జరిగింది. దాని బ్రతుకుపై మాయని మచ్చ ఏదో పడింది. అసలు అది తన విధిని విస్మరించింది. ఆ విధి అంత కష్టతరమైనది కాదు. సామాన్యమైనది. అయినా దాని కది భానిస అయిపోయి విస్మరించింది.

ఆ భయంకర పరిస్థితినంతటినీ పరామర్శించడానికి పూనుకొంది. మొదటి అడుగులోనే తాను మోసం చేసింది. ఇంకా శాస్త్రీయంగా వుండడంకోసం మూలకారణం దగ్గరనుంచీ ఆలోచించింది. విధినిర్వహణను విస్మరించడానికి కారణం ఏమిటి ? ఆ కారణానికి తాను కారణమా ? "ఈ దుస్థితి కంతకీ నిజంగా నేనే కారణమైనట్లయితే ఇక చెప్పవలసిన దేమీ లేదు. దోషం నాదే అయితే ఇదుగో నా తల. కాని ఎంత ఆలోచించినా నా తప్పేమీ కనిపించడం లేదు. అయినా ఇలా ఎందుకు జరిగింది ?"

ఇలా ఎంతసేపు ఆలోచించినా లాభంలేదనుకొంది. కొన్నికొన్నింటికి హేతువాదం పనిచేయదు. అవలా జరిగి

తీసుతాయంతే! అది ఎలా జరిగివుండవలసింది, ఎలా జరగలేదు అనేతర్కం అక్కడేమీ పని చేయదు.

న్యాయస్థానందాకా ఎందుకు ? ఏ యువకుణ్ణడిగినా, ఏ తల్లి నడిగినా మరేపెద్దమనిషిని అడిగినా అంతా చెప్పేతీర్పు ఒక్కటే. "సిగ్గు సిగ్గు సిగ్గు!" అని.

ఆ తాగుబోతు మూకను తరిమి కొట్టవలసింది. తన గూడును దుర్గమదుర్గంగా చేయవలసింది. తన విధి నిర్వహణాధికారాన్ని నిర్వర్తించడంకోసం రొమ్ము కాయవలసింది. ఆ విధి నిర్వహణలో ప్రాణాలనే విడవవలసింది.

"ఎంత సిగ్గుచేటు!" అని అప్రయత్నంగా అంది పైడి పిట్ట. అలాగే దుస్తులైనా మార్చుకోనకుండా అప్రయత్నంగా గూడు విడిచి 'అక్కడికి' పరుగెత్తింది.

అప్పటికి ముసిలిపికిలి లేచింది. మటమట మండి పోతూంది. ఆ రాత్రి తన ముద్దుబిడ్డ విలాసినికి జరిగిన అవమానానికి తోడు చుట్టంచూపుగా వచ్చిన తన పినతల్లి కూతురు చెప్పిన కథలు అగ్గిమీద గుగ్గిలమయ్యాయి. ఆమెకూడా తన కూతురు కలహాకంఠిని ఒకకత్తెర పిట్టకిచ్చి పెళ్లిచేసింది. దానికీ దీనికీ పోలి కెక్కడ ?

"మా కలహాకంఠి భర్త ఎలాంటివాడనుకొన్నావు ? అబ్బ ఒళ్ళంతా కళ్ళుచేసుకొని ప్రేమిస్తాడనుకో !"

అలా అని ఏదో చెవిదగ్గర గుసగుసలాడింది. వెంటనే సంతోషం ఒలకబోస్తూ "మా కలహాకంఠి ఆశ్చర్యాన్ని చూసి తీరాలి" అంది.

ముసిలి పికిలి వింటున్నంతసేపూ రెక్కలు విరుచుకొంది.

"మీ కలహాకంఠిని దేవుడు చల్లగా చూడాలి ... చల్లగా చూడాలి" అని గొణిగింది. "కొంతమంది అదృష్టం. వారికంతా సుఖమే. మరి మాకో? ... మగనివల్ల మీ కలహాకంఠికి కలిగే సుఖం ... మా సంగతి చూడు ... విలాసిని అనాకారి యేమీకాదు. గుమ్మటంలా వుంటుంది. ఆ చెంపలు, ఆ రొమ్ము ... అసలా వెధవ ఈ అందాలను కన్నెత్తి చూశాడంటావా?"

"చూడకుండా ఎలా వుండగలిగాడమ్మా చోద్యం?"

ఆ సమయానికి పైడిపిట్ట లోపలికి వచ్చింది. పల్లెత్తి మాట్లాడబోయే లోగానే అత్తగారు అగ్గి అయిపోయి "సిగ్గూ బిడియం లేదూ? ఛీ? ఛీ!!" అని చీదరించుకొంది.

ఆమె పింతల్లి కూతురు కూడా అందుకొని "సిగ్గు సిగ్గు" అని వంత పలికింది.

పైడి పిట్టకు నోట మాట పెకల్లేదు. ఎక్కడికైనా ఎగిరి పోదామనిపించింది. కాని రెక్కలు విరిగినట్లయిపోయి కదల్లేదు. ఎలాగైతేనేం పడుతూ లేస్తూ గూడు చేరుకొంది. అవమాన భారాన్ని అక్కడ దాచుకొందామనుకొంది. అప్పటికే పిట్టలన్నీ లేచాయి. ఈ సంగతి ఊరూ నాడూ పాకిపోయింది. అందులో ఒక్కటికూడా ఓదార్పు మాట అన్న పాపాన పోలేదు. కొన్ని పైగా ధన్యవాదాలు కూడా చెప్పాయి. అన్ని కళ్ళల్లోనూ సిగ్గు సిగ్గు! అని స్పష్టంగా రాసివున్నట్లు కనిపించింది.

ఏమయితేనేం సాయంత్రానికి విలాసిని తిరిగి వచ్చింది. ఒక్కమాటైనా పలకకుండా తిన్నగా గూటిలోకి పోయింది.

"ప్రియా! ప్రేయసీ! ప్రియతమా!" అని పైడిపిట్ట ప్రాధేయపడుతూవుంటే చూసి అలగాజాతిలో పుట్టిన పూరిపిట్టకుకూడా మనసు కరిగిపోయింది.

కాని విలాసిని మాత్రం నోరు మెదపలేదు. పండుకోవడంకోసం విలాసిని పక్క సర్దుకొన్న సవ్వడి తప్ప పైడిపిట్టకు మరేమీ వినిపించలేదు.

"దేవీ! దేవత లిచ్చిన వరప్రసాదమా!" అని ప్రతిమాలింది పైడిపిట్ట. గొంతు బొంగురుపోయింది. ఏడుపుకూడా వచ్చింది.

కాని యీ కన్నీరు కాతరస్వరంకూడా కరిగించలేకపోయాయి విలాసినిని. పైడిపిట్ట మంచం దగ్గరకు వెళ్లి ప్రేయసిపైన వాలింది. కాని అప్పటికప్పుడే ఆమె నిద్రపోయింది. నిద్రపోతున్నట్లు కనిపించింది.

ఇలాగ యీ రాత్రికూడా పైడిపిట్టకు ఒంటరిపాటుతోనే గడిచింది. కోటు విప్పేసింది. కాని లాగు విప్పడానికి ధైర్యం చాలలేదు. విలాసిని ఏమైనా అనుకొంటుందేమోనని భయం. మర్నాడుకూడా చీకటితోనే లేచింది పైడిపిట్ట. విలాసిని అప్పటికప్పుడే కన్నవారింటికి తుర్రుమంది.

ఇలాగ మొదలైంది మేజరు పైడిపిట్టగారి వీరమరణం.

ఒక నెల గడిచినా నవోఢ మేజరును పల్లెత్తికూడా పలకరించలేదు. కన్నెత్తి చూడనూలేదు. ప్రతిరాత్రీ గూటికి తిరిగివచ్చేది. రాగానే మంచంమీద వాలేది. మర్నాడు

ఉదయానికల్లా మాయమైపోయేది. అసలదెప్పుడు బైటికి వెళుతున్నదో పైడిపిట్ట ఎంత ప్రయత్నించినా కనుక్కోలేక పోయింది. నాలుగైదుసార్లు పటాలంమూకను వెంటవేసు కొనివచ్చింది. పూరిపిట్టను పిలిచి విందు వంటకాలు తయారు చేయమని పురమాయించేది.

పైడిపిట్ట కళ్ళముందరే తానూ తన పటాలంనేస్తాలూ సిగ్గూ ఎగ్గూలేకుండా తిని తాగి గెంతులేసేవారు. మేజరుని ఒక నౌకరుకన్నా హీనంగా చూసేది. అంతేకాని ఆ గూటి యజమానికదా అని మాటవరసకైనా మన్నన చూపేది కాదు. అక్కడ అత్తవారింట్లో కూడా మేజరు ప్రస్తావన వచ్చినప్పుడు అంతా "ఆ వెధవ" అనేవారు.

"ఈవేళ ఆ వెధవ ఒక లాటరీ టిక్కెట్టు తీసుకొన్నాడు" అని ముసిలికికిలి తన పినతల్లి కూతురుతో చెప్పింది. పినతల్లి కూతురు వెళ్ళడానికి కాళ్ళురావడంలేదని అక్కడే మకాం వేసింది.

"ఆ వెధవకి కొద్దిరోజుల్లోనే పిచ్చెత్తుతుంది. చూస్తూ వుండు. ఇప్పుడే మతిలేనివాడిలా తిరుగుతున్నాడు" అంటుంది అత్తగారు.

మామగారొక్కడే అప్పుడప్పుడు అల్లుణ్ణి చూడ్డానికి వస్తూవుండేవాడు. నాలుగు ఓదార్పుముక్కలు చెప్పేవాడు. విలాసిని చెవులు మెలేస్తానని కూడా చెప్పేవాడు. అంతేకాని ఆ పని మాత్రం ఎప్పుడూ చేయలేదు. ఈ సానుభూతి చూపి నందుకు ఉపకృతిగా అల్లుడి డబ్బును కొల్లగొట్టుకుపోయేవాడు

మరొక నెల గడిచింది. విలాసినికీ, ఆమె భర్తకూ గల సంబంధంలో మార్పు వచ్చింది. అయితే ఆ వచ్చిన మార్పు మంచికోసం మాత్రం కాదు. విలాసిని పూర్తిగా కట్టుతప్పింది. మానాభిమానాలను విడిచిపెట్టింది. ఇష్టం వచ్చినట్లు తిరుగుతోంది. ఇంతకు ముందున్న మౌనముద్ర యిప్పుడు లేదు. ఒక మహారాణీ మార్జకునితో మాట్లాడినట్లు పైడిపిట్టతో మాట్లాడుతుంది.

"డబ్బు" అని అడుగుతుంది.

"ఎంత కావాలి ప్రియా ?"

"ఎంత గింత పనికిరాదు ఇటియ్యి. అంతే"

ఇంత కావాలి అని ఎప్పుడూ చెప్పలేదు. ఆ డబ్బు ఏం చేస్తున్నదో అసలే చెప్పలేదు. పైడిపిట్టకు పిచ్చెత్తించాలనే వుద్దేశ్యంతో అలా చేస్తున్నదో, అదొక్కటే కారణంకాదో తెలియదు. ఆమె వుద్దేశ్యం ఏమిటో ఎవరు చెప్పగలరు ? పికిలిపిట్ట మనసు శూన్యంగా వుంటుంది. ఆ మనసులో అనురాగ విరాగాలు ఎప్పుడు ఎలా పుడతాయో మహామహా మేధావులకుకూడా తెలియదు. ఏమయితేనేం పైడిపిట్ట మాత్రం పైకం ఎన్నడూ లేదని చెప్పలేదు. తొర్ర వెనక గదిలోకి వెళ్ళి వణుకుతున్న చేతులతో గల్లాపెట్టె పట్టుకువచ్చేది. కూడబెట్టిన ధనాన్నంతనీ చిత్రంగా నవ్వుతూ చేజిక్కించుకొనేది పికిలిపిట్ట. పైడిపిట్ట గుండెలు పగిలినంత పనయ్యేది. పైడిపిట్ట పీనాసి అనికాదు. అసలు తన భార్య ఏంచేస్తోంది అన్న విషయం తెలుసుకోవాలని దానికుండేది.

భర్త కూడబెట్టిన ధనాన్ని కొల్లగొట్టి ఎగిరిపోయింది పికిలిపిట్ట. ఒక గంటపోయిన తర్వాత ఈ కొల్లబోయిన ధనం ఏమయిందో స్వయంగా చూసింది పికిలిపిట్ట. విలాసిని ఒక పెద్ద పటాలాన్ని, వన్నె పిట్టల్ని వెంట వేసుకొని ఇకఇకలు పకపకలతో రొదచేస్తూ పక్కనున్న పచ్చికబయల్లో వాలింది. అక్కడ పైడిపిట్ట డబ్బుతో వన భోజనాలు జరిగాయి. ఆటలు పాటలు, నృత్యాలతో పొద్దు వాటారింది. అప్పుడప్పుడు సేద తీర్చుకొనడం కోసం జంటలు జంటలుగా తుప్పల్లోకి పోయేవి. మళ్ళీ ఆటలు పాటలు.

ఒకనాటి సందెవేళ విలాసిని చాలా ఉత్సాహంతో గూటికి చేరింది. సంతోషంతో తొర్రలో రెక్కలు టపటపా అల్లార్చింది. గిరగిర గిరికలుకొట్టింది. పాడింది. నవ్వింది. ఏడ్చింది ... పైడిపిట్ట కిదంతా చూడగా మొదట భయాశ్చర్యాలు కలిగాయి. ఆ తర్వాత మోహం ముంచుకొచ్చింది. తన భార్య క్షమించిందనీ ఇక తన కష్టాలన్నీ గట్టెక్కాయనీ అనుకొంది. సగం పట్టువిడిచిందని భావించింది. ఇక తనకు స్వర్గసౌఖ్యం ప్రసాదిస్తుందని ఆశించింది. దానితో ఒక మధుర భావం నిలువెల్లా పారాడింది. దానితో పటాలంమేజగుకి ఎవరికీ అలవికానంత ధైర్యంకూడా వచ్చింది. ఆ మోహావేశంతో విలాసినివద్దకు చేరింది. విలాసిని తొర్ర ముంగిటలో నిలిచి శూన్యంలోకి చూస్తోంది. పైడిపిట్ట వెనుకనించివచ్చి ముక్కుతో మృదువుగా మూర్ధాన్ని తాకింది.

"ఛీ వెధవా !" అని అరచింది విలాసిని. పొదువుకొనబోతున్న పైడిపిట్టను తప్పించుకొని తుర్రుమంది.

అంతకుముందు పగలంతా బైట తిరిగేది. దీనితో యిప్పుడు రాత్రిళ్లుకూడా ఎగిరిపోతోంది.

మర్నాడుదయం గూటికి తిరిగి వచ్చింది. కాని రోజంతా కుమిలి కుమిలి ఏడ్చింది. సాయంత్రం పైడిపిట్ట గుర్రుపెడుతూండగా చూసి తుర్రుమంది.

పగలల్లా శోకం. చీకటిపడేసరికి మాయం. ఇలా రెండు వారాలు గడిచాయి. పైడిపిట్ట చింత చెప్పనలవి కాదు. ఏ క్షణాన విలాసిని మూర్ఛపోతుందోనని నీళ్ళకూజా పట్టుకొని సదా వెన్నంటివుండేది.

"ఇదిగో ప్రేయసీ! గుక్కెడు నీళ్ళు తాగు. నీకొచ్చిన ఇబ్బందేమిటో నాతో చెప్పు. భర్తతో ఏం చెప్పననుకోకు. నాకా సుఖం అనుభవించే యోగం లేదు. తండ్రి ననుకో! అన్న ననుకో! ఇప్పుడు మనసువిప్పి చెప్పు. నీకు కష్టం కల్గించిన దెవరు?"

"ఫో వెధవా!!!"

సరే, ఒకరోజున విలాసిని అసలే తిరిగిరాలేదు. పైడిపిట్ట ఒకరోజు ఎదురుచూసింది. రెండురోజులు ఎదురుచూసింది. కలకాలం అలా ఎదురుచూడాలని నిశ్చయించుకొంది. ఇక ఇది ఒంటరిబ్రతుకు. భార్య లేచిపోయింది. బంధువులుకూడా మాటమాత్రమైనా చెప్పకుండా వెళ్ళిపోయారు. బహుశా పెద్ద పికిలిపిట్టకు ముసిలమ్మ ఆ స్త్రీకలిసిందేమో. ఇక యితర పిట్టలకు మొహంచూపడానికి సిగ్గేస్తోంది. కొసకు కొలువుకు పెట్టుకొన్న పూరిపిట్టకూడా ఒక పిచ్చికతో పారిపోయి గూడు పెట్టుకొంది.

ఇంతవరకూ బాధలు తప్ప మరేమీ లేవు. పిచ్చిగా ఎగరాలని, ఏడవాలని, తిట్టాలని అనిపించేది. అయినా ఆశమాత్రం పోలేదు. ఇప్పుడు బాధలకు మనసు బండబారింది. అన్నిటిమీదా విరక్తి పుట్టింది.

చలికాలం వచ్చింది. పిట్టల గూళ్ళన్నీ కోలాహలంగా వున్నాయి. వెచ్చని చోటికి ఎగిరిపోవడమూ, ఈ గూటినిలాగే అంటిపెట్టుకొనడమూ అనేది నిర్ణయించుకోలేకపోయింది పైడిపిట్ట. శీతగాలి తిరిగింది. అడవులన్నీ బోసిగా కనిపిస్తున్నాయి. రాత్రులు దీర్ఘాలై చీకటి ముసిరి జీబుమంటున్నాయి. చలి, ఆకలి, ఒంటరితనం – పైడిపిట్ట అలాగే గూటిముందు రెప్ప వాల్చకుండా ప్రతీక్షిస్తూ కూర్చుంది. పెద్దపులుగు చాలాసార్లు భీకరంగా కూస్తూ పక్కనుంచే ఎగిరిపోయింది. ఒకసారిదాని రెక్క గూటికూడా తగిలింది. మానుపిల్లి చాలాసార్లు తొర్రలోకి తొంగి చూసింది. కాని అదృష్టవశాత్తు పెద్ద పులుగూ, మానుపిల్లీ చెరుపేమీ చేయలేదు. ఈ ఎముకలపోగును తింటే ఏం కడుపు నిండుతుందని అనుకొని వుంటాయి. లేదా ఈ పైడిపిట్ట తన రోజుల్లో పటాలంలో చాలా సామర్థ్యం చూపిందని వాటికి జ్ఞాపకంవచ్చి వుంటుంది. అలాంటి సమర్థుని సేవాభాగ్యాన్ని దేశానికి లేకుండా చేయడం మంచిది కాదనుకొని వుంటాయి.

తన బ్రతుకు బ్రద్దలయిందని పైడిపిట్టకు తెలుసును. అందుకని గత జీవితమంతా జ్ఞాపకం వచ్చింది. ఆ రోజుల్లో తన బ్రతుకు ఎంత చక్కగా, ఎంతహుందాగా, ఎంత క్రమబద్ధంగా వుండేదో గుర్తుకురాగానే పైడిపిట్ట హృదయం సంతో

మంతో పొంగులువారింది. ఆ జీవితంలో ఆనందకరమైన అను భవాలు లేకపోలేదు. పటాలంలో పై వ్యవహారాలొక్కటే కాదు. ఉదాహరణకు ఏంట్రెంత వ్యవహారమేవుంది. దోస కాయలాగ మహా చక్కనిపిల్ల. ఆదిలో అదికూడా "ఎంత తమాషా అయినవాడివి" అని పక్కికిలించేది. ఆ నవ్వులాట ల్లోనే ఒకనాటి సాయంత్రం "ప్రియా నేనెంత మూర్ఖురాలిని! అనవసరంగా కాలాన్ని వ్యర్థం చేస్తున్నానుకదా!" అంది. పైడిపిట్ట దాన్ని అప్పుడే పెళ్ళాడి వుండవలసింది. కాని ఆ పని చేయలేను. ఆర్గురు బిడ్డల్ని దానికి ప్రసాదించి విడిచి పెట్టింది. పూటకూటిల్లు పెట్టిన మైనా జ్ఞాపకం వచ్చింది. అది వితంతువు. బరపటాలు, మెరిగలు అమ్ముతూ వుండేవి. "బరపటాల ధరెంత? మెరిగల ఖరీదెంత? పాపం భర్తలేని ఒంటరి జీవితం!" అని తాను పిచ్చాపాటిలోకి దిగింది. అంతలో దీపాలు మలిగి పోయాయి. తర్వాత... దాన్నయినా పెళ్ళాడి వుండవలసింది. పెళ్ళాడుతానని మాటకూడా ఇచ్చింది. కాని అందరిలాగే దాన్నికూడా విడిచిపెట్టింది.

ఆ రోజులు మళ్ళీరావు! ఏంట్రెంత, మైనాల విష యంలో ఎంత కర్కశంగా ప్రవర్తిస్తే అంతగర్వంగా వుండేది తన కప్పుడు. దానికి తగ్గట్టు అంతాపొగిడేవారు. "మగాడంటే మేజరేనయ్యా" అని పటాలం గుమస్తాలనేవారు.

నిజమే, మళ్ళీ పటాలానికే పోతే? ఎందుకు పోగూ డదు? ఇదుగో కలం కాగితం – ఒక్క దరఖాస్తు గిలికేస్తే మారుమాట్లాడకుండా ఉద్యోగమిస్తారు!

ఆ భావాన్ని అంతటితోనే తుంచేసింది. ఇప్పుడు ఏం ట్రెంతలనీ, మైనాలనీ తలుచుకోనకూడదు. ఇక ముందు తనకున్న దొకటే. ఒంటరితనంతో కుమిలిపోతూ ఎదురు చూస్తూ వుండడం. తన రత్నాలరాసి, బంగారు బరిణ, అందాల పేటి, తన ప్రేయసి తిరిగివస్తుంది. తప్పకుండా తిరిగి వస్తుంది.

అప్పుడప్పుడు చిర్రెత్తుకొస్తూఉండేది. అది తాను కోరి తెచ్చుకొనేది కాదు. దుష్టపిట్టలు కొన్ని అప్పుకోసం వచ్చేవి. అన్నిటిలోకీ మరీ దుష్టు కాటుక పిట్ట. పైడిపిట్ట కొచ్చిన ఆపద పట్ల సానుభూతి చూపుతూ ఓదార్పుమాటలతో మొదలు పెట్టేది. ఎందుకొచ్చిన బెడద ఈ రోజుల్లో విడాకులివ్వడం చాలా మంచిది అని దుర్బోధచేసేది.

"ఇదుగో ఒక లాయరును చూడు. పని జరిగిపోతుంది. చిటికలో అంతా అయిపోతుంది. దాన్నిగురించి బెంగపెట్టు కోకు. విడాకు లిచ్చిపారెయ్!"

బొంతపిచుక కూడా దుర్బోధలుచేసేది. కాని విడా కులు దానికి నచ్చవు. పోలీసులకు ఫిర్యాదు చేయమని అది సలహా యిచ్చింది.

"విడాకులివ్వడం వాళ్ళను చాలా గౌరవించినట్లవు తుంది. ప్రతిదానికీ విడాకులిస్తూ కూర్చోడమేపనా? పోలీసు లకు ఫిర్యాదు పంపు. చచ్చేదాకా జ్ఞాపకం వుండేలాగ కుళ్ల పొడిచి వదులుతారు."

పైడిపిట్ట కొసకు ఈ దుర్బోధలకు లొంగిపోయింది. పట్నానికి వెళ్లి లాయరు డోలు పిట్టను కలుసుకొంది.

"నేను పెళ్ళాడుదా మనుకొంటున్నాను. కాని భార్య బ్రతికివుంది. ఏంచేయమని సలహా ?"

"దాని కేంవుంది. నాకు నలుగురు పెళ్ళా లున్నారు. మొన్న నే అయిదవదాన్ని పెళ్ళాడాను. ఇంతవరకూ శిక్ష పడ లేదు."

కాని లాయరు ధోరణిచూస్తే తన ప్రయత్నం నిష్ఫల మని తోచింది పైడిపిట్టకి.

డోలుపిట్టకు ఫీజుకింద ఇరవై పైసలు చెల్లించి (ఉత్తి పుణ్యానికి – పైగా అబద్ధాలు చెప్పినందుకు !) బరువైన గుండెతో పోలీసు కార్యాలయానికి వెళ్లింది. అక్కడ కూడా అదృష్టం కలిసిరాలేదు.

"దాన్నిటు తీసుకొనిరా కుళ్ళపొడిచి విడిచిపెడతాం. కాని ఇక్కడ మమ్మల్ని వేధించకు ! నీవు మేజరు నయ్యేది, మరొకరివయ్యేది నిన్ను ముందు కుళ్ళపొడుస్తాం" అని చాలా సజావుగా చెప్పారు.

దానితో ఆశలన్నీ అడుగంటాయి. రెక్కలీడ్చుకుంటూ గూటికి తిరిగివచ్చింది.

శీతాకాలం గడిచిపోయింది. చలికి వొళ్లు కొంకర్లుపోయి కొనప్రాణంతో వుంది పైడిపిట్ట. అలాగే పడుతూ లేస్తూ ఏటిగట్టుకు వెళ్లింది. తిండి ఏమైనా దొరకుతుందన్న ఆశతో ఏటిలోని ఒక బండమీాదికి గెంతింది. నీళ్లలో తన

నీడ చూసుకొనేసరికి గుండె చెరువైంది. ఎముకలు చర్మం మాత్రమే మిగిలాయి. ఆ పూర్వపు ఒళ్ళు చాయలుకూడా లేవు. మెడమీద జూలు లేదు. ఏమైపోయిందో దేవునికే తెలియాలి. విచారించి గూటికి తిరిగివచ్చింది. అప్పటినుంచీ ఆశలన్నీ పోయాయి.

పెళ్ళాం తిరిగి వచ్చేవరకూ తను బ్రతికివుండి మాత్రం ఏం లాభం? ఏమని స్వాగతం ఇవ్వగలదు. తన ప్రేమని, తన కఠోరదీక్ష నెలా వ్యక్తం చేయగలదు?

వసంతం వచ్చింది. ఒకనాటి రాత్రి ఆమెకూడా తిరిగి వచ్చింది. ఆవిడ ఆరోగ్యం చెడిపోయింది. రెక్కలన్నీ రాలి పోయాయి. తోక వికారంగా వుంది. రంగుపోయింది. వణుకు ఒకటి. చలికే వణుకుతోందో, సిగ్గుతో కంపిస్తోందో తెలి యదు. పైడిపిట్ట దాన్ని గుర్తుపట్టలేకపోయింది.

"ఇదుగో వచ్చాను" అంది పికిలిపిట్ట.

"లోపలికిరా" అంది పైడిపిట్ట.

వారు మాట్లాడిన ఆఖరి మాటలవే. గతాన్ని గురించి గుసగుసలు లేవు. భవిష్యత్తును గురించి పలుకులు లేవు.

అప్పటినుంచీ రెండూ ఒక గూటిలోనే వుంటున్నాయి. అయినా మాటల్లేవు. ఎప్పుడూ ఏదో ఆలోచనలో మునిగి వుండేవి. ఏదో మహాద్భుతం జరిగి హృదయాలు మళ్లీ ప్రేమతో క్షమతో నిండి పోకూడదూ అని ఆలోచిస్తున్నా

యేమో? కాకపోతే వేదసలను నెమకు వేసుకొంటూ "నా జీవితాన్ని నీవు భగ్నంచేశావుకదా గుండెల్లేని కూనా!" అంటే "నా యవ్వనానికి విషంపెట్టావు దుర్మార్గుడా" అని ఒకరినొకరు మౌనంగా నిందించుకొంటున్నారేమో!





# ఇరుగూ - పొరుగూ

ఒక గ్రామంలో కుబేర పుల్లయ్యా, కుచేల పుల్లయ్యా ఇరుగూ పొరుగున వుండేవారు. కుబేర పుల్లయ్యాని పుల్లయ్యాగారూ అనీ, పురుషోత్తంగారూ అనీ పిలిచేవారు. కాని కుచేల పుల్లయ్యానిమాత్రం పుల్లిగా అనికూడా అనేవారు. ఇద్దరూ మంచివారే. అందులో కుబేర పుల్లయ్యా మరీమంచివాడు. నెరదాత. కష్టపడి స్వయంగా సంపదను సృష్టించక పోయినా సంపదపంపిణీ విషయంలో మాత్రం అతనికిచాలా గొప్ప అభిప్రాయా లున్నాయి.

"అది నావంతు. కొంతమంది సంపదా సృష్టించరు. వారికి గొప్ప అభిప్రాయాలూ వుండవు. అలాంటి వాళ్ళను చూస్తే నాకు మహాచికాకు. కాని నేనలాంటి వాణ్ణి కాను" అంటాడు కుబేర పుల్లయ్యా.

కుచేల పుల్లయ్యకు సంపద పంపిణీ విషయంలో అసలు అభిప్రాయాలే లేవు (అందుకు తీరికకూడా లేదు). కాని సంపదను మాత్రం సృష్టిస్తాడు. అతను కూడా "అది నావంతు" అంటాడు.

శనివారం సాయంత్రం కలవారికీ లేనివారికీ అందరికీ తీరిక. అందుకని ఇద్దరూ కలుసుకొంటూ వుండేవారు. కుబేర పుల్లయ్య భవంతి ముందు అరుగుమీద కూర్చుని బాతాఖానీ వేసేవారు.

"రేపు వంటకాలేమిటి?" అని అడిగేవాడు కుబేర పుల్లయ్య.

"ఏమీ లేదు" అని జవాబిచ్చేవాడు కుచేల పుల్లయ్య.

"నేను రేపు కోడిని కోయిస్తున్నాను"

అలాగని ఆవులించి చిటికవేస్తాడు. చేతులు పైకెత్తి పరమాత్మకు దండంపెట్టి, కుచేల పుల్లయ్యపై దయాదృష్టులు సారిస్తాడు.

"మనది చాలా చిత్రమైన ప్రపంచ మోయ్. ఒకరు రోజంతా రెక్కలు ముక్కలు చేసుకొన్నా కూటిలోకి కూరాకుతప్ప వేరుండదు. ఒకరు పొద్దస్తమానూ తీరికగా పనికివచ్చే వ్యాపకాల్లోవుంటారు. నిత్యం మాంసం తింటారు. ఇలా ఎందుకు జరుగుతుందని?"

"ఇలా ఎందుకు అవుతుందా అని నేను కూడా చాలా కాలంనుంచీ అనుకొంటున్నాను. కాని నాకు ఆలోచించడానికి తీరిక లేదు. ఆలోచన మొదలు పెట్టేసరికి ఇంతలో కట్టెపుల్లలు

కొట్టుకురావలసి వస్తుంది. ఆ పని అయిన తర్వాత పొలానికి ఎరువు తోలుకుపోవాలి. ఎప్పుడూ ఏదో ఒక పనివుంటూనే వుంది. ఆ పనిలో మునిగి వుండగా ఆలోచనలన్నీ ఎప్పుడో ఎగిరిపోతాయి.''

"అయినా దీన్ని గురించి మనమేదో ఒకటి ఆలోచించాలి.''

''నేనుకూడా అదే అంటున్నాను.''

ఇప్పుడు ఆవులించడం కుచేల పుల్లయ్య వంతు. చిటికలు వేసుకొంటూ లేచి రేపటి చప్పిడికూడును తలుచుకొంటూ నిద్రపోతాడు.

మర్నాడు ప్రొద్దున నిద్రలేచేసరికి కుబేర పుల్లయ్య పావుసేరు మాంసం పంపించాడు.

మరుసటి శనివారం ఇరుగు పొరుగు ఇద్దరూ కలుసున్నారు. మళ్లా ఆపాతసంగతే ప్రస్తావించారు :

''కన్నుమూసినా తెరిచినా నాకొకటే ధ్యాస. పాపం నువ్వెంత పేదవాడివి అని. అలాచెపితే నీవు నమ్మవేమో కూడా'' అన్నాడు కుబేర పుల్లయ్య.

''మీరు చాలా దయగల మారాజులండి'' అన్నాడు కుచేల పుల్లయ్య.

''అసలు నా అభిప్రాయాలు ఈ సమాజానికి ఎంతో అమూల్యాలనుకో. అయినా నీవు అదనులో దుక్కిదున్నక పోతే అప్పుడప్పుడు నీలాగే నాకుకూడా తిండివుండదు. అంతే కాదూ ?''

"అది నిజమే అనుకోండి బాబుగారు. కాని అదనులో దున్నకపోతే ఆకలికి మొదట నీల్గిచచ్చేది నేను."

"నీవు చెప్పేదానిలో కూడా నిజముందోయ్. మన బ్రతుకులే దగాకోరు బ్రతుకులు. అయితే నేను దాన్ని ఒప్పుకోంటున్నాననుకునేవు. దేవునితోడు ! కుచేల పుల్లయ్య సుఖంగా బ్రతికేమార్గం ఏమిటా, నాతో అతడికికూడా సమానంగా వంతు ఎలావస్తుందా అని ఒకటే ఆలోచన. ఇందుకునే నేం చేయాలి అని ఒకటే మధన."

"తమరు చాలా దయగలవారండి బాబుగారు. తమరు దయచూపించకపోతే కిందటి ఆదివారం పచ్చిపులుసు మెతుకులే గతయ్యేవి నాకు."

"అదేముంది. ఆ విషయం పదేపదే చెప్పకు. ఆ సంగతి మరిచిపో. ఇంతకీ నేను చెప్పవచ్చేదేమిటంటే : నా సంపదలో సగం పేదలకిచ్చేయాలని నే నెన్నిసార్లనుకోలేదు. నిజంగా అలా చేశానుకూడా. కాని ఏం జరుగుతున్నదో తెలుసా ? ఈవేళ సగం సంపద ఇచ్చేశాననుకో; రేపు నిద్రలేచే సరికల్లా నే నిచ్చిన సగానికిబదులు ముప్పాతిక తిరిగివస్తోంది."

"అంటే వడ్డీతోసహా నన్నమాట."

"ఏం చెయ్యను మరి ? ఎప్పుడూ డబ్బును వదిలించుకోందామనే నా తాపత్రయం. కాని అది మాత్రం నన్ను వదలడంలేదు. నేను పేదలకు రెండు పైసలిస్తాను. వాటికి మారుగా మూడు పైసలు నాకు తిరిగి వస్తున్నాయి. ఎలా వస్తున్నాయో ఆ పరమాత్మునికే తెలియాలి. ఎంత చిత్రమో చూశావా ?"

ఆపులింతలు వచ్చేదాకా వారిదే ధోరణిలో కబుర్లు సాగించారు. అలా ఒక మూల మాట్లాడుతూ వుండగానే శేషు కుచేల పుల్లయ్య కూటిలోకి మాంసంవెళ్లే ఉపాయాన్ని గురించి కుబేర పుల్లయ్య ఆలోచిస్తూనే వున్నాడు.

"ఇదుగో విను నేస్తం. ఇక పొద్దుకూకుతుంది. అలా మా కోటలోకివచ్చి కాస్త రెండు మళ్లు తవ్వి పెడుదూ. ఎంతసేపూ, రెండుపారలు వేశావంటే అయిపోతుంది. నీవు నిజంగా కాయకష్టం చేసినట్లే నిన్ను సంతోష పెడతాను."

కుచేల పుల్లయ్య గంటో ఎంతో శ్రమపడ్డాడు. "నిజంగా కాయకష్టం" చేసినట్లే మర్నాడు మాంసంకూర రుచిచూశాడు.

ఇలాగ ఈ ఇరుగు పొరుగునేస్తాలు కబుర్లు చెప్పుకోగా చెప్పుకోగా కొంసకు కుబేరపుల్లయ్యకు విసుగెత్తి పోయింది. ఇంక ఇది భరించలేకపోయాడు. ఒకరోజున "నేను పెద్ద గవర్నరుగారిదగ్గరకు వెళతాను. వెళ్ళి కాళ్ళమీద పడతాను. పడి మహాప్రభో తమరు చక్రవర్తికి పినుల్లాంటివారు. నేత్రా ల్లాంటివారు. నిగ్రహానుగ్రహ సమర్థులు. నన్నూ, కుచేల పుల్లయ్యనూ సమానుల్ని చేయండి! అతగాణ్ణి సేవకు వినియో గిస్తే నన్నూ వినియోగించండి. అతగాని వంతు కొకబండి అంటే నావంతుకు ఒక్క-బండే నిరకు చేయించండి. అతగాడు ఎకరానికి పైసా పన్నుకడితే నేనూ అంతేకడతాను! అను గ్రహించండి అని మొరపెడతాను " అన్నాడు.

అనడమే తరవాయి. అన్నంతా చేశాడు. కుబేర పుల్లయ్య పెద్దగవర్నరుగారి పాదాలు పట్టుకోవాన్నాడు. తన

కష్టాలన్నీ ఒలకబోసుకొన్నాడు. పెద్దగవర్నరు అతడిని ఎంతో మెచ్చుకొన్నాడు.

"ఎంత ఉత్తముడివి! నీ పొరుగునున్న కుచేల పుల్లయ్యను మరిచిపోలేదు. ధన్యుడవోయ్. సార్వభౌముని ఏలుబడిలో ప్రజలంతా చేదోడువాదోడుగా బ్రతుకుతున్నారంటే అంతకన్న మాకు ఆనందకరమైన దేముంది? కీచులాటలూ, కలహాలతో కాలక్షేపంచేస్తే అంతకన్న హాని మరొకటుందా?"

అలా అని గవర్నరు చట్టం విషయంలోనూ, పన్నుల విషయంలోనూ ఇద్దరు పుల్లయ్యలను సమానంగా చూడవలసిందని తన అమల్దారులకు ఆదేశించాడు. ఇలా కొంతకాలం పరీక్షించి చూస్తామన్నాడు. ఒకరు దంచుతూవుంటే మరొకరు పక్కలెగరవేయడం ఇకమీదట చెల్లదన్నాడు.

అక్కడనుంచి ఆఘమేఘాలమీద ఇంటికి చేరుకొన్నాడు కుబేర పుల్లయ్య.

కుచేల పుల్లయ్యనుచూసి "పెద్దబరువు దిగిపోయిందోయ్" అన్నాడు.

"గవర్నరుగారు దయగల ప్రభువు. పన్నులు, సుంకాలు, శిస్తులు, ఒకటేమిటి సర్వ విషయాల్లోనూ నిన్నూ నన్నూ ఏకంచేశారు. ఈ పద్ధతిని కొంతకాలం పరీక్షించి చూస్తామన్నారు. నిన్ను సేవకు పిలిస్తే నేనుకూడా సేవకు వస్తాను. నీ వాటా ఒక బండి తెస్తే నేను కూడా ఒకబండి తెస్తాను. నీవు ఎకరానికి పైసా పన్నుకడితే నేనూ అంతే

చేస్తాను. నిన్నూ నన్నూ సమానం చేయడంవల్ల వారాని కొకరోజేంకర్మం ప్రతిరోజూ నీవు మాంసం తింటావు."

ఇలా చెప్పి కుబేర పుల్లయ్య సద్భావం పొంగులు వారుతూ వుండగా విదేశయాత్రకు బయలుదేరాడు. రెండేళ్ల పాటు విదేశాలలో తిరిగి తీరికను సద్వినియోగం చేశాడు.

లింబర్గువెళ్లి లింబర్గు కోవా రుచిచూశాడు. స్ట్రాస్‌బర్గ్ వెళ్లి కూరలు చవిచూశాడు. బోర్డో వెళ్లి సారాయి చవి చూశాడు. కొసకు పారిస్ చేరుకొని అన్నీ తిన్నాడు. అన్నీ తాగాడు. అక్కడ కాలం ఎంత కులాసాగా గడిచిందంటే కాలునిలవడమే కష్టమయిందనుకోండి. ఎక్కడికి వెళ్లినా ఏంచేసినాకుచేల పుల్లయ్యను గురించిఆలోచనమాత్రం మాన లేదు. ఇద్దరూ అప్పుడు అన్నివిషయాల్లోనూ సమానులే కనుక కుచేల పుల్లయ్య మనసుతీరా తిని తాగి హాయిగా ఆనందంగా కాలక్షేపంచేస్తూ వుండి వుంటాడు!

ఇక్కడ కుచేల పుల్లయ్యకు కానికాలం వచ్చింది. ఈ వేళ ఆ చిన్నమడి చెక్కను దున్నుకోవాలి. రేపు గొర్రు తోలాలి, ఆ తర్వాత గట్లు పెట్టుకోవాలి. దేవుడు చల్లగా చూస్తే గింజలు నూర్చుకోవాలి. ఇక సారాపాక సంగతి. కుచేల పుల్లయ్య దాని దారెటోకూడా మరిచిపోయాడు. సారాసాక తనపాలిటి మిత్తి అని అతనికి తెలుసును. భార్య పుల్లమ్మకూడా పొలంపనిలో కట్టెపుల్లలు కొట్టడంలో మగనికి చేదోడువాదోడుగా వుంటోంది. ఇప్పుడు వారి బిడ్డలుకూడా పెద్దవారయ్యారు. అందుకని వారుకూడా పనిలో ఒకచెయ్యి వేస్తున్నారు. అలా ఆ కుటుంబమంతా కోడి కూసింది మొదలు

పొద్దుకూ కేవరకూ రెక్క లరగదీస్తున్నారు. అయినా ఉప్పులేని చప్పనిగంజే వారికి గతి. కుబేర పుల్లయ్య వెళ్ళిననాటినుంచీ ఆదివారాల్లో అడపాదడపా వచ్చే ఆ మాంసంకూడా ఇప్పుడు లేదు.

"ఇది మన దురదృష్టం. దొరతనంవారు పరీక్షించి చూడ్డంకోసం నన్ను కూడా కుబేర పుల్లయ్యతో అన్ని విధాలా సమానుణ్ణి చేశారు. అయినా మార్పేమీ లేదు. ఒకరు ఇంకా శ్రీమంతుడే. నేనో ? నాది అని చెప్పుకోడానికి ఒక పుల్లముక్కకూడా లేదు" అని కుచేల పుల్లయ్య భార్యతో అన్నాడు.

కుబేర పుల్లయ్య తిరిగివచ్చిచూచి నిశ్చేష్టుడయ్యాడు. కుచేల పుల్లయ్య పూర్వంలాగే పేదరికంతో పెనుగులాడుతున్నాడు. చెప్పొద్దూ ఈ పుల్లిగాడు డబ్బంతా సారాపాకకు పోశాడని మొదట కుబేర పుల్లయ్య అనుకొన్నాడు. "నిజంగా అంత తాగుబోతా ? ఇంక బాగుపడ్డం సాధ్యమే కాదా ?" అని ఆలోచనలో పడిపోయాడు కుబేర పుల్లయ్య. కాని ఏపాపము ఎరగనని చెప్పి బైటపడ్డానికి కుచేల పుల్లయ్య ఎక్కువ కష్టపడ నక్కరలేకపోయింది. సారామాట దేవుని కెరుక ఉప్పుకూడా కొనలేకపోయాడు. కుచేల పుల్లయ్య ఒక్క పొదుపరేకాదు కష్టించి పనిచేసేవాడనికూడా చెప్పడానికి తగినన్ని సాక్ష్యాధారాలున్నాయి. తన వ్యవసాయ పనిముట్లనీ, వున్న నిల్వనీ చూపించాడు. అన్నీ యథాక్రమంగా వున్నాయి. కుబేర పుల్లయ్య విదేశ యాత్రకు వెళ్ళడానికి పూర్వం ఏవి ఎలా వున్నాయో అవన్నీ ఇప్పటికీఅలాగ నేవున్నాయి. కుంకెడ్లజత,

జోడావు, ఒకగొర్రె, బండి, నాగలి, గొర్రు. కొసకు దంప నాగలికూడా గోడకు చేరపెట్టివుంది. మళ్ళీ ఊడ్పులదాకా దాని అవసరంవుండదుకదా అని సారాపాకలో కుదువపెట్టినా వ్యవసాయాని కిబ్బంది వచ్చేదికాదు. కుబేర పుల్లయ్య గుడిసె లోకివచ్చి చూశాడు. అక్కడకూడా అన్నీ ఎక్కడి వక్కడ వున్నాయి. పైకప్పు గడ్డిమాత్రం అక్కడక్కడ ఊడదీసిన మొర్రె లున్నాయి. గడ్డికరువైనప్పుడు పాకమీది గడ్డిపీకి పశువులకు వేయవలసి వచ్చింది.

కుచేల పుల్లయ్య విచ్చలవిడిగా తిరిగాడనికాని, ఒళ్లు తెలియకుండా ఖర్చుపెట్టాడనికాని చెప్పడానికి తగిన ఆధారా లేవీలేవు. అతడు నేలతల్లి బిడ్డడు. పేదరైతు, ప్రతికే హక్కును సంపాదించడంకోసం రెక్కలు ముక్కలు చేసు కొంటున్నాడు కాని ఫలితం అంతగానే వుంటోంది.

"ఓయి దేవుడా! ఏమిటి దీని అర్థం?" అని విస్తు పోయాడు కుబేర పుల్లయ్య.

"ఇదిగో మనిద్దరమూ అన్ని విషయాల్లోనూ సమా నులం. ఇద్దరికీ సమానమైన హక్కులే వున్నాయి. ఇద్దరమూ ఒకలాగే పన్నులు చెల్లిస్తున్నాం. అయినా నీకేమీ మేలు కలగడంలేదు. దీనికి కారణమేమిటి? అంతా చిత్రంగావుంది!"

"నిజమేనండి. అప్పుడప్పుడు నేనుకూడా ఆశ్చర్య పడుతూ వుంటాను!" అన్నాడు కుచేల పుల్లయ్య దిగులుగా.

తర్వాత కుబేర పుల్లయ్య బుర్రను బాగా రాపా డించాడు. కీలకం దొరికిపోయింది.

"ఇంతకీ వచ్చిన చిక్కల్లా మనకు ప్రభుత్వ ఆదరణా లేదు ప్రజాదరణా లేదు. నాకేంపట్టిం దన్నట్లుగావుంది సంఘం. ప్రతివాడూ తన పనుల్లోనే మునిగి తేలుతున్నాడు. ప్రభుత్వం ఏదైనా ప్రారంభిస్తే అది ఎక్కడ వేసిన గొంగళి అక్కడేగావుంది. అందుకని ఈ సంఘంలో కొంత చైతన్యం కలిగించడం అవసరం" అనుకొన్నాడు కుబేర పుల్లయ్య.

అనుకొన్న తక్షణం కుబేర పుల్లయ్య ఒక సమావేశం జరిపించాడు. గ్రామస్తులంతా చూస్తూవుండగా ప్రభుత్వా దరణ, ప్రజాదరణలవల్ల కలిగే లాభాలను గురించి గొప్పగా ఉపన్యసించాడు. పందులమీద పన్నీటిజల్లులాగ ముత్యాల జడిలాగ చాలాసేపు సూక్తులను విరజిమ్మాడు. తమ అవసరా లను నెరవేర్చుకొనగలిగిన సంఘాలే గొప్ప సంఘాలు అని అనేకోదాహరణలతో నిరూపించాడు. అలాకాక ఏవో పరి స్థితులు పరిపక్వం కావాలి, వాటంతటఅవి రావాలి అని ఎదురుచూసే సంఘాలు క్రమంగా క్షీణించి నశిస్తాయని హెచ్చరించాడు. అణాకానీ బాలశిక్షలోంచి తాను పిండిన విజ్ఞానాన్నంతనీ అక్కడికక్కడ ఒలకబోశాడు.

అనుకొన్న దానికన్నా అద్భుతమైన ఫలితాలు కలి గాయి. గ్రామీణులకు తలకడుక్కొన్నట్లయింది. అంతేకాదు. వారిలో మమకారభావంకూడా పొటమరించింది. ఇన్ని రకాల భావాలతో వారింతకుముందెన్నడూ ఉక్కిరి బిక్కిరి కాలేదు. ఎన్నడో రావలసిన జీవనతరంగం ఏ కారణంవల్లనో మధ్యలో ఆగిపోయి ఇప్పుడు హఠాత్తుగా ఈ అజ్ఞాన ప్రజా నీకాన్ని ఆకాశానికి ఎత్తి నట్లనిపించింది. ప్రజలు సంతో

పించారు. తమకు వెలుగు చూపినందుకు ఆనందించారు. కుబేర పుల్లయ్య గొప్ప వీరుడని పొగిడారు. కొసకు వారంతా (అ) సారాపాకను శాశ్వతంగా మూసివేయాలనీ, (ఆ) పైసా పరపతి సంఘాన్ని స్థాపించి ఒకరి కొకరు చేదోడు వాదోడుగా వుండే పద్ధతిని ప్రవేశ పెట్టాలనీ ఏకగ్రీవంగా తీర్మానించారు.

ఆ రోజునే సంఘానికి తొలివిరాళం వచ్చింది. అది మొత్తం రెండువేల ఇరవై మూడు పైసలు. గ్రామంలో వున్న వారంతా తలొక పైసా వేసుకొన్నారు. కుబేరపుల్లయ్య గారు నూరు అణాకానీ బాలశిక్షలను సంఘానికి దానం చేశారు.

"మీకు కావలసిన విజ్ఞానమంతా అందులో వుంది. చదవండి" అని గ్రామస్తులకు చెప్పాడు.

కుబేర పుల్లయ్య మరొకసారి విదేశ యాత్రకు వెళ్ళాడు. అతడి ప్రతిద్వంది ఇంటివద్దనేవుండి రెక్క లరగదీస్తున్నాడు. కొత్తగా ఏర్పడిన పరస్పర సహకార పద్ధతివల్లా, అణాకానీ బాలశిక్ష ఇచ్చే సలహావల్లా ఈసారి మంచిఫలితాలు కలుగుతా యనడంలో సందేహం లేదు.

ఒక ఏడు గడిచింది. మరొక ఏడు గడిచింది. కుబేర పుల్లయ్య లింబర్గ్, స్ట్రాస్ బర్గ్ మున్నగుచోట్ల భోజనాలతో గడిపాడో లేదో చెప్పలేం. కాని రెండేళ్ళ తర్వాత ఆయన ఇంటికి తిరిగివచ్చాడు. వచ్చి నిలువునా కొయ్య అయిపోయా డంటే నమ్మండి.

కుచేల పుల్లయ్య ఎముకలగూడులా వున్నాడు. తిన డానికి ఇంతసంకటి ముందుపెట్టుకొన్నాడు ఆనాడు ఆదివారం

కాబట్టి కుచేల పుల్లమ్మ దానిలో ఇంతనూ నెబొట్టు విదిల్చింది. పిల్లలు చుట్టూకూర్చుని తమవంతు ముద్దల్ని ఎవరో లాక్కొంటారన్నంత ఆతురతతో నోట్లో కుక్కుకొంటున్నారు.

"ఎందుకిలా జరుగుతోంది?" అని చింతామగ్న స్వరంతో ప్రశ్నించాడు కుబేర పుల్లయ్య.

"నేనూ అదే అంటున్నాను. ఎందుకిలా జరుగుతోంది అని!"

కుబేర పుల్లయ్య ఇంటి అరుగుమీద శనివారం సాయంత్రాలు మళ్ల బాతాఖానీలు సాగుతున్నాయి. ఈ సమస్యను గురించి ఇద్దరు మిత్రులూ ఎంత దీర్ఘంగా ఆలోచించినప్పటికీ ఫలితం కలగడంలేదు. "అసలు మనకింకా తగినంత ప్రాజ్ఞత రాలేదేమో" అని కుబేర పుల్లయ్య ముందు అన్నాడు. కాని కాస్త ఆలోచించిన మీదట పోళీలు తినడానికి ప్రత్యేకం చదువుకోనక్కర లేదని ఒప్పుకొన్నాడు. అసలు ఈ సమస్య మూలానికిపోయి ఆలోచించాలని చాలాసార్లు అనుకొన్నాడు. కాని మొదటి ప్రయత్నంలో బూచులు వచ్చి దడిపించాయి. అందుకని సమస్యలోతుకు వెళ్ళరాదని అప్పుడు ఒట్టుపెట్టుకొన్నాడు. కొసకిద్దరు మిత్రులూ ఆఖరి యత్నంగా ఊరయోగి అయిన పిచ్చి పుల్లయ్య ఉపదేశం విందామని నిర్ణయించుకొన్నారు.

పిచ్చిపుల్లయ్య ఆ ప్రాంతాలవాడే. దొడ్డికాళ్ళు, గూని. అందుకని పనిపాటలకు పనికిరాడు. అడుక్కుతిని కాలక్షేపం చేస్తున్నాడు. గ్రామంలోమాత్రం పురోహితుని

కన్నా చాలా తెలివైనవాడనే ప్రతీతి వుంది. ఆ ప్రతీతిని పుల్లయ్య నిలబెట్టుకొంటున్నాడు.

పుల్లయ్యకన్నా బాగా ప్రశ్న లెవరు చెప్పగలరు? శకునా లెవరు చూడగలరు? పిచ్చిపుల్లయ్య "అగ్గి" అని అరుస్తేచాలు. ఎవరికొంపమీదో ఎర్రకోడిపుంజు ఎగిరిపడిందన్నమాటే. పిచ్చిపుల్లయ్య 'వడగళ్ళు! వడగళ్ళు!' అంటే చాలును దోసకాయలంత వడగళ్ళు రాలుతాయి. ఆ దెబ్బకు పశువుల మందలు కాళ్ళు విరగదన్నుకొంటాయి. పిచ్చిపుల్లయ్యంటే అందరికీ భయం. ఎవరి గుమ్మం ముందైనా పిచ్చిపుల్లయ్య కర్రచప్పుడు వినిపిస్తేచాలును. ఇల్లాళ్ళు ఎక్కడి పను లక్కడే విడిచిపెట్టి కలిగినదాంట్లో మంచికబళం పెట్టడానికి పరుగెత్తుతారు.

ఈ సారికూడా పిచ్చిపుల్లయ్య జ్ఞాని అన్న పేరును నిలబెట్టుకొన్నాడు. కుబేర పుల్లయ్య విషయమంతా చెప్పి "ఇలా ఎందుకు జరుగుతోంది?" అని ప్రశ్న వేశాడోలేదో పిచ్చిపుల్లయ్య వెంటనే జవాబు చెప్పేశాడు:

"నీకు అలా రాసిపెట్టివుంది."

కుచేల పుల్లయ్యకు దాని అర్థం వెంటనే తెలిసిపోయింది. నిరాశగా తలపంకించాడు. కాని కుబేర పుల్లయ్య మాత్రం నిజంగానే ఇరుకునపడ్డట్టు ఇదయ్యాడు.

పిచ్చిపుల్లయ్య తన తెలివికి, తన జ్ఞానానికి తానే మురిసిపోతూ మొదలుపెట్టాడు.

"ప్రతివారూ కర్మఫలాన్ని అనుభవించక తప్పదు. నుదుటిరాత నెవరూ తప్పించుకొనలేరు. కుచేల పుల్లయ్య

కూలిపోతున్న గుడిసెలో ఊరిబైట కాపురముంటున్నాడు. గుడిసెకు తలుపుల్లేవు. పై కప్పునిండా కన్నాలే. అందుకని లక్ష్మి అక్కడ ఎలా నిలుస్తుంది? కుబేర పుల్లయ్య ఇల్లు కోట లాంటిది. నలుమూలలనుంచీ లక్ష్మి అక్కడికే ప్రవహిస్తుంది. ఇల్లు కోటలాంటిది దవడంవల్ల లక్ష్మికదలదు. ధనం నిన్ను వది లించుకోగలదేమోకాని నీవు ధనాన్ని వదిలించుకోలేవు. ఈ రోజున నీవు సగంసంపదను ఇచ్చేస్తే మర్నాడు మూడు వంతులు తిరిగివస్తుంది. నీవు ఎక్కడికివెళ్ళినా లక్ష్మి నీమీద పడుతుంది. అందుకని కర్మపరిపక్వం అయేవరకూ నీవెంత బుర్రబద్దలు కొట్టుకొన్నా ఈ సమస్య తెగదు."





# కుందేలు హేతువాదం

ఆ కుందేలు సామాన్యమైనదే కాని చాలా తెలివి గలది. దాని హేతువాదం గాడిదనుకూడా మెప్పించ గలిగింది. ఏదో తుప్పలోదూరి కూర్చుని స్వగతానికి దిగుతుంది.

"ప్రతిజంతువుకూ కర్మఫలం వ్రాసివుంది. తోడేలు, సింహం, కుందేలు అన్నీ అంతే. ఇష్టంవున్నా లేకపోయినా కర్మానుభవం తప్పదు. అదలా అనుభవిస్తూ పోవాలి — అంతే. ఉదాహరణకు మా కుందేళ్ళనే చూడండి. ప్రతివారూ మమ్మల్ని కబళించేవారే. ఇది అన్యాయంలాగ కనిపిస్తుంది. కాని జాగ్రత్తగా ఆలోచించిచూస్తే అందులో అన్యాయం ఏమీ కనిపించదు. మమ్మల్ని కబళించే ప్రతివారికీ తాము చేస్తున్న పనేమిటో క్షుణ్ణంగా తెలుసును. ఇదేమిటి ఈ

అన్యాయం అని మేము అన్నప్పటికీ మమ్మల్ని కబళించడం ఎవరూ మానరు. ఏమయినప్పటికీ తనకు కావలసిన దాని కన్నా ఎక్కువ ఎవరూ తినరు. తక్కువకూడా తినరు. దేశీయ శాఖామంత్రిగారు ప్రకటించిన లెక్కల ప్రకారం......"

ఈ దశకు వచ్చేసరికి కుందేలు నిద్రపోతూవుంటుంది. లెక్కలపేరు చెపితే చాలును దానికి మగతకమ్ముతుంది. ఒక కునుకు తీసిన తర్వాత తిరిగి హేతువాదం మొదలు.

"మమ్మల్ని ఒక మూలనుంచి భక్షిస్తూ ఉన్నప్పటికీ కుందేళ్ళ సంఖ్యమాత్రం ఆయేటికాయేడు పెరుగుతూనే వుంది. మేం మాత్రం మూర్ఖులమా యేమిటి? ఎండైనా వానైనా అలా బయళ్ళల్లో గెంతుతూనేవుంటాం. పొలాల మీాదో, కూరగాయతోటలమీాదో విరుచుకొని పడుతూ వుంటాం. మేం మాత్రం రైతులను ముప్పతిప్పలు పెట్టడం లేదూ? మా కుందేళ్ళమీాద ఒక కన్నేసి వుంచాలి. ఆశ్చర్య మేం వుంది? దేశీయశాఖా మంత్రిగారు ప్రకటించిన లెక్కల ప్రకారం..."

మళ్ళీ నిద్ర. మళ్ళీ మెలకువ. మళ్ళీ కనివిని ఎరగ నంతటి గట్టి హేతువాదం. ఈ కార్యక్రమానికి అంతూ దరీ లేదు. కుందేలు తన మేధను మధించి దీన్ని గురించి ఆలో చిస్తుంది. దాన్నిగురించి చర్చిస్తుంది. ఫలితం ఒక ఉన్నతా దర్శం మూర్తీభవిస్తుంది. అంతకన్నా గొప్పసంగతి మరొక టుంది. ఈ మేధాశక్తితో ఏదో పైకిరావాలనే యావ దానికి లేదు. తన అమూల్యాభిప్రాయాలను అధికారులకు తెలియ పరచాలనే తపనకూడా లేదు. (తను నోరు మెదపకముందే

వారు చీల్చుకొని తినేస్తారని దానికి తెలుసును) ప్రతిదాని మీదా తన స్వంత కుందేటి అభిప్రాయాలేర్పరచుకోనడం దాని అభిమతం. నిజంగా కుందేళ్లెంత తెలివైనవి! అను కొంటూ వుంటుంది.

విలువ తక్కువగుటచేత
ఇత్తడి పుత్తడికన్నా
హీనమనుట పాడిగాదు
ఇది సత్యమురోరన్నా !

ఇలాగ ఒకరోజున తుప్పకింద కూర్చుని తన తెలివి నంతనీ ప్రియురాలిముందు చూపించాలని ఆలోచన చేసింది. వెనకకాళ్ళమీద నిలబడి చెవులు రిక్కించింది. ముందరి కాళ్లతో ఒకసారి మూతి తుడుచుకొని బాణంలా దూసుకు పోయింది.

"కుందేళ్ళు తలుచుకొంటే చాలా చక్కగా బ్రతక గలవు. పెళ్ళి వేడుకలు చేసుకొంటాం. నాట్యాలు చేస్తాం. పండుగలువస్తే సారా కాచుకొంటాం. కోసులకు కోసులు కావలిపెడతాం. గొంతువిప్పి హాయిగా పాడుతాం. తోడేళ్లు మాపాటను వింటాయి. విని చూడ్డానికి వస్తాయి. ఏమిటోయ్ పాడుతున్నారు? అని అడుగుతాయి. అప్పుడు ఎవరికివారు అందినదారి పట్టుకొని పరుగెత్తుతాం. తప్పించుకొనగలిగామా సరేసరి. మరొకచోట సారా కాచుకొనవచ్చును. లేదా తోడేలుకు ఫలహారం అవుతాం. కుందేళ్ళగీత అంతేకద అంతేనా శ్రీమతీ?"

"నీవు చెప్పినదానిలో అబద్ధం లేకపోతే అంతే" అని ఆచిఆచి తూచితూచి చెప్పింది కుందేటిసాని. వ్యక్తురాలైన తర్వాత దానికిది పదవ భర్త. పూర్వపు తొమ్మండుగురు భర్తలూ తన కళ్ళముందరే దారుణంగా మృత్యువువాత పడ్డారు.

"ఆ తోడేళ్లున్నాయే అవి శుద్ధరౌడీసజ్జు. కొట్టుకు తిండంతప్ప వాటి కింకొక పనిలేదు. దీనిమీద ఎన్ని ఉప న్యాసాలివ్వచ్చునని? ఎన్నిసార్లు పత్రికలకు వ్రాశానని? గౌరవ నీయులైన అయ్యలారా! కుందేళ్ళను నిలువునా చంపడం కన్న వాటి చర్మంవలిచి తీసుకొనరాదా? కొంత కాలానికి ఆ కుందేలు మీకు మరొక చర్మాన్ని సమర్పించుకొన గలుగు తుందే!

కుందేళ్ళజనాభా త్వరగా పెరుగుతుంది. కాని మీ రీ వేళ ఒక మందనీ, రేపొక మందనీ చంపివేశా రనుకోండి. అప్పుడు అంగడి ధరలు ఆకాశాని కెక్కుతాయి. అలాకాక మీరు పెద్దమనుషులుగా వచ్చివుంటే ఇంకా బాగుంటుంది, 'అయ్యా నేటి భోజనానికి ఇన్ని డజన్ల కుందేళ్లను అప్ప జెప్పండి' అని మీ రంటే మహాసంతోషం అని మేమంటాం. ఏమోయి దళవాయీ ఆ మందకు కబురుపెట్టు అని ఏర్పాటు చేస్తాం. అప్పుడన్నీ సజావుగా, హుందాగా, చట్టబద్ధంగా వుంటాయి. మీ తోడేళ్లకీ, మా కుందేళ్లక అందరికీ సంతృప్తి కరంగా వుంటుంది. కనీసం ఆశఅయినా మిగిలి వుంటుంది. అవును మీరూ మేమూ – మేమూ మీరూ – ఇదీ అదీ, వారూ......"

ఇలాగ కుందేలు ఇంకా ఎంతకాలం మాట్లాడేదో తెలియదు కాని హఠాత్తుగా పక్కనున్న పచ్చగడ్డిలో ఏదో అలికిడైంది. కుందేలు చెవులు రిక్కించింది. హేభగవాన్ తన భార్య ఏనాడో పారిపోయింది. అక్కడ పచ్చగడ్డిమీద ఒక ముసిలినక్క పొంచి పొంచి చూస్తూ తనవైపే వస్తోంది. చూసేవారికి అది ఏదో ఆట ఆడుతున్నట్లు...

"ఓహోహో! ఎంత తెలివైన వాడివోయి కుందేలూ! నీమాటలు వినడానికి మహా ముచ్చటగా వుందోయ్. యుగాలుయుగాలు నీ మాటలు విన్నా ఇంకా తనివితీర దోయ్" అందినక్క.

మన కుందేలు మెలకువగలదే. కాని ఆ క్షణాన ఎటూ తోచక ప్రమాన్పడిపోయింది. అప్పుడు దాని మనసులో ఏ ముందో మనకు తెలియదు. ఎటునుంచి పారిపోదామా అని ఆలోచిస్తున్నదో లేక మొదటిసారిగా ఇలాంటి పరిస్థితి వచ్చింది కనుక ఆత్మావలోకనం చేసుకొంటున్నదో చెప్పలేం.

సరే ధైర్యాన్ని కూడదీసుకొని "నక్కమ్మగారు ఆకలితో వున్నట్లున్నారు?" అని అడిగింది.

"నీ అమ్మకడుపు చల్లగా నే నిప్పుడే పసందైన ఫలహారం చేసి వచ్చాను. ముం దేమవుతుందో తెలియదుకాని ప్రస్తుతానికి ఆకలిలేదు. సరేకాని ప్రపంచం ఏమంటున్న దోయ్ కుందేలూ!"

తాను వెనక కాళ్ళమీద కూర్చుని కుందేలునికూడా కూర్చొనమని పురమాయించింది. కుందేలు కాళ్లుముడుచు

కొని కూర్చొంది. అలా కూర్చుంకూడా మనసులో స్వగతం మానలేదు.

"అదే. సరీగా నే ననుకొన్నట్లే అయింది. ప్రతిదానికీ కర్మఫలం వ్రాసివుంది. సింహం, తోడేలు, కుందేలు అన్నీ అంతే. ఓకుందేలు కర్మఫలమా ఈగండాన్ని గడిపించలేవా?"

కుందేలు మనసులోనిమాట నక్క కు తెలిసినట్లుంది. మన హేతువాదిని పొగడడం మొదలుపెట్టింది.

"ఎవరి భాగ్యాన్ని పండించడానికి ఈ ప్రాంతాలకు వచ్చారు స్వామీ?"

"మా ప్రాంతం ఇక్కడికి ముప్పదికోసు లావలవుంది. అది చాలాదూరంకిందే లెక్క కాని నా వేగానికదొకదూరం కాదు. ఇంటికి పోవలసిన తొందర పనులున్నాయని చెప్పడం లేదుకాని పోకతప్పదు. అక్కడ నాకూ ఒక సంసారంవుందామె మరి. చలికాలం అంతా ఒకదొరగారి ఖాళీ గోశాలలో గడిపాం. పగలంతా నిద్ర. రాత్రి. అంతా ఈ మొక్కలు కొరకి ఆకాయలు కొరకడంతో కాలంహాయిగానే గడిచింది. ఇంతలో వసంతం వచ్చింది. వేసంగి సెలవలకు అడవికిపోదామని సరంజామా చేసుకొన్నాం. సరీగా అదే సమయానికి ఒక తోడేలు ఆ గోశాలకు వేంచేసింది. 'ఏం చేస్తున్నావోయ్ కుందేలూ ఇక్కడ? ఏదీ నీ పర్మిటు?' అని అడిగింది. నే నెలాగో తప్పించుకొన్నాను. కాని మా ఆవిడా పిల్లలూ..."

"ఆ కథంతా విన్నాను. ఆ తోడేలు మా చుట్టమే తెలిసిందా? ఇందులో ఆశ్చర్యపడవలసిన దేమీ లేదు. 'మొన్న ఒక కుందేలు కుటుంబాన్ని వేటాడానోయ్. కాని

పెద్దకుందేలు తప్పించుకొని పోయింది. దాని జాడ నీ కేమైనా తెలుసునా ?' అని నన్నడిగింది. ఇదుగో ఇక్కడ నువ్వు కని పించావు. మీ ఆవిడమీద మనేది పట్టుకొం దనుకొంటాను ఏం ?"

"అబ్బే అదంతా ఏనాడో మరిచిపోయాను. అక్కడ నుంచి వెళ్లిపోవలసిన తరుణం వచ్చిందనుకొన్నాను. అంతే ఇక్కడికి వచ్చాను. రాగానే ఒంటరిగావున్న ఒక యువ వితంతువు కనిపించింది. 'ఏం కలిసివుందామా ?' అన్నాను. కలిసి పోయాం. పేచీపూచీలూ, కీచులాటలూ ఏమీ లేవు. ఇప్పుడే ఆవిడ చెక్కేసింది. నే నిక్కడే దిగడిపోయాను."

"పాపం ! ఫర్వాలేదులే. ఆవిడనుకూడా త్వరలోనే వెతుకుదాం."

నక్క ఒకసారి ఆవులించి కుందేలు వెనక కాళ్లను గీరింది (ఈ సంగతి తనకు తెలియనట్లే నటించింది కుందేలు.) తర్వాత ఒత్తిగిలింది. మెడ వెనుకకువంచి కన్నులరమోడ్చింది.

"ఈవేళ పొద్దు సరిగా పొడిచిందికదూ. వ్యవహార మంటే వ్యవహారమే మరి. వింటున్నావా కుందేలూ! నే నొక కునుకుతీస్తాను. నీవు కబుర్లు చెపుతూవుండు" అని మధ్య మధ్య ఆవులిస్తూ చెప్పింది నక్క.

నక్క చెప్పినట్లే జరిగింది. నక్క కునుకుపాట్లు పడుతూ వుంటే దానికి అందుబాటులో కూర్చుని కుందేలు కబుర్లు సాగించింది.

"మీామీద ఉప్పనిమాటలూ చప్పనిమాటలూ చెప్పే బాపతుకానండి నేను నక్కమ్మగారూ ! పూర్ణాయువు పోసు

కోవాలని నా కోరిక. నా కింకా మూడేళ్ళు నిండలేదు. అయినా దేశంలో సగం తిరిగి చూశాను. ఏమో ఏనాటికి ఏతోడేలు ఎదురౌతుందో, ఏ పెద్దపులుగు మీదపడుతుందో, ఏ వేటగాడు వెంటపడతాడో అని ముందు దేశం తిరిగి చూశాను. ఎక్కడో దూరాన ఇల్లూ సంసారంఅంటూ ఏర్పరచుకోవాలికదా. ఇంతకీ నేను ఎవరినీ నిందించడంలేదు. మా కుందేళ్ళ నుదుటిరాత ఏమిటో నాకు తెలుసును. కర్మసంగతి తెలియని రోజుల్లోకూడా గుండెలు కవుక్కొంటూ పరుగులు పెట్టక తప్పలేదు. ఇప్పుడు తెలుసుకొన్న తర్వాత కూడా మా ప్రాంతాల్లో అంతే. సరే ఇంక నడుం వాలుద్దా మనుకొంటూ ఉండేసరికి తలుపు చప్పుడవుతుంది. 'ఎల్లయ మామా బండితోలుకు రమ్మంటున్నారు' అని పిలుపు. బైట గాలివానవున్నా తుపానువున్నా, ఎద్దు సగం చచ్చివున్నా అంతే. ఏంచేయగలం? బండినిండా సిపాయోళ్ల నెక్కించు కొని ఆ వానలో బక్క ఎద్దును లాక్కుంటూ పాతిక కోసులు ప్రయాణం చేయాలి. ఇంటిమొహం పట్టేసరికి వారంరోజులు పడుతుంది. పిల్లలకు పిడికెడు పప్పులు, పెళ్లానికి ఒక రెవికల గుడ్డా అందరికీ కన్నీళ్ళు! అలాంటివాణ్ణి పిలిచి ప్రపంచం కబుర్లడగండి. రైతులకర్మ ఇంతేనంటాడు. మా కుందేళ్ల కర్మకూడా అంతే. ఏదో తోచినట్లు బ్రతుకుతూ వుంటాం. మా వాళ్ళను మేమెన్నడూ ముంచం. కాని సర్వదా మేం — ఏమంటారు నక్కమ్మగారూ?"

బాగా నిద్రలో వున్నట్లు నక్క గుర్రుమని ఊగొట్టింది. నక్క నిజంగా నిద్రపోయిందో లేదో నని కుందేలు ఓరగం

టితో చూసింది. పారిపోదామని ఆలోచిస్తున్నదా? ఏమో చెప్పలేము కాని, కుందేలు జీవిత కార్యక్రమంలో ఇంలాటి విధానానికి కూడా తావులేకపోలేదు. కాని నక్క మూసిన కన్ను తెరవకుండానే వెల్లకిలా తిరిగి కాళ్ళు బారజాపింది. దొంగముండ! నాటక మాడుతోందని కుందేలు తెలుసుకొంది!

"మా మామయ్య ఒక సిపాయిదగ్గర కొలువు చేశాడు. ఎలాగో తెలుసునా? మామయ్య అప్పుడు చాలా చిన్నవాడు. సిపాయి ఉచ్చుపన్ని పట్టుకొన్నాడు. మామయ్యకు సిపాయి విద్యలన్నీ నేర్పాడు. తుపాకి పేల్చడంలో డోలు వాయించడంలో ఆనాడు మా మామయ్యకు సాటి వచ్చేవారే లేరు.

"దేశమంతా తిరిగి తీర్థాలలో తిరునాళ్ళలో విద్యలు చూపి కానీ దమ్మిడీ పిడికెడు బియ్యం సంపాదిస్తూవుండేవారు. ఆటల్లేనప్పుడు ఆ సిపాయి తన కథని మా మామయ్యకు చెప్పేవాడు. 'నేను మా అమ్మా నాన్నదగ్గరే వుండేవాణ్ణి. ఒకసారి మా నాన్న బండిని బాగుచేయమని చెప్పాడు. నేను చుట్ట కాల్చుకొంటూ కూనిరాగాలుతీస్తూ పనిలో పడ్డాను. అప్పుడు తలారి వచ్చి అబ్బాయి! నిన్ను మునసబుగారు పిలుస్తున్నారు. ఇప్పుడు పటాలంలో చేరడం నీవంతు' అని చెప్పాడు. నేను అక్కణ్ణుంచి అటే దారిపట్టాను. అప్పటి నుంచీ *ఇరవై ఏళ్ళు పటాలంలో పనిచేశాను. నేనింటికి తిరిగి

---

*ఒకప్పుడు రష్యాలో రైతుల్ని పటాలంలో బలవంతాన చేర్చుకొని ఇరవై ఏళ్ళవరకు పనిచేయించేవారు. పటాలంలోంచి పారిపోకుండా అరదండాలుకూడా తగిలించేవారు.

వచ్చేసరికి అక్కడేంవుంది బూడిద ? అని చెప్పాడా సిపాయి. రైతులగతి అంతే. ఇవాళ రైతు. రేపు సిపాయి. మాకుందేళ్ల బ్రతుకు కూడా అంతే.

'ఏమిటీ ? నిన్ను కూడా పటాలంలోకి పిలిచారంటావా?' అని అప్పుడే మేల్కొన్న దానిలాగ ప్రశ్నించింది నక్క.

"లేదండి! మమ్మల్ని తింటారు అంతే" అంది కొంచెం నిర్లక్ష్యంగా కుందేలు.

"అంతేమరి. లేకపోతే నీవు సిపాయిగా ఏంపనికివస్తావు ♦జనరల్ బిబికోవ్ చెత్త అని పిలిచేవాడే పటాలం! ఆముసిలి పటాలానికి కూడా నీవు పనికిరావు. సరే ఆ సిపాయి మీ మామయ్యను తినేసివుంటాడు. అవునా ?"

"లేదు. ఆ సిపాయి చచ్చిపోయాడు. మా మామయ్య పారిపోయాడు. ఇంటికి వచ్చాడు. కాని కుందేలు పను లేవీ చేయ లేకపోయేవాడు. అలవాటు తప్పిందికాదూ మరి. మా అత్త ఊరికే కూర్చోబెట్టి తిండి పెట్టనంది. అందుకని ఒకనాడు ఏమైనాసరే తిరునాళ్ళకు వెళ్ళి స్వంతంగా ఆట చూపిద్దామనుకొన్నాడు. డోలు మీద చేయివేశాడో లేదో ఇంతట్లో కుక్కలు మీదపడి చీల్చేశాయి."

"అవును అందర్నీ ఊదరపెట్టినందుకు తగినశాస్తి అయింది. తానెవరికో ఒకరికి కబళమవుతానన్న విషయం మీ మామయ్యకి ఆదినుంచీ తెలిసివుండాలి. కుక్కలు కాక

---

♦పుగాచోవ్ తిరుగుబాటును అణచడానికి బయలుదేరిన పటాలానికి జనరల్ బిబికోవ్ సేనాని. ఆ పటాలంలో సిపాయిలంతా ఒకరొకరుగా తిరుగుబాటు రైతులతో చేరిపోయారు.

పోతే నక్కలు. అవునా? మీ అందరిగతీ ఒకటే. సరేకాని కుందూ! మీ వైపు నక్కలెలా వుంటాయి? మాంచి చురుకైనవనుకొంటాను అవునా?"

"నిజమే. మంచి చురుకైనవి. వాటితో నా కెప్పుడూ స్వయంగా పని పడలేదు. కాని నేను చూస్తూవుండగా ఒకసారి వేటగాడొకదాన్ని కూలవేశాడు. చెప్పొద్దూ నేను నేను..." నేను సంతోషించాను అని చెప్పాలనుకొంది కుందేలు. కాని సమయానికి తమాయించుకొంది. నక్కమాత్రం దాని మనసులో మాటను పసిగట్టింది.

"అయితే నీ వలాంటి ఆతతాయివన్నమాట" అని మొరిగి కుందేలు డొక్కలో నెత్తురువచ్చేలాగా కరిచింది.

కుందేలు బాధతో చుమ్మలు చుట్టుకొంది. కాని ఎలాగో తేరుకొని "మావైపు నక్కల సంగతి చెప్పానండి అమ్మగారూ! ఇక్కడి నక్కలు దయగల వని అంటారు" అంది.

"అలాగా!"

"నిజమండి! నిరుడు మా అడివిలో ఒక కుందేలుపిల్ల తప్పిపోయిందండి. ఒక నక్క చూసి దాన్ని తనపిల్లలతోపాటే సాకిందండి."

"నిజం? అలా సాకి ఊరికినే పోనిచ్చిందంటావా? ఇప్పు డెక్కడుంది ఆ దిక్కులేని కుందేలుపక్షి?"

"ఏమోనండి. దానికి కాలంమూడిందని విన్నానండి. దొంగతనం అలవాటైంది. పోకిరీ తిరుగుళ్ళు మరిగింది. ఒక

చిన్న నక్కమ్మను చెరిచిందని కూడా విన్నాను. అప్పుడు తల్లినక్కకు కోపంవచ్చి దాన్ని కబళించిందని విన్నానండి."

"ఇదుగో అబ్బీ! దాన్ని కబళించింది నేనే! నీవు విన్న నక్కను నేనే. అది పోకిరీగా తిరుగుళ్ళు మరిగిందని తిన లేదు. దాని కాలం మూడిందని కబళించాను. అంతే."

నక్క ఒక్కక్షణం ఏదో ఆలోచించింది. ఒక గోమా రును నలిపింది. తర్వాత తాపీగా లేచింది. ఒళ్ళు విరుచు కొంది. నవ్వుమొహంతో కుందేలువైపు తిరిగి "ఇప్పుడు ఎవరిని కబళిస్తాననుకొంటున్నావు చెప్పు!" అని అడిగింది.

కుందేలు ఎంత తెలివైనదైనా ఈ విషయాన్ని ఊహించలేకపోయింది. "ఇంతటితో నాకు రోజుతీరింది" అన్న భావం ఒకసారి మెదడులో మెరిసింది. కాని అలా ఊహించడానికి కూడా ఇష్టంలేకపోయింది కుందేలుకి.

"నాకు తెలియదండి!" అంది. అలా అందికాని దాని వాలకం చూసేసరికి నక్కకు చాలా కోపంవచ్చింది.

"ఎంత అబద్ధాలకోరువి! నీ వొక పెద్ద వేదాంతివనీ, జ్యోతిష్కుడవనీ ఇదనీ అదనీ చెప్పగా విన్నాను. ఇప్పుడు నీవు శుద్ధ బడుద్ధాయి కుందేలువి తప్ప మరేమీ కాదని తేలింది. ఇప్పుడు నేను కబళించేది నిన్నే. తెలిసిందా. అచ్చంగా నిన్నే. మరొకర్ని కాదు!"

కుందేలును చీల్చివేసేదానిలాగ లంఘించింది నక్క. కాని అంతలోనే కూర్చుంది. ఏమీ జరగనట్లు చెవివెనక ఒకసారి గోక్కుంది.

"తమరు నన్ను పోనిస్తారనుకొంటున్నాను" అని కుందేలు బెరుకు బెరుకుగా గొణిగింది. దానితో నక్కకు కోపం ఇంకా ఎక్కువయింది.

"ఏమన్నావు ? నక్క కుందేలును దయతలచడం ఎక్కడైనా విన్నావా ? నిన్ను నేను కరుణించడానికి నీవూ నేనూ ఒకే లోకంలో వుంటున్నామా ఏమిటి ?"

"కాదండి ! అలాంటి ఉదాహరణలు కొన్ని వున్నాయండి" అంది కుందేలు కొంచెం ధైర్యాన్ని కూడదీసుకొని. కాని ఆ ధైర్యం ఎక్కవసేపు నిలవలేదు.

గత జీవితమంతా ఒక్కసారి కళ్ళముందాడినట్లయింది. స్వర్గనగరాన్ని వెతికే ధ్యాసలో రైతాంగాన్ని ఎలా బాధించినదీ, తిండీ తిప్పలు లేక గజగజవణుకుతూ రోజులతరబడి చెట్టు తొర్రలో ఎలా కూర్చున్నదీ గుర్తుకు వచ్చింది. ఒకనాడు అడివిజంతు వేదో తరుముకు వస్తూవుంటే పోయిపోయి ఒకరైతు ఇంట్లో పడింది. అదృష్టవశాత్తు అది శివరాత్రి అయింది. రైతు దాన్ని విడిచిపెట్టేశాడు. తన కుందేటి ప్రియురాండ్రంతా ఒక రొకరేస్మృతిపథంలో నిలిచారు. వారితో సంసారం చేసిన రోజు, నాడు కన్న సంతానం సంగతి జ్ఞాపకం వచ్చాయి. కాని ప్రాణా లరచేతపెట్టుకొని పరుగెత్తవలసివుండడంవల్ల వారి నొకనాడుకూడా తాను సరిగా చూడలేదు. ఇలా ఇవన్నీ మెదడులో మెసులుతూ వున్నంత సేపూకూడా "మరికొన్నాళ్లు బ్రతికివుంటే ఎంతబాగుండును!" అన్నమాటను మాత్రం మంత్రంలాగ పునశ్చరణ చేస్తూనే వుంది.

ఇంతలో నక్క కుందేలుకు ఆశ్చర్యం కొలిపే ఒక వన్నాగం పన్నింది.

"చూడు బోడికుందూ! నీవు నిజమైన వేదాంతివను కొన్నాను. కాని చావు పేరు వినేసరికే నీకు వణుకు పట్టు కొంది. సరే నీ కొక అవకాశం ఇస్తున్నాను. నేను నాలు గడుగులు వేసి నీవైపు వీపు తిప్పి కూర్చుంటాను తెలిసిందా బోడీ! అయిదు నిముషాలవరకు నీవైపు చూడను. నీవు తప్పించుకొని పారిపోవచ్చును. పారిపోగలిగావా నీ అదృష్టం. లేదా నీ పని ఇంతటితో సరి."

"అదేమిటండి అమ్మగారు ఎలా పారిపోగలనండి!"

"మొద్దు పెధవ! నీవు పారిపోకపోయినా నీకు అయిదు నిమిషాల వ్యవధి ఎలాగూ యిస్తాను. సరే కాలక్షేపం కానియ్యి. హాయిగా వుంటుంది. సిపాయిలంతే. కాలం మూడే వరకూ కాలక్షేపం చేస్తూ వుంటారు."

కుందేలు ఒక్కక్షణం ఆలోచించింది. నక్క ఒక పరి ష్కారమార్గాన్ని సూచించిన విషయాన్ని ఒప్పుకొనకతప్పదు. సోమరిగా చచ్చేకన్న ఏదో పనిచేస్తూ చావడం హాయి. అంటే పరిగెడుతూ చావడమన్నమాట. నిజమైన కుందేటి చావంటే అదే. మంచి వేగంతో పరుగెడుతున్నాననుకో. హఠాత్తుగా ఒక పంజాదెబ్బ. అంతే ఆఖరు!

"మరొక క్షణంలో ఏం జరుగనున్నదో నాకు తెలి యదు. నీపని రెండు తుండేలు" అని కుందేలు ఆత్మబోధ చేసుకొంది. "బహుశా..." అని ఏదో అనుకోబోయే టంతలో నక్క హెచ్చరించిది.

"ఇదిగో! ఆ వెర్రిమొర్రి ఆలోచనలు కట్టిపెట్టు. మనిషి వనిపించుకో. సరే. దేవుడు మేలుచేయుగాక! ఊఁ, సిద్ధం. పద!"

నక్క నాలుగడులు ముందుకు వెళ్ళింది. కాని అంతకు ముందే కుందేలును చిక్కని తుప్పల పక్కన కూర్చోపెట్టింది. కుందే లెంత ప్రయత్నించినా వెనకనున్న ఆ తుప్పలలోంచి సందుచేసుకొని పోవడం పొసగదు. నక్కవున్న దిక్కుకే పరు గెత్తుకొని రాకతప్పదు.

జిత్తులమారి నక్క కూర్చుంది. కుందేలును చూడ నట్లే నటించింది. నక్క మరోనాలుగడుగులు ముందుకు పోయినప్పటికీ తన ప్రతి కదలికను పసికట్టగలదని కుందేలుకు తెలుసును. ఒకటి రెండుసార్లు కుందేలు లేచి చెవులు వెను కకు రిక్కించింది. నక్క కందకుండా ఒక్కదూకు దూకాలని చాలాసార్లు అనుకొంది. కాని నక్క చూడకపోయినా అంతా కనిపెడుతూనే వుందన్న నమ్మకంవల్ల ఉన్నచోటినుంచి కదల లేక పోయింది కుందేలు. ఒక విధంగా చూస్తే నక్క వైఖరి సబబుగానే వుందని చెప్పక తప్పదు. కుందేలు కుందేటికి తగిన వ్యావృత్తిలో పడింది. దానితో కొంత మానసికాందో ళన తగ్గింది.

అనుకొన్న అయిదు నిమిషాలూ గడిచిపోయాయి. కుందేలు కుందేటి ఆలోచనలలో మునిగి పోయింవుంది.

"కుందూ ఆడుకొందామా?" అని అడిగింది నక్క.

ఆట మొదలైంది. పావుగంటవరకూ నక్క కుందేలు చుట్టూ గెంతులు వేసింది. గొంతు చీల్చేదానిలాగ లంఘిం

చేది. అంతలోనే దయదలచడమూ మానడమూ అనే మీమాంసవచ్చినదానిలా పక్కకు తప్పుకొనేది. దానివల్ల కూడా కుందేలుకు కాలక్షేపానికి కావలసినంత వ్యవధి దొరికింది. కుందేలు దేనికీ కాదనలేదు. అప్పుడప్పుడు ముని కాళ్ళతో కళ్ళుమూసుకొనేది.

ఏమయితేనేం పావుగంటలో అంతా అయిపోయింది. మిగిలిన వల్లా నాలుగు చర్మపు ముక్కలూ-కుందేలు ప్రవచించిన కుందేటి తత్వం "అన్ని జంతువులకు కర్మవ్రాసి పెట్టివుంది."





# మితవాది

అనగా అనగా ఒకానొక దేశంలో ఒక మితవాది ఉండేవాడు. అతడెంత నిష్కర్షగా ఉండేవాడంటే "అయ్యలారా మీరుచేస్తున్న దేమిటి? నాశనమవదలుచుకొన్నారా?" అని వస్తూనే బడబడ లాడేవాడు. ఎదుటివారు నోరు మెదపక ముందే ఉపన్యాసాలు కుమ్మరించేవాడు. అయితే ఎవరికీ కోపంవచ్చేదికాదు. పైగా "నిజమే! మితవాది హెచ్చరిక చేస్తున్నాడు. చేయనీయండి. మంచిదేగా" అని అతడిని పొగిడేవారు.

మితవాది మొదలుపెట్టేవాడు:

ప్రతి సమాజానికీ మూడు అంశాలు పునాదిగా ఉండాలి. అవి: స్వేచ్ఛ, భద్రత, గౌరవ. స్వేచ్ఛలేని సమాజానికి ఆదర్శాలుండవు. గొప్ప ఆలోచన లుండవు. మంచి

పనులు చేయడానికి ఉత్సాహం వుండదు. భవిష్యత్తుమీద నమ్మకం వుండదు. భద్రతారహితమైన సమాజం నిరాశా నిస్సబ్దతలతో నిండి నిబిడమై పోతుంది. అలాగే చొరవ లేని సమాజం తన వ్యవహారాలను తాను నిర్వహించుకోనలేదు. చివరికి స్వదేశమన్న భావమే ఆ సమాజానికి లేకుండా పోతుంది.

మితవాది ఇలాగ ఆలోచించేవాడు. అతడి ఆలోచనలు న్యాయమైనవేనని చెప్పక తప్పదుమరి. ప్రజలు తన చుట్టూ విషకీటకాల్లాగ ముసురుతున్నట్లు చూశాడతడు. అదిచూసి—

—"తమ భవిష్యత్తుకు తామే అధినాయకుల మన్న భావంవల్ల వచ్చినస్థితి కాదిది. వారు కేవలం బరువులుమోసే బానిసలు. అదృష్ట దురదృష్టాలు చెప్పకుండానే వారిని ఆవహిస్తాయి. వారిలో పుట్టే రాగవిరాగాలు నిజమైన రాగవిరాగాలో ఎండమావుల్లాంటివో వారికి తెలియదు. అందుకని ఆరాగవిరాగాలకు వారెన్నడూ లొంగరు."అని తనలో తాననుకొనేవాడు.

సరే పైన పేర్కొన్న మూడు అంశాలు మాత్రమే సమాజానికి దృఢమైన పునాదులు వేయగలవనీ సమాజాభివృద్ధికి కావలసిన హంగులన్నింటినీ సమకూర్చగలవనీ మితవాది దృఢంగా నమ్మాడు.

అంతేనా? మితవాది ఉదాత్తంగా ఆలోచించడమే కాదు. ఉదాత్తమైన పనులు చేయాలని కూడా ఆరాటపడేవాడు. తన ఆలోచనలకు వన్నె తెచ్చిన వెలుగురేక పరిసరాంధకారాన్ని

చీల్చి వెలుగులు విరజమ్మాలనీ అందరికీ వినయభావాన్ని నేర్పాలనీ కొండంత ఆశపెట్టుకొన్నాడు. అందరుమానవులూ అన్నదమ్ములేనని అతనివాదన. తన అదర్శాల జడిలో అంతా ఓలలాడాలని అతని ఆకాంక్ష.

నింగినున్న ఆదర్శాలను నేలకు దింపాలన్న ఈ ప్రయత్నం అనుమానాల కతీతంగా వుందని చెప్పడానికి వీల్లేదు. కాని మితవాది నిష్కాపట్యం, దృఢత, మృదుత్వం, వినయం చూసి అంతా అతని అనుమానాస్పద ఆదర్శాలను క్షమించారు. సత్యాన్ని హితవుగా చెప్పగలడు. అవసరమైనచోట అమాయకంగా కనిపించగలడు. లాభం వచ్చేచోట తన త్యాగశీలాన్ని చాటగలడు. తన కోర్కెలను తీర్చాలని ఎన్నడూ పట్టు పట్టలేదు. సాధ్యమైతే మంజూరు చేయవలసిందని విజ్ఞప్తి మాత్రమే చేసేవాడు.

ఈ 'సాధ్యమైతేనే' అన్న పదంవల్ల తలవంచని ఘటికుడు అన్న కీర్తి రానిమాటనిజమే. అయినా పరవాలేదని మితవాది మనస్సు సమాధాన పరచుకొన్నాడు. దానికి కారణం తాను కోరేది సర్వజన శ్రేయస్సు. అన్నిటికన్నా ఎక్కువ ప్రాధాన్యం దానికివ్వాలి. రెండవది తన ఆదర్శాలు అనవసరంగా అకాల మృత్యువు వాత పడకుండా వుండాలి కదా - అందుకని కీర్తి లేకపోయినా పరవాలేదనుకొన్నాడు. అదీకాక తన ఆదర్శాలు వాస్తవాలమీద ప్రభావం వేయదగ్గంత స్ఫుటమైనవి కావని అతనికి తెలుసును. స్వేచ్ఛ, భద్రత, చొరవ అంటే ఏమిటి? కేవలం అస్ఫుట అవ్యక్త సంకేతాలు. సమాజం పెంపొందాలంటే ఆ సంకేతాలకు

ఇంకా స్ఫుటత్వం కల్పించ వలసి వుంటుందికదా ? అసలు ఇలాంటి మాటలు సమాజం ఆశలను ఆశయాలను ఉన్నత పథానికి కొనిపోయేందుకు తోడ్పడతాయి. అంతేకాని సర్వతోముఖ సంతృప్తిని కలిగించే ప్రత్యక్ష లాభాలను ఆప దాలు కల్పించజాలవు. ఈ శ్రేయోవస్థను సాధించాలన్నప్పుడు, అంటే ఈ ఆదర్శాన్ని అందరికీ అందుబాటులోకి తేవా లన్న ప్పుడు ఈ ఆదర్శాలను చిల్లరగామార్చి ఆతురుల కందించ వలసి వుంటుంది. ఇదిగో సరిగా ఈ దశలోనే అంటే ఆదర్శా లను చిల్లరగా మార్చిన దశలోనే 'సాధ్యమైతేనే' అన్న పదం ఆవిర్భవిస్తుంది. ఇరు పక్షాలవారు తలపడినప్పుడు ఒకరు 'కొన్ని' సర్దుబాట్లకు లొంగాలి. మరొకరు తమ కోర్కెలను 'తగువిధంగా' తగ్గించుకోవాలి. ఇదంతా మన మితవాదికి క్షుణ్ణంగా తెలుసును. ఈ ఆలోచనలతోనే ఆయన వాస్తవం మీాద యుద్ధం చేయడానికి నడుంబిగించాడు. ముందు ఎందు కైనా మంచిదని 'అభిజ్ఞుని' సలహా అడిగాడు.

"స్వేచ్ఛ - అనేది నింద్యం కాదనుకొంటాను. ఏమం టారు ?"

"అది నింద్యంకాదు సరిగదా స్తవనీయమైనదికూడా" అని అభిజ్ఞుడు జవాబిచ్చాడు.

"మేం స్వేచ్ఛను వాంఛించడం లేదనేది నిజానికి ఘోరాపవాదం. మేం కోరేది స్వేచ్ఛ కాక మరేమిటి ? కాగా అది పరిమితుల్లో ఉండాలంటాం......"

ఓహో ! పరిమితులలో...సరే. భద్రత విషయంలో మీారేమంటారు ?"

"దానికి కూడా స్వాగతమే...కాగా అది కూడా దాని పరిమితుల్లో వుండాలి."

"సరే సంఘంలో చొరవ వుండాలన్న నా ఆదర్శం మీద మీ అభిప్రాయం ఏమిటి ?"

"మేం మధనపడుతున్నది కూడా అందుకోసమే కద ! అయితే అది కూడా పరిమితుల్లో వుండాలి."

సరే పరిమితులంటే పరిమితులే మరి. అందులో తభావతు రాకూడదని మితవాదికి క్షుణ్ణంగా తెలుసును. కళ్ళెం లేని గుర్రాన్ని విడిచిపెట్టావా అదిచేసే యాగీ ఇంతా అంతా కాదు. ఈ ప్రపంచంలో కళ్ళెమంత గొప్ప వస్తువేదీ లేదు. గుర్రానికి కళ్ళెం తగిలించు. ఇక ఎప్పుడూ వెనక్కే చూస్తూ వుంటుంది. "జాగ్రత్తగా చూడు ! లేకపోతే కొరడా దెబ్బ రుచిచూడ వలసి వుంటుంది ! అదీ కళ్ళెం తత్వం !"

అలాగనుకొని మితవాది తన కార్యకలాపాలలో పడ్డాడు. అయితే పరిమితుల్లో మాత్రమే. ఇక్కడ కాస్త కతకడం. అక్కడ కాస్త కెలకడం. అప్పుడప్పుడు ముణిచి పెట్టుకొని పడుండడం ఇదీ పని. అభిజ్ఞులు అతడిని కనిపెట్టి చూశారు. చాలా ఆనందించారు. ఒకప్పుడాతని పనిని చూసి వారెంత ముగ్ధులై పోయారంటే వారుకూడా మితవాదులుగా మారిపోతారేమో నని చూసినవారికి కనిపించింది.

వారు మిత వాదిని వెన్ను తట్టారు.

"చాలా బాగుంది. ఇంకే బాదరబందీ పెట్టుకోకు. అలాగే సాగనీ. అంతా అద్భుతంగా సర్దుకొంటుంది. ఓహో మేకా ! నీవు మా తోటలోకి రావడానికి ఎట్టి అభ్యంతరమూ

లేదు. కాని చూస్తూన్నావుగా గోడలు చాలా ఎత్తుగా వున్నాయని !"

"చూడకేం చూస్తూనే వున్నాను. కాని నా ఆదర్శాల మీద చింతపట్టుకొంది. వాటిని వదులుకొనడం చాలా చిన్న తనంగా వుంది. చెపితే మీ కర్థంకాదు మరి."

"అదేమిటోయ్ ! కాస్తంత చిన్న తనానికి మరేం ఫరవాలేదు. చిన్నతనంవల్ల వచ్చే నష్టమేమిటిలే. నీ ప్రణాళి కను నీవు కొనసాగించ వచ్చును. సాధ్యమైనంత పరిమితిలో — తెలిసిందా ?"

అలాగ 'సాధ్యమైతేనే' అన్న పరిధిలోనే మితవాది కార్యకలాపాలు కొనసాగాయి. ఈ దశలో కూడా మితవాది ఆదర్శాలు ప్రమాద రహితాలుకావు అని అభిజ్ఞులకుతోచింది. ఒక వైపున ఆవ్యవహారం చాలా విపులంగా సాగించడానికి ఏర్పాటు అయింది. రెండవ వైపుచూస్తే దాన్ని అంగీకరించ డానికి కాలం ఇంకా పరిపక్వం కాలేదు మరి.

"నీ ఆదర్శాలు మాకు చాలాభారంగా తోస్తున్నాయి. వాటిని భరించడానికి మేమింకా తయారు కాలేదు — ఇంకా పరిపక్వదశకు రాలేదు" అని అభిజ్ఞులు మితవాదికి తెలియ జేశారు.

ఆదర్శాలలో గల లోపాలను, లొసుగులను వారు అతి చిన్న వివరాలతో స్పష్టంగా నిరూపించారు. అది విన్న తర్వాత మితవాది తన పథకం చాలా ప్రమాద గర్భితమైన దని ఒప్పుకొనక తప్పిందికాదు. ఆపథకం ఇంక పనిచేయదు. అంతే !

“ఎంత శోచనీయం” అని మితవాది శోకించాడు.

అభిజ్ఞులు అతడిని ఊరడించారు.

“ఎంత చిత్రమైన వాడివోయ్. ఈ వ్యవహారాన్ని గురించి కన్నీరుపెట్టకు. అది కన్నీరు పెట్టతగినదికాదు. భవిష్యత్తులో నీ ఆదర్శాలు వ్యాప్తి పొందాలనేకదా నీ అభిమతం? అందుకు మా అభ్యంతరం లేదు. నీకు పుణ్యం వుంటుంది తొందరమాత్రం పడకు. ‘సాధ్యమైన పరిమితుల్లో’, నీ పథకాలు విఫలమయ్యాయే అనుకో. అయినప్పటికీ’ ‘కనీసం ఏదో’ ఒకటి సిద్ధిస్తుందికదా! దానితో సంతృప్తిపడు ‘కనీసం ఏదో’ ఒకదానికి కూడా కొంత విలువ వుందని తెలుసునుకదా. తొందరపాటు లేకుండా తాపీగా భగవత్ ప్రార్థన చేస్తూ ‘తృణశః కణశః’గా సాధిస్తూ పోతే ఒకనాటికి నీకు తెలియకుండా లక్ష్యాన్ని చేరుకొంటావు. ఆ లక్ష్యం ఏర్పడినప్పట్నుంచీ దాన్ని చూసినవారెవరూ లేరు. నీవే మొదటివాడివవుతావు అప్పు డెంత అద్భుతంగా వుంటుందని!”

ఇక చేయగలిగింది లేదు. ఉన్నదానితో సర్దుకోవాలి. ‘సాధ్యమైనంత’ సాధించలేకపోతే ‘కనీసం ఏదో ఒకటి’ సాధించడానికైనా ప్రయత్నించి అదే పదివేలనుకోవాలి. మన మితవాది అక్షరాలా అంతే చేశాడు. కొత్త పరిస్థితులకు అనువుగా అంతా సరిపెట్టుకొన్నాడు. ఇంతకన్నా వేరు మార్గం లేదని ఇంతకుముందు అంత తెలివి తక్కువగా ఎలా ఆలోచించానా అని విస్తుపోయాడు. ఇందుకెన్నో దృష్టాంతాలు కూడా కనిపించాయి. వడ్లగింజకూడా వెంటనే ఫలితానికిరాదు. తెలిసిందా? ముందు దాన్ని నాటాలి. మొల

కె త్తేవరకూ చూడాలి. మొలకెత్తి, ఆకులుతొడిగి వెన్ను వేయాలి. ఒక గింజ పదిగింజలై చేతికి రావాలంటే ఈలోగా ఎన్ని అద్భుతాలు జరగాలో చూశారామరి. ఆదర్శాల వ్యాప్తి విషయంలో కూడా ఇంతే. 'కనీసం ఏదో ఒకటి' నేలను నాటు. అప్పు డక్కడ కాచుకొని కూర్చో.

అలాగ మన మితవాది, కనీసం ఏదో ఒకటి, నేలను నాటి అక్కడ నిరీక్షిస్తూ కూర్చున్నాడు. కాని అలాగ ఎంత సేపు కూర్చున్నా 'ఆ కనీసం ఏదో ఒకటి' మొలకెత్తలేదు. అంతే. దాని దుంపతెగా అది రాతినేలను పడిందా లేక పేడలోపడి మురిగి పోయిందా ? ఎవరు చెప్పగలరు ?

"ఏమై వుంటుంది ?" అని మితవాది పాపం గొణుగు కొన్నాడు.

అప్పుడు సందేహ నివృత్తిచేశాడు అభిజ్ఞుడు.

"అయ్యా ! మీరు చాలాచాలా ఆశించారు. ప్రజ లెంత హీనంగా ఎంత దుర్బలంగా వున్నారో మీకు క్షుణ్ణంగా తెలుసును. వారికేదో మేలు చేద్దామను కొంటున్నారు. కాని వారు మాత్రం మిమ్మల్ని వీలైతే పుడిసెడు నీటిలో ముంచి వేయడానికి సిద్ధం. ఇలాంటి ప్రజలమధ్య చిత్తశుద్ధిని కాపాడుకోవాలంటే చాలా తెలివితేట లుండాలి. మెల కువలు తెలియాలి."

"అయ్యా కాస్త కరుణించండి ! అసలీ రోజుల్లో చిత్త శుద్ధిని గురించి ఎవరు మాట్లాడుతున్నారని. నేను ఆదిలో ఎవడినో మీకు తెలుసునుకదా ! ఇప్పుడు నే నెవరిని? నాకున్న మర్యాదంతా మంటగలసింది. తొలుత నేను 'సాధ్యమైతే'

అన్న సిద్ధాంతంమీద నడిచాను. ఆ తర్వాత 'కనీసం ఏదో ఒక' కాడికి దిగజారాను. అయ్యోరాత! ఇక నేను చేయడాని కేమైనా మిగిలివుందా ?"

"తప్పకుండా వుంది. ఉదాహరణకు దగాతో సర్దుబాటు చేసుకోనడం వుందనుకోండి. దాని కేమంటారు ?"

"ఎలాగ ?"

"ఎలాగేమిటి ? చాలా సులభం. మీరు మా వద్దకు కొన్ని ఆదర్శాలను కొనివచ్చారు. సరే బాగానే వుంది. మేం వాటిపట్ల సానుభూతి చూపాలంటే మీరు సర్దుబాటుకు సిద్ధంగా వుండాలని మే మంటా మనుకోండి..."

"అంటే ?"

"అదే! మీ ఆశయాలతో ఆకాశాని కెగరకండి. మా అభిరుచికి అనువైనంత వీలుగా వాటిని కిందికి దింపండి. అప్పుడు ముందుకు సాగండి. సర్దుబాటు చేసుకోండి. అప్పుడు బహుశా ప్రయోజనం ఉందనుకొంటే మేం కూడా......చూశారూ మేం పాతకాపులంలెండి. మీలాంటి వారిని చాలామందిని చూశాం. మొన్న మొన్ననేకాదూ జనరల్ మకరయ్యగారు మీలాగే కొన్ని ప్రతిపాదనలు చేశారు— 'లాకప్ అనేది నా సిద్ధాంతమండి. అది మీకు సమ్మతమేనా ?... ఏమంటారు' అన్నారు మకరయ్యగారు. మేం బుద్ధి గడ్డితిని ఆయనను నమ్మాం. ఇప్పు డాయన పోయాడు. మేం లాకప్పులో వుండిపోయాం."

ఈ మాటలు విన్నమీదట మితవాది చాలా దీర్ఘంగా యోచించాడు. తన ఆదర్శాల తాలూకు పేర్లు మాత్రమే

ఇప్పటికి మిగిలాయి. అది చాలదన్నట్లు దానికి ప్రత్యక్షంగా దగాను జోడించా లంటున్నారు. ఇలాగే ఇంకా సాగితే తాను అచ్చమైన దగాకోరుకింద మారిపోవడం ఖాయం. హే భగవాన్ ఏంచేయాలి?

మితవాది ఇరుకునపడ్డంచూసిన అభిజ్ఞుడు అతడి వెన్ను తట్టాడు.

"ఇదిగో పసంటూ ప్రారంభించిన తిర్యాతి దాన్ని కొనసాగించాలి. అంతేకాని తెలివితక్కువగా వ్యవహరించుట కూడదు. ఇప్పుడు నీవు మమ్మల్ని కదిపావు. మరి ఇంత వరకూ నీ వేమీ చేయలేదని రుజువు చేసుకోగలవా?"

మితవాది పనిలోకి దిగాడు. అప్పటినుంచీ అతడు చేసిందంతా దగాకు అనువుగానే వుంది. దానిలోంచి ఎప్పుడైనా బైటపడ్డానికి ప్రయత్నించినప్పుడల్లా అభిజ్ఞులలో ఒకరు వచ్చి "ఇదుగో మితవాదీ ఏం చేద్దామనుకొంటున్నావు? ఏదీ మొహం పైకెత్తి చూడు!" అనేవాడు.

అలాగ కాలం గడిచింది. అభ్యుదయోద్యమం (దగాతో సర్దుబాటు చేసుకొన్నదే అనుకోండి) ముందుకు సాగింది. కంపుతప్ప గత ఆదర్శాల ఛాయ కూడా మిగల్లేదు. అప్పటికీ మితవాది నిరాశ పడలేదు.

"నా ఆదర్శాలను నేను నిజంగా తుంగలో ఊరతొక్కితే మాత్రం ఏం? వ్యక్తిగతంగా నే నిప్పటికీ పందిరి గుంజలాగ తిన్ననైన వాణ్ణేగద! ఈ వేళ నేనీ జంబాలంలోపడి కొట్టు మిట్టాడుతూ వుండవచ్చుగాక. రేపు ఎండకాస్తుంది.

ఈ బురద లింకుతాయి. అప్పుడు నేను మళ్ళా ఆ ప్రాన్వపు అదృష్టవంతుణ్ణవుతాను."

అభిజ్ఞుడీ స్వగతాన్ని విన్నాడు. నిజం అంతే అని ఒప్పుకొన్నాడు.

మితవాది ఒకనాడు స్నేహితునితో కలిసి బజారు వెంటపోతూ అలవాటు ప్రకారం తన ఆదర్శాలను గురించీ, తన మేధాశక్తిని గురించీ గొప్పలు చెప్పుకొంటూ వుండగా తటాలు నేదో మొహంమీద పడింది. అదేమై వుంటుంది? వాన పడుతున్నదేమోనని పైకి చూశాడు. కాని చిన్న మబ్బుతునక కూడా ఆకాశంలో లేదు. కొద్దిపాటిగాలి రివట వీస్తున్న మాటనిజమే. మేడలమీదనుంచి మురికినీళ్ళు కింద బజార్లో పోయడానికి వీల్లేదని నిషేధాజ్ఞలున్నాయి. అందు కని పైనుంచి మురికినీళ్లు పడ్డాయని అనుమానించడానికి వీల్లేదు.

"ఏమిటీ చిత్రం!" అని మితవాది స్నేహితునితో అన్నాడు.

"ఇప్పుడు వాన పడ్డంలేదు. మేడమీంచి పార పోసిన మురికినీరు కాదు. అయినా నా మొహంమీద ఏవో చుక్కలు పడ్డాయి."

"ఆమూల ఎవడో నక్కివున్నాడు చూశావా?" అని మిత్రుడు చూపించాడు.

"అది వాడుచేసిన పనే. నీ మితవాదాన్ని చూసి నీ మొఖంమీద ఉమ్మాలనుకొన్నాడు. కాని ఎదురుగా వచ్చి

మొహంమీద పుమ్మడానికి దమ్ములు చాలలేదు. అందుకని దగాతో సర్దుబాటు చేసుకొని ఆమూల నక్కి పుమ్మాడు. గాలి దాన్ని నీ మొహందాకా మోసుకొచ్చింది."





# ముసిలి తట్టు

ముసిలితట్టు దారిపక్కన పడి గాఢంగా నిద్రపోతోంది. రైతు అప్పుడే అరక విప్పి మేతకు విడిచాడు. కాని ఆ పసరానికి మేతమీద ధ్యాసలేదు. అప్పుడు దున్నుతున్న చెక్కరాతినేల. దాన్ని దున్నడం తట్టుకూ, దాని యజమానికీ కూడా తలప్రాణం తోకకొచ్చింది.

సర్వసాధారణంగా ప్రతి రైతుదగ్గరా వుండేదే ఈ ముసలితట్టు. ఒట్టి ఎముకలగూడు. ఎండినబోర. పైకి పొడుచుకొనివచ్చే పక్కటెముకలు. కీళ్ళు సడలిన కాళ్ళు. ఎండకు పేలిపోయిన ఒళ్ళు. తల ఓ పక్కకు పోతూఉంటుంది. జూలు అట్టలు కట్టింది. కళ్లు ముక్కులు సంతత ధారగా చెమర్చుతున్నాయి. పెదవి వ్రేలాడుతోంది. ఇలాంటి పసరంతో ఎక్కువ పని చేయించడం కష్టం. కాని పని చేయాలికదా!

మునిప్పొద్దులూ ముసలి తట్టుకు కళ్ళెం బిగించే వుంటుంది. వేసవిలో వేకువ మొదలు చీకటి పడేవరకూ పొలంలో నాగటిపని. చలికాలమంతా బండిపని.

అలాంటప్పుడు సత్తు వెలా పోసుకొంటుంది? దానికి వేసే గడ్డి గడ్డికాదు. వేసవిలో రాత్రి మేతకు కళ్ళెం విప్పి నప్పుడు ఏదో మెత్తని పరకలు నాలుగు కొరికేది. కాని చలికాలంలో బండిపని చేసి వచ్చిన తర్వాత ముక్కిపోయిన యెండుగడ్డి సందెడు దాని మొఖాన పడేసేవారు. వసంతంలో పశువుల్ని పొలానికి తోలినప్పుడు గడలు బోటుపెట్టి దాన్ని లేవదీయవలసి వచ్చేది. పొలాల్లో ఒక్క గడ్డిపరకకూడా కానవచ్చేదికాదు అక్కడక్కడ ఆవుల కంట పడకుండా మిగిలిన ఒకటి రెండు పరకలుతప్ప.

ముసలి తట్టు బ్రతుకు ఏం బ్రతుకు? పాడుబ్రతుకు! యజమాని దయగలవాడే! అనవసరంగా కొట్టడు. అయితే ఏం లాభం? ఇద్దరూకలిసి కొయ్యనాగలితో పొలంలో పడ తారు. "హే హే హే నడునడు!" అలవాటైన ఆ అదలింపు వినేసరికి నడుస్తుంది ముసలి తట్టు. ఒళ్ళుసాగదీసి ముందు కాళ్ళను తన్నిపట్టి వెనక కాళ్ళ నీడుస్తూ మూతి బోరకానించి ముందుకు శరీరాన్నీడుస్తుంది. "దొంగముండా నడు!" రైతు కూడా తన బరువంతనీ అరకమీద వేస్తాడు. పట్టుకారు ల్లాంటి చేతులతో మేడితోకను బిగించి చాళ్ళలో కళ్ళుగుచ్చి క్రొక్కడైనా తప్పుతున్న దేమోనని చూస్తాడు. ఈ మూల నుంచి ఆమూలకు ఒక చాలు వేసేసరికి ఇద్దరికీ వణుకు పుడు తుంది. నిజం! మిత్తి నెత్తిమీదికి వస్తుంది. మనిషి నెత్తి

మీాదా, ముసిలి తట్టు నెత్తిమీాదా మిత్తి కూర్చుంటుంది. ప్రతిరోజూ వారి బ్రతుకంతే.

దుమ్ము కొట్టుకొన్న బండిబాట పాములాగ మెలికలు తిరుగుతూ ఒక వూరునుంచి మరొక వూరికి పాకుతుంది. అలా పాకి పాకి బాట ఎక్కడో ఒక పల్లె మొగలో మరుగు పడుతుంది. మళ్ళా ఊరావల తలెత్తి ముందుకు పాకుతుంది. అలా ఎక్కడికి పోతుందో ఆ దేవునికే ఎరిక. ఆ బాటపొడ వునా ఇటూ అటూ పొలాలు కావలి వుంటాయి. ఆ పొలాల కంతులేదు. భూమీా ఆకాశం కలిసే ఆకడదాకా పరుచు కొన్నాయి పొలాలు. ఒకప్పుడు పసిమి మిసిమిగా, మరొ కప్పుడు పచ్చ పచ్చగా, వేరొకప్పుడు మొక్కా మోడూ లేని బీడుగా ఆ పొలాలు సర్వకాలాల్లోనూ ఆ గ్రామాల నన్నింటినీ పిడికిలిలో బిగించి వుంచుతాయి. ఆ పిడికిలి సడ లదు. ఆ గ్రామాలలోంచి ఏ జీవి ఎటు మళ్ళవలసి వచ్చినా ఆవులిస్తున్న పొలాల కడుపునపడ్డంతప్ప వేరుమార్గం లేదు. అదుగో ఆ మనిషి అలాపైకి నడచిపోతున్నాడు. ఆ నడక వేగం చూస్తే ఇంకోక్షణానికి కాళ్లు విరిగిపోతాయా అనిపిస్తోంది. కాని దూరాన్నుంచి చూస్తే మాత్రం ఈ అంతులేని పొలాల నుంచి తప్పించుకొనటంకోసం గిజగిజలాడుతు న్నట్లనిపిస్తుంది. చిన్న బుడిపిలాగ కనిపిస్తున్నాడు ఆ మనిషి. కదులుతున్నట్లే అనిపించడంలేదు. క్రమ క్రమంగా మసక బారుతున్నాడు. అలా మసకబారి మసక బారి హఠాత్తుగా మాయ మవు తాడు. అంతులేని ఆ పొలాలలో కరిగి పోతాడు.

వందలపల్లి గడచినా అంతులేని ఈ పొలాలలో కద లిక లేదు. చలనం లేదు. తమ గుండెల్లో బందీగావున్న ఏదో అద్భుతశక్తి పారిపోకుండా కావలి కాస్తున్నట్లు కనిపి స్తాయి ఆ పొలాలు. ఈ శక్తిని చెరనుంచి ఎవరు విడిపిస్తారు? దాన్ని వెలుగులోకి ఎవరు తెస్తారు? ఈ భారం ఇద్దరిమీద పడింది. ఒకరు రైతు. రెండవది తట్టు. పుట్టిన దగ్గరనుంచి బుగ్గి అయేదాకా ఇద్దరూ ఆ పనిలోనే సతమతమౌతారు. చెమటా, నెత్తురూ వారపోస్తారు. రైతుల సంకెళ్లు తెగసరికి, తట్టు మూపున వున్న పుళ్ళను మాన్పగలిగిన ఆ మహాశక్తిని పొలాలు ఇంకా కోల్పోలేదు.

ముసిలి తట్టు మండుటెండలో పడివుంది. కనుచూపు మేరలో ఎక్కడా చెట్టులేదు. వడగాలికి ప్రాణం సొలొస్తున్నది. అప్పుడప్పుడొక సుడిగాలి బాటమీది దుమ్మునంతనీ పోగు చేస్తుంది. ఆ గాలికి ఒళ్ళంతా చిమచిమ లాడుతుందేకాని ప్రాణం హాయిగా వుండదు.

జోరీగలూ, గోమార్లూ పిచ్చెత్తినట్లుగా తట్టుపొట్టకింద ముసురుతాయి. ముట్టెను ముంచెత్తుతాయి. పుళ్ళను కరు స్తాయి. అవి కరిచినప్పుడల్లా ముసలి తట్టు చెవులు ఇటూ అటూ తపతపలాడిస్తుంది. ముసిలి తట్టు కలలు కంటున్నదా లేక కైలాసానికి ప్రయాణ మవుతున్నదా? ఏమో ఎవరికీ తెలి యదు. ఈ ఎండకీ, చాకిరీకీ ఒళ్ళంతా పేలిపోతున్నదని పాపం ఫిర్యాదుకూడా చేయజాలదు. ఆ మూగజీవానికి దేవుడు ఈ మాత్రం సౌకర్యాన్ని కూడా యివ్వలేదు. అలాగే మగ తగా పడివుంది. విశ్రాంతి అన్న పేరుతో లభించిన ఈ బాధలో

వచ్చేవి కలలు కావు. ఒక తీరూ తెన్నూ లేని పీడకల. ఆ పీడ కలకు ఆకారం లేదు. కొసకు భయంకరాకారాలు కూడా కానరావు. ఏవో పెద్ద పెద్ద మచ్చలు, ఒకప్పుడు నల్లగా మరొకప్పుడు నిప్పులా మచ్చలు ఒకప్పుడు కదలకుండా అలాగే ఉంటాయి. మరొకప్పుడు అలిసిపోయిన ముసిలి తట్టుతో పాటే కదులుతూ వుంటాయి. తట్టుని అడుగు లేని అగాధ పాతాళంలోకి ఎక్కడికో యీడ్చుకొని పోతూవుంటాయి.

పొలాని కంతు లేదు. దానినుంచి తప్పించుకొనడం సాధ్యంకాదు. ముసిలి తట్టు అరకనీడుస్తూ ముందుకూ వెనకకూ ఎంత నడిచినా అంతు అనేది కనుచూపు మేరలో కానరావడం లేదు. మొక్కా మోడూ లేక బోడిగావున్నా, పచ్చగావున్నా మంచుకప్పి నిశ్శబ్దంగావున్నా అన్ని దశల్లోనూ కూడా దూరదూరాలకు పరుచుకొని వుంటుంది పొలం. అన్నింటికీ అది రాజు. అన్నింటినీ పట్టుకొని బందీగా గొని బానిసల్ని చేస్తుంది. దాని రహస్యాలు తెలిసినవారు లేరు. దాన్ని జయించినవారు లేరు. దాని సంపదను పూర్తిగా వెలికి తీసినవారు అంతకన్నా లేరు. ఈరోజునది శూన్యంగా నిర్జీవంగా కనిపిస్తుంది. రేపు నవనవోన్మేషంగా గోచరిస్తుంది. అందులో సజీవమేదో, నిర్జీవమేదో తెలుసుకొనడం సాధ్యం కాదు. కాని ఆ చావు బ్రతుకులకు మాత్రం మన ముసలి తట్టు ప్రథమసాక్షి. అందరికీ ఆ పొలం ఒక కవిత్వం లాంటిది. విశాల కేదారం. కాని మన తట్టుకు మాత్రం అది బానిసతనానికి పుట్టినిల్లు. పొలం దానిమీద తన బరువు నంతా మోపుతుంది. దానిలోని ఆఖరి శక్తికణాన్ని కూడా

హారిస్తుంది. అంతటితో తృప్తిపడక ఎప్పటికీ ఆవురావురు మంటూ వుంటుంది. వేకువనుంచి చీకటి పడేవరకూ ముసలి తట్టు కాళ్ళీడ్చుకొంటూ సాగుతుంది. కళ్ళముందు ఏదో నల్లగా మిల మిల లాడుతూ దాన్ని ముందు కీడ్చుకొంటూ పోతుంది. మళ్ళీ కళ్ళ ముందు అదే సిద్ధం. అలాగ ఆ మగత లోనే "హె హె హె నడు నడు-మొండిముండా నడు నడు!" అన్న అదలింపు వినిపిస్తుంది.

మింట అగ్గిగోళం ఎన్నడూ ఆరదు. పవలంతా ముసిలి తట్టుమీద అగ్గి జడికురిపిస్తుంది. వానలకు, పిడుగులకు మంచు జడులకు అంతంలేదు. ప్రతివారూ ప్రకృతిని మాత అని పొగుడుతారు. కాని తట్టుకు మాత్రం ఆ ప్రకృతి ఒక పెద్ద హింసాయంత్రం. ఒకశాపం. ఆ ప్రకృతిలో దాని మట్టుకు పరిమళంలేదు. నానాస్వరాల సంగీతంలేదు. నానావర్ణ కిమ్మీరితంకాదు. అలసట, దైన్యం, బాధ తప్ప దానికి మరొక అనుభూతిలేదు. సూర్యకిరణాలు ప్రకృతి అంతటికీ వేడీ వెలుగూ కల్పించుగాక. ఆకిరణాల వెలుగులో అన్ని జీవాలూ ఆనందించుగాక. కాని దౌర్భాగ్యపు తట్టుకు మాత్రం జీవితం లోని అనంత బాధల్లో ఆసూర్య కిరణాలబాధ ఒకటి.

విశ్రాంతిలేని పని. దానిబ్రతుకంతా పని పని పని! పనికోసమే అది తల్లి కడుపున పడింది. పనికోసమే పుట్టింది. పనికోసంకాక పోతే దాని మొహంకూడా ఎవరూ చూడరు. పైగా పొదుపుగల రైతు అదొక లేనిపోని బరువని కూడా భావిస్తాడు. దాని పరిసర వాతావరణానికంతకీ ఒకే ఒక ప్రయోజనం కనిపిస్తున్నది. అది దానిపనికి తోడ్పడే కండ

రాల సత్తువ అలసి హతమారి పోకుండా అడ్డుపడ్డం. తూచి నట్లు తీరిక, ఎలాగో పనిచేయడానికి తగిన శక్తినిచ్చేపాటి తిండేదొరుకుతుంది. ఆ తర్వాత పొలాలు పంచ భూతాలూ ఏం కసితీర్చుకొన్నా, దాని కాళ్ళమీద అ(రుమీద నడుం మీద ఎన్నికొత్తపుళ్ళు పడ్డాయన్న విషయాన్ని పట్టించుకొనే వారేవ్పుండరు. కాడిమోయదగ్గ బలం దానికుందా లేదా అనేది తప్ప దాని క్షేమం సంగతి ఎవరికీ పట్టదు. ఎన్ని యుగాలుగా ఈ కాడి మోస్తున్నదో దానికి తెలియదు. ఇంకెన్ని యుగాలుమోయాలో ఊహించలేదు. చీకటి పాతాళ బిలంలోకి పడిపోతున్నట్లుగా అది (బతుకు వెళ్ళమారుస్తుంది. జీవులకుగల అనంతానుభూతులలో దానికి తెలిసిన అనుభూతి ఒక్కటే. అది అంతులేని చాకిరీ మూలాన పుట్టిన బాధ!

ముసిలి తట్టు (బతుకుమీద అమరత్వ ము(ద్రపడింది. అది నిజంగా (బతకడంలేదు. అయినా చావదు కూడా. ఆ పొలం అష్టపాదితిమిలాగ అనంత బాహువులతో దాన్ని పొదువుకొంటుంది. ఆ మృత్యు హస్తాలనుంచి దానికి విముక్తిలేదు. తట్టు లక్షణా లేవైనప్పటికీ దాని (బతుకు సర్వ(తా ఒకటే - దెబ్బలు తన్నులు తాపులు హింసలకు గురై సగంచచ్చి బాధతో బండబారడంతప్పదు. తనరక్తంతో తడిసిన పొలంలాగే దానికికూడా రోజులు ఏళ్ళు యుగాలు అనే లెఖ్ఖలు లేవు. దానికి తెలిసినది అనంతత్వం ఒక్కటే. దాని తోబుట్టువులు ఆ పొలంనిండా వున్నాయి. ఎక్కడ చూసినా ఎప్పుడు చూసినా కండ లరగదీస్తున్న ఆ జంతువు కనిపిస్తుంది. ఎక్కడైనా దాని (బతుకు అంతే. అదే ముసిలి

తట్టు. దానిలో వున్న దేదో ఇదమిత్థమని చెప్పరాని పదార్థం. అది కనిపించదు. తరగదు. విరగదు. నాశనంకాదు. జీవితం అంతులేనిది. అదొక్కటే ఆపదార్థానికి తృణ్ణంగా తెలిసినసత్యం. కాని ఈజీవితం ఏమిటి? ఇది ముసిలితట్టును అనంతత్వ శృంఖలాలతో ఎందుకు బంధించింది? అది ఎక్కడినుంచి వచ్చింది? ఎలా బంధించింది? బహుశా భవిష్యత్తులో ఒకనాడు ఈ ప్రశ్నలకు జవాబు దొరకవచ్చును. లేదా అదికూడా గత కాలపు గాఢాంధకారంలాగ, జీవాల నాహరించే దెయ్యాలను సృష్టించిన చీకటి యుగంలాగ వుంటుందేమో!

ముసిలి తట్టు కునుకుపాట్లు పడుతూవుంటే పనికిరాని పరుగువాజెలు దౌడుతీస్తూ వుంటాయి. ఈ పనికిమాలిన పరుగువాజెలూ ముసిలితట్టూ ఒక కడుపున పుట్టినవారే నని చూసినవారికి మొదట స్ఫురించదు. ఐనా వాటి బంధుత్వం ఇప్పటికీ ఇంకా నస్తూనేవుంది.

ఒకప్పుడొక ముసిలిగుర్రం వుండేది. దానికి తట్టు - పనికిమాలిన పరుగువాజి ఇద్దరు బిడ్డలు. ఇందులో రెండవది అడకువ మెలకువ గలది. తట్టు అల్లరి చిల్లరిది. తట్టు ఆగడాన్ని ముసిలిగుర్రం చాలాకాలం సహించింది. బిడ్డలిద్దరినీ సమానంగానే పెంచింది. కాని కొసకు విసువెత్తి అంది: "నా ఆస్తిలో గడ్డి తట్టుకీ, ఉలవలు పనికిమాలిన పరుగువాజికీ చెందాలి. ఇది శాశ్వత శాసనం!" అని. అందుకని అప్పటి నుంచీ పనికిమాలిన పరుగువాజికి మంచి అస్తబలూ మెత్తని పక్కా అమిరాయి. తాగడానికి ఉలవచారు, తినడానికి గుగ్గిళ్ళు. కాని ముసిలితట్టుకు మాత్రం ఒక పాత గోశాల

వచ్చింది. తినడానికి సందెడు ముక్కిన గడ్డి దక్కింది. "తీరిగ్గా నములు ముసిలిముండా. అక్కడా గుంటలోనీసు తాగు!"

ఈ ప్రపంచంలో తన కొక దాయాది వున్న సంగతే మరచిపోయింది పనికిమాలినవాజి. కాని దానికి హాఠాత్తుగా ఏదో విసువు పుట్టింది. "హాయిగా వున్న ఈ అస్తబలుతోనూ, ఈ గుగ్గిళ్ళతోనూ విసుగెత్తుతోంది. మా తోబుట్టు వెలా వుంటుందో చూడాలని మనసుపుట్టింది" అనుకొంది.

సరే బయలుదేరింది. తన తోబుట్టువు చావులేనిదని తెలుసుకొంది. చేతి కేది అందుతుందో దానితో కొడతారు. అయినా అది బ్రతుకుతోంది! ముక్కిపోయిన గడ్డిని మేతకు వేస్తున్నారు. అయినా బ్రతుకుతుంది! ఎటువైపు చూచినా తన తోబుట్టువులు బానిసల్లాగ పనిచేస్తున్నట్లు కనిపించింది. ఇప్పుడే ఈ వైపున కనిపించింది. కనుమూసి తెరిచేటంతలో అక్కడ ఆమూల కాళ్ళీడుస్తూ కనిపించింది.

ఓయి బాబో దాని కేదో మాయో మంత్రమో తెలిసి వుండాలి. దాని నడుంమీద ఎన్ని కర్రలైనా విరుగు తాయి కాని దాని నడుంమాత్రం విరగదు.

ఇలాగ అనుకొంటూ పనికిమాలిన పరుగువాజెలన్నీ ముసిలితట్టు చుట్టూ చేరాయి.

అందులో ఒకటి అంది:

"అసలేదీ తట్టుమీద పని చేయలేక పోవడానికి కారణ మేమిటో నాకు తెలుసును. అంతులేని పని చేయడంవల్ల దానికి చాలా లోకజ్ఞానం అబ్బింది. చెవులకన్నా కొమ్ములు

ముందు మొలనవనీ, తాడుతో గొడ్డలిని నరకడం సాధ్యంకా దనీ దానికి క్షుణ్ణంగా తెలుసును. అందుకని అది సామెతలను నెమరు వేసుకొంటూ తన మానాన తాను హాయిగా బ్రతుకు తున్నది. అదృష్టమంటే నీదే ముసిలితట్టూ. హాయిగా బ్రతుకు !"

'అది కాదోయ్' అంది మరొక పనికిమాలిన వాజీ.

"దాని కా సత్తువా ఆ ఓపికా లోకజ్ఞానంవల్ల వచ్చినవికావు. అసలు లోకజ్ఞాన మనగా ఏమిటి ? లోక జ్ఞాన మనేది అతి సామాన్య మైనది — అందరి లోనూ వుండేదే అది. ఒక లెక్కను కట్టడానికో ఒకపోలీసు శ్రీముఖాన్ని అర్థం చేసుకోవడానికో అది పనికివస్తుంది. మన తట్టులో గల అనంతి తాన్యానికి కారణం ఆ లోకజ్ఞానంకాదు. దానిలో గలది జీవనతత్వం, తాత్విక జీవనం. ఈ రెండు నిక్షేపాలూ దానిలో వున్నంతకాలం ప్రపంచంలోని ఏ కర్రా కూడా దాని నడుమును విరగగొట్టజాలదు."

మూడవది ఇలా అంది :

"నీవు చెప్పేదానికి అర్థంలేదు. 'జీవనతత్వం తాత్విక జీవనం' ఏమిటి ? పదాలతో గారడీ చేస్తున్నావంతే. ముసిలి తట్టు అజేయ గుణానికీ నీవు చెప్పేదానికీ సంబధం ఏమీ లేదు. అది తనజీవిత లక్ష్యాన్ని కనిపెట్టింది. అసలు కారణం అది ! దానివల్లనే దానికి స్థితప్రజ్ఞ అలవడింది. తననుచూసి, తన వర్ణాన్ని చూసి తృప్తి పడగలుగుతున్నదంటే దానికి కారణం అదే. అపార శక్తీ, యుగ యుగాల దాస్యంకూడా జయించ జాలని దిట్టతనమూ, అందువల్లనే కలిగాయి. కష్టం

చేయమ్మా ముసలితట్టూ. నీ పని యథాప్రకారం కొన సాగించు! పనికిమాలిన వాజెలమైన మాకు హృదయ నైర్మల్యం ఏనాడో నశించింది. నీ పనిలో నీ కది లభించు గాత!"

అప్పుడు నాల్గవది (అది తిన్నగా సారా పాకనుంచి అస్తబలుకు వచ్చింది) ఇలా అంది:

"ఓహోహో! మహాశయులారా అనవసరంగా కంఠ శోషకు పాల్పడుచున్నారు. తట్టుమీద ఏదీ పని చేయ లేక పోవడానికి ప్రత్యేకంగా దానిలో మహాత్తు ఏదీ లేదు. తర తరాలనుంచీ ఈ దుర్భర జీవితానికి అది అలవాటుపడి పోయింది. ఒక చెట్టును దాని నడ్డిమీద ముక్కలు చేయండి అయినా అది బ్రతికే వుంటుంది. అదుగో అటుచూడండి. అసలు వూపిరి వుందా లేదా అని కూడా అనుమానం వస్తుంది. కాని కొరడాతో తగిలించవసినచోట తగిలించండి. అదే ముందుకు సాగుతుంది. ఎవరికి నియతమైన పనిని వారు చేస్తారు. పొలంనిండా ఇలాంటి తట్లు ఎన్ని ఈడిగిల పడు తున్నాయో లెక్కకట్టడానికి ప్రయత్నించి చూడండి. అన్నీ ఒకలాగే ఉన్నాయి కదూ? అందులో మీకు చేతనై నన్నింటిని పనికిరాకుండా చేయండి. అయినా ఆ సంఖ్య ఏమాత్రమూ తగ్గదు. ఈ క్షణంలో అది మాయమైపోతే, మరొక క్షణంలో భూమిని చీల్చుకొని పుట్టుకొస్తుంది."

ఇదంతా ఉబుసుపోక కబుర్లుతప్ప మరొకటికాదు. అందుకని వాటిలో వాటికి రోషాలు పుట్టేనరకూ ఈ బాతా ఖానీ ఇలాగే సాగిపోయేది. కాని, అదృష్టవశాత్తూ ఆ సమ

యానికి రైతు మేల్కొని "హెహెహె దొంగముండా నడు నడు" అని అదిలించడంతో ఈ తగాదా ముగిసిపోయింది.

దానితో పనికిమాలిన వాజెల ముఖాలు వికసించాయి.

"చూడండి! చూడండి!"అని చోద్యంచూసే ధ్యాసలో తగాదాలు మరిచిపోయాయి.

"చూడండి, ఆ ఎముకల గూడును ఎలా సాగదీస్తున్నదో ముందుడెక్కలను తన్నిపట్టి వెనకకాళ్లతో ఆ కాయాన్ని ఎలా నెట్టుతున్నదో! మంచి పనివాడెప్పుడూ పని చక్కగా చేస్తాడు మరి! అలాగే సాగించుతట్టూ, అలాగే సాగించు! చూసి నేర్చుకొనడానికి ఎవరో ఒకరు కావాలి. దీన్నిచూసి నేర్చుకొందాం "హె హె హె దొంగముండా నడు నడు!"





# పోసుకోలు

ఇప్పుడు లేదుకాని ఒకప్పుడు అత్యున్నతోద్యోగులలో వోల్టైర్ పంథీయులు చాలామంది వుండేవారు. అత్యున్నతాధికారులు ఆ పంథాను మెచ్చుకొనేవారు. తక్కువవారు అనుసరించేవారు.

ఆ కాలంలోనే ఒక గవర్నరుండేవాడు. ఇతరులు అమాయకత్వంవల్ల నమ్మే అనేక విషయాలమీద ఆయనకు అనుమానం వుండేది. అసలు ఈ గవర్నరు పదవి ఎందుకో ఆయనకు ఎంత కొట్టుకొన్నా అర్థమయేదికాదు.

అదే రాష్ట్రంలోవున్న ఖిల్లేదారు ఇందుకు పూర్తి విరుద్ధం. ఆయన అన్నింటినీ నమ్మేవాడు. గవర్నరు పదవి ఎందుకో కారణాలన్నీ ఆయన జిహ్వాగ్రమందుండేవి.

ఒకరోజున ఉభయులూ గవర్నరుగారి కచేరీ సావిడిలో కూర్చుని వాదన మొదలుపెట్టారు.

"మనలో మనమాట" అని ముందు గవర్నరు ఎత్తాడు.

"నా కసలేమీ అర్థం అవడంలేదు. మా గవర్నర్ల సందర్శ్ని చడీచప్పుడూ లేకుండా బర్తరఫుచేస్తే అసలెవరూ పట్టించుకోనే పట్టించుకోరు."

"దొరగారు అలా అనడం చిత్రంగావుంది" అని సంభ్రమాశ్చర్య భయాలను ప్రదర్శించాడు ఖిల్లేదారు.

"ఇది మనలో మనమాట. చాలా రహస్యం...నిజం చెప్పాలంటె నా కర్థం అవడంలేదు. ప్రజలు ప్రశాంతంగా బ్రతుకుతున్నారు. దేవుడన్నా, చక్రవర్తిఅన్నా భయంభక్తులున్నాయి. అలా వుండగా వారి పాలిటికి ఒక గవర్నరును పంపించారు. ఎందుకు? ఏం పనికోసం? ఏం కారణంమీద?"

"ఎందుకేమిటి అధికారం నిర్వహించడంకోసం" అని ఖిల్లేదారు మందలింపు ధోరణిలో అన్నాడు.

"అది లేకుండా వుండడం సాధ్యమా? అందరికన్నా పైన గవర్న రుంటాడు. మధ్యలో పోలీసు అధికారి. ఆఖరున వుండేవాడు సుంకరి. వారిచుట్టూ ఖిల్లేదార్లు, సర్దార్లు సిపాయిలు..."

"అవును అది నాకు తెలుసును. అయితే ఎందుకు అనేది నా ప్రశ్న. మీరన్న ఆ సుంకరి వున్నాడే వాడు రైతులమీద ఒక కన్నువేసి వుంచుతాడు. వినడానికి న్యాయంగావున్నట్లే అనిపిస్తోంది. అయినా ఆలోచించి చూడండి: రైతు ప్రశాంతంగా తన పల్లెలో బ్రతుకుతాడు.

మున్నతాడు. కోస్తాడు. గుణిస్తాడు. పెంపొందిస్తాడు. ఒక్క మాటలో చెప్పాలంటే జీవిత చంక్రమణాలు చేస్తాడు. అలాంటప్పుడు హఠాత్తుగా మింటినించి ఊడిపడతాడు సుంకరి. ఎందుకు? ఏమయిందని?"

"ఇంకా ఏమీ కాలేదు. అయినా తమకు చెప్పలేరండీ దొరగారూ!"

"అదికాదు. ప్రజలు సంతృప్తితో ప్రశాంతంగా బ్రతుకుతూ వున్నప్పుడు, దైవభక్తీ, రాజభక్తీ వున్నప్పుడు చెడుపెలా జరుగుతుంది? అంటే మంచిమాత్రం ఎలా జరుగుతుంది? ఏం జరిగినప్పటికీ సుంకరి చేయగలిగిం దేమిటి? దేవుడు దయదలిచి మంచిపంట పండిందా మంచిదే. లేదా వా రెలాగో ఒకలాగ కాలంగడపాలి. ఇక సుంకరి, వాడు ఒక గింజ నెక్కువకాని, తక్కువకాని చేయగలడా? చేయలేడు. వాడికి చేతనైనదల్లా ఊడిపడడం. హంగామా చేయడం. వీలైతే ఎవరినో ఒకర్ని పట్టుకొని బందిఖానాలో తొయ్యడం! వాడు చేయగలిగిన పనల్లా అంతే."

"కాని జనాన్ని ఊరికే బందిఖానాకు తోలరుకదా? దానికేదో తప్పకుండా ఒక కారణం వుంటుందండీ దొరగారు!"

"సుంకరి అనేవాడు మధ్యనరాకుండావుంటే అంతా మామూలుగా గడిచిపోయేదనీ, మీరన్న ఆ యేదో జరగకుండానే వుండేదనీ ఒప్పుకోక తప్పదు. ఏమైనప్పటికీ ఎవరూ జైలులో వుండేవారు కాదు. నేను చెప్పదలుచుకున్న దిదీ: సుంకరి రంగంమీదికి వచ్చిన మరుక్షణంలో ఆ 'యేదో' జరిగి తీరుతుంది.

"మరి సుంకరులలో మంచివారూ వుంటారు, చెడ్డ వారూ వుంటారు."

"నేను చెప్పేది వినండి మరి. నేను వ్యక్తులను గురించి చెప్పడంలేదు. విచిత్ర వ్యవహారాలను గురించీ చెప్పడం లేదు. ఈ వ్యవహారం నాకు బాగా తెలుసును. నా అనుభవం సంగతే చెప్పుతున్నాను. ఉదాహరణకు నేనీ రాష్ట్రాన్ని విడిచిపోయా ననుకోండి. అప్పు డేమవుతుంది ? నేను గడప దాటకముందే గాలికూడా స్థిమిత పడుతుంది. పోలీసు అధి కారి పరుగులు కట్టిపెడతాడు. అతని జవాన్లు చిందులు మానుతారు. సుంకరులు కూడా తమ ఉత్సాహానికి పగ్గాలు తగిలిస్తారు. నన్నేనాడూ చూసి ఎరగని అమాయకులు కూడా బ్రతుకులో ఏదో తెరిపిచ్చినట్లు, పక్కలో బాధిస్తున్న బల్లాన్ని తీసివేసినట్లు భావిస్తారు. దానికర్థం ఏమిటంటారు ? అయ్యా దానికర్థం ఇది : నాకు మారుగా వచ్చిన వ్యక్తి నాలాగ దండించలేదు. దానివల్ల అందరికీ జీవితం ఆ మేరకే తెరిపిచ్చి నట్లు అనిపిస్తుంది. నాస్థానే వచ్చిన ఉద్యోగికన్నా నేనెంత పెద్ద ఉద్యోగినో ఆ మేరకు తెరిపిస్తుందన్నమాట. కాని నేను తిరిగివచ్చి పనిలో చేరేసరికి రొద, హంగామా, పరుగులు అన్నీ మొదలౌతాయి. తెల్లబట్టలు కట్టుకొని తిరిగినవాడు మళ్ళీ నీరుకావిగుడ్డలకు వస్తాడు. హుషారుగా కాలం గడిపిన వాడు తిరిగి చీకాకులో పడతాడు. అందరికీ దుర్భరమైన ఆ పాతబ్రతుకే తిరిగి ప్రత్యక్ష మవుతుంది. ఇదంతా మీ కెందుకు చెపుతున్నానంటే మీకుకూడా ఇది ఇంతో అంతో అనుభవమై వుంటుందని."

నిజమే. ఖిల్లేదారు గతాన్ని జ్ఞాపకం తెచ్చుకొంటు న్నాడు. అతడుకూడా ఈ విషయంలో ఒక విధంగాచూస్తే దోషేమరి. గవర్నరు ఎక్కడికైనా సెలవుమీద వెళ్ళినప్పుడు బగ్గీ పూన్పించి తన పల్లె భవంతికి పోయేవాడు. మళ్లీ అధికారి దగ్గరనుంచి (శ్రీ)ముఖం వచ్చేవరకు అక్కడ ఏ పటాటోపమూ లేకుండా పొద్దుపుచ్చేవాడు. పాటించవలసిన అధికార మర్యాద చిన్నదొకటే వుండేది. అది ఊరుకు వెళ్లేముందు ఉపగవర్నరుగారిని ఒకసారి దర్శించడం:

"అవసరంవస్తే కబురంపించడం మరిచిపోకండేం..."

"మరేం ప్రమాదంలేదు. హాయిగా వెళ్లండి."

"అయితే సెలవు మరి! మీ వారికి నా నమస్కారాలు చెప్పండి! ఇకవస్తా!"

ఇంతకుమించి గొడవ పడనక్కర లేకుండానే పల్లె బసకు బయలుదేరేవాడు.

"నిజమే. అప్పుడప్పుడు అలాగే జరుగుతుంది. అయితే అది మీరన్నట్లు మాత్రం కాదు. ఎవరికైనా అప్పుడప్పుడు విశ్రాంతి కావాలి. అందుకని అవకాశం దొరికినప్పుడు..."

"విశ్రాంతి! అక్కడే మళ్ళీ తప్పుడు ధోరణిని పడుతున్నారు. అసలంతకుముందు విశ్రాంతి తీసుకొనకుండా మిమ్మల్నెవరు అడ్డుపెట్టారు? విశ్రాంతి తీసుకొనడం పాపం కాదే? అవునా? కాదుకద! ఎన్నటికీ పాపంకాదు. నేను గవర్నరును కాబట్టి మీకు విశ్రాంతి నివ్వలేనంటారా? ఇంకొంచెం ముందుకు వెళదాం పదండి. జనం గవర్నరును పొగడాలనుకొన్నప్పుడు ఏమంటారో ఎప్పుడైనా విన్నారా?

'మా గవర్నరు గారెంత మంచివారు! ఆయన ఎన్నడూ హంగామా చేయరు. జనాన్ని వారిమానాన వుండనిస్తారు!' అంటాడు. అంటే మంచి గవర్నరైనవాడు ఏమీ చేయకుండా ఊరికే కూర్చోవాలన్నమాట. అదీకాక ఇతరుల వ్యవహారాల్లో వేలుపెట్టడంవల్ల కలిగే ప్రయోజనం ఏమిటి కాస్త ఆలోచించండి. తాను వచ్చేసరికి గవర్నరుకు రాష్ట్ర మంతా కొత్త. అది మొదటి విషయం. రెండవది అతడెప్పు డైనా ఏదైనా తెలుసుకొన్నా డనుకోండి. అదెప్పటికీ సరి యైనదై వుండదన్న విషయం ఖాయం. అందులో సందేహం లేదు. లెక్కల సంగతికాని, అక్కడి జాతుల సంగతికాని, జనుల ఆచార వ్యవహారాల సంగతికాని అతడికేమీ తెలిసి వుండదు. ఆ విషయంలో కావలిస్తే పందెంకాయండి. రాష్ట్ర మంతటా నాలుగైదునార్లు కలయదిరిగిన మీదటకాని ఒక నది ఎక్కడనుంచి ఎక్కడికి ఎలాగ ఎందుకు పారుతున్నదో తెలియదు. ఇక రైల్వేల విషయం: అతడికి తెలిసినదల్లా టైంటేబిలు మాత్రమే. అదైనా తన రైలు తప్పకుండా వుండడంకోసం. కాని ఆ రైలుమార్గాన్ని ఎందుకు వేశారు. దానిమీదవచ్చే లాభమెంత. మరొక కొత్తమార్గాన్ని ఎక్కడ కలపవలసిన అవసరంవుంది అన్న విషయాలుమాత్రం అతని కేమీ తెలియవు. అతడు కావాలనుకొంటే విషయాన్ని పూర్తిగా గ్రహించగలడు. అన్ని అంశాలూ అందుబాటులో వుంటాయి. కాని బద్ధకం, అజ్ఞానం. ఒకవేళ తెలుసుకొన్నా దానివల్ల ఒరిగేదికూడా ఏమీ వుండదు.

"ఇక మనచేతి పరిశ్రమలు, వృత్తులసంగతి చూద్దాం. పాదరక్షలు చేస్తారు. పళ్లు, కూరగాయలు అమ్ముతారు. ఇక్కడ నారచాప లల్లుతారు. అక్కడ కొడవళ్ళు, గొడ్డళ్ళు చేస్తారు. ఎందుకు చేస్తారు! ఎక్కడ చేస్తారు? చలికాలంలో ఈగలన్నీ ఎక్కడికి పోతాయనికూడా అడగవలసి వుంటుంది. అవునా?"

"కాని దొరగారూ! నే నీ ప్రాంతంవాణ్ణే, అయినా నాకా విషయాలన్నీ తెలియవు మరి!"

"మీ సంగతి వేరు. మీరు ఖిల్లేదారులు. విందుకు పసందుగా మాంసం తెచ్చి ఇస్తారు. అది రుచిగా వుంటే చాలును. అదెక్కడనుంచి వచ్చిందో మీకేంపట్టింది? కాని నే నలాకాదు. నేను గవర్నరుని. నా కన్నీ తెలిసివుండాలి. 'మీ రాష్ట్రంలో తోటల ఫలసాయం ధరవరు లెలా వున్నాయి?' అనెవరైనా నన్ను అడగవచ్చును కదా!"

"కాదు మరీ! ఈ రోజుల్లో ఏమైనా జరుగుతుంది."

"అయ్యో ఈ రోజుల్లో ప్రతిపైసకూ లెక్కచూపాలి. ప్రతిచెత్తనీ చిత్రాలివ్రాసి వుంచాలి. 'దానిమీద పన్ను సంగతేమిటి?' అదీ ఈనాటి పరిస్థితి. చిక్కులు రాకుండా తప్పుకోవాలంటే 'చాలా అవసరమండి!' అని జవాబు చెప్పడం ఒక్కటే శరణ్యాం."

"అవును నిజమే! అయినా మన కేబేజీ..."

"అవునా మరి? కేబేజి. నేను దాని సంగతి నిన్ననే విన్నాను తెలుసునా? నాకు కేబేజికూర వడ్డించారు. అది

బహుశా ఆల్జీరియానుంచి వచ్చిందేమోనని నే ననుకొన్నాను. కాని అది మన వూళ్లోనే పండుతోందట !”

“నిజమే! చాలా ఆశ్చర్యంగావుంది. మన వూళ్లో పండే వేమిటి ? ముల్లంగి, కోసుదుంప, అన్నిరకాల ఆకుకూరలు. మన సంగతి ఎప్పుడూ అంతే. ఆరోగ్యజలాలకోసం మనం మరియంబాదు వగైరా వగైరాలకు వెళతామూ ? కాని ఇక్కడే మన వూళ్లోనే ఖనిజజలాలు వున్నాయి. పైగా ఈ నీళ్ళు మంచివికూడాను. మరియంబాదు సరుకులాగ కడుపులో గుండించవు ఇవి.”

“మన వూళ్లో మొట్టమొదట కేబేజి నాటిం దెవ రంటారు ? గవర్నరా ? చస్తేకాదు. సామాన్యమైన ఒకానొక రైతు. చాలా కాలం కిందట అత డొకసారి దూర ప్రాంతాలకు వెళ్లాడు. అక్కడ కేబేజి పండించడం చూశాడు. స్వస్థలానికి చేరుకొన్న తర్వాత తానుకూడా అలాగే పైరు చేయాలనుకొన్నాడు. అంతే; కేబేజి పండుతోంది.”

“నిజమేనండి” అని ఖిల్లేదారు ఒప్పుకొనక తప్పలేదు.

“ఈ ప్రాంతాలలో అన్నివృత్తులూ అలాగే అతుకుల బొంతలలాగ వచ్చినట్లనిపిస్తోంది. ఒకస్థలం స్వర్గంలాగ కనిపిస్తుంది. దానికి సరిగా అరమైలు ఆవల నేలంతా మన అరచేయిలాగ బోడిగా వుంటుంది. మన వూరికి పక్కనేవుంది పాడూరు. అక్కడ ఒక్క తోటకూడా కానరాదు. అక్కడి రైతులంతా ఉన్నిపని చేస్తారు. వేసవిలో రైతులందరిలాగే వారుకూడా పొలంపనులు చేస్తారు. శీతాకాలంలో ఉన్నిపని చేస్తారు. ఆ వృత్తిని గవర్నరు ప్రవేశపెట్టాడంటారా ? లేదు.

ఎవడో ఒక సామాన్యమైనరైతు పొరుగు రాష్ట్రానికి వెళ్ళి ఆక్కడనుంచి ఈ వృత్తిని తీసుకొని వచ్చాడు. అన్నీ ఎలా వున్నాయో చూశారా? కేబేజీలు, దోసకాయలు. వున్ని, పాదరక్షలు, నారచాపలు, అన్నింటినీ సామాన్య ప్రజలు కొనివచ్చారు. మనవూరి గుళ్ళో గంటగోపురం కట్టించిన దెవరు? గవర్నరా? కాదు. ప్రముఖ వర్తకుడు లాభాల లోభయ్య కట్టించాడు. గవర్నరు దాని ప్రారంభోత్సవానికి వచ్చి చాపకూర పీకల మొయ్యా ఆరగించాడు."

"నిజమేనండి. అక్షరాలా నిజం."

"అసలీ దేశంలో మొదట ఉప్పుడు చాపల పద్ధతిని కనిపెట్టిం దెవరు?"

"ఎవరైతేనేం. గవర్నరు మాత్రంకాదు."

"పులసచాపలుపట్టే పద్ధతి గాలికాయు లేరే పద్ధతి, బాసిబూరె, నానాలడ్డూలు చేసేపద్ధతి ఎవరు తెచ్చారంటారు? గవర్నరు మాత్రం కాదు. ఏమంటారు?"

"ఒక్క విషయం దొరగారూ! పళ్ళు, పచారిదినుసులు కాక ఇతర విషయాలు కూడా చాలావున్నాయి మరి."

"ఉదాహరణకు?"

"పన్నులు, వాటి వసూళ్ళు మొదలైన వ్యవహారాలు."

"పన్నులంటే ఏమిటి? మీకేమైనా ఒక అభిప్రాయం వుందా?"

"పన్నులు అంటే...అంటే—

ఒక విధంగా అవి...హక్కుకు ఫలితం అన్నమాట" అని ఖల్లేదారు ఏదో మొదలుపెట్టాడే కాని మాటలు తడబడి సాగక ఆపివేశాడు.

"అదే నే ననేది! ఫలితమట! ఛీ! ఈ ఫలితాన్ని గురించి సంతోషించ దగ్గదేమైనా వుందని మీరనుకొంటు న్నారా? పన్నులు వసూలుచేసే వాళ్ళను చూడండి. ఎంత సంతోషమో! అన్నింటిమీదా పన్నులు! ఆ వూరు నుంచి దోస వూరగాయ రహస్యాన్నో ఈ వూరునుంచి ఎండుమాంసం కీలకాన్నో అతడు తీసుకొని వచ్చివుంటే బాగుండేది. కాని అదికాదుగదా. పన్నులు పిండడానికి వస్తాడు. అయ్యా! మన వూళ్లో కేబేజిపంట పాడైపోతే ఈ ఫలితాన్ని నేనెలా రాబట్టగలుగుతా ననుకొన్నారు? అప్పుడు నా ప్రసక్తి ఎలావస్తుంది? నేను పోలీసు అధికారికి ఒక ఉత్తరువు చేస్తాను. వాళ్ళు రాష్ట్రిమంతటా హంగామా లేవ నెత్తుతారు అంతే. ఏమయినా నే నిక్కడున్నది వారికి పని కల్పించడంకోసం. అదెందుకో నాకు తెలిసివుంటే పీకకు ఉరి పడుతుంది! పోలీసు అధికారి హత్యాకాండ మొదలుపెడ తాడు. ఎందుకో అతడికే తెలియదు. ఇదంతా ఏమిటి? ప్రభుత్వం వసూలుచేసే పన్నులన్నీ ఎక్కడికి పోతున్నాయి? పంటలుపాడై రైతుచేతిలో చిల్లిగవ్వ లేకపోయిందా? అతడు తాగుడు కలవాటుపడి చితికిపోయాడా? వడ్డీవ్యాపారి అతడిని నిలువుదోపిడీ చేశాడా? ఉన్నడబ్బును కుండలో దాచి రైతే నాటకమాడుతున్నాడా? ఇలా ఎన్నో కారణాలు కనిపిస్తాయి. అయితే వాటితో మాకేం నిమిత్తం? నేం మీదపడతాం. హంగామా చేస్తాం. వారి మొరలను చెవిని పెట్టం. పన్నులు చెల్లించు అంతే. మాకు తెలిసినదల్లా అదొక్కటే!"

"అదినిజమే! వస్తారు; హంగామా, ఆర్భాటం చేస్తారు. రైతుల మొలలుకూడా తడివిచూస్తారు. ఇలా ఎందుకు చేస్తారో ఆ పరమాత్మునికే తెలియాలి" అని ఖిల్లేదారు కొంచెం విచారంతో అన్నాడు.

ఒక క్షణంసేపు ఇద్దరూ మిన్నకున్నారు.

ఆ నిశ్శబ్దాన్ని తొలుత భేదించినవాడు ఖిల్లేదారు. ఇంకా మరొక వాదన ఏదోవుంది. ప్రజల్లో, నీతి, విద్య, కళలు, శాస్త్రాలు వీటి సంగతేమిటని అడుగుదామనుకొన్నాడు. ఇంతలో ఆలోచనా మగ్నుడైనట్లు కనిపిస్తున్న గవర్నరు ఒక్కసారి అదోలాగ చూసేసరికి ఖిల్లేదారు ఏదో గొణిగి ప్రజల తిండీ సరఫరా విషయాన్ని ప్రస్తావించాడు.

"సిగ్గు వేయడంలేదూ ?" అని గవర్నరు వెంటనే మొహంమీద అనేశాడు.

ఖిల్లేదారు మొహం సిగ్గుతో జేవురించింది. కొద్ది రోజులక్రితం స్థానికసభ అధ్యక్షుని హోదాలో దేశమంతా పర్యటనచేసి వచ్చాడు. అప్పటి స్మృతులతో పూర్తిగా గందరగోళంలో పడ్డాడు.

"అయినా నిజంగా అది..." అని ఆశ్చర్యం ప్రకటించాడు. అంతలో ఏదో కొత్తఊహ తట్టింది: "ఒక్క క్షణం దొరగారూ మీారు చేయవలసిన దొకటుంది. సమాజాన్ని సంఘటితపరిచే చర్యలను గురించి ఏమంటారు ?"

"ఏ సమాజాన్ని ?"

"ఇదే. మన స్థానిక సమాజాన్నే."

"ఊఁ. అయితే సమాజాన్ని సంఘటితం పరచడానికి నేనేదో చేయాలంటారు ?"

"తప్పకుండా మీరూ, మీ సతీమణిగారూ..."

"సతీమణిగారు బహుశా చేయవచ్చును. కాని అది నావల్ల కాదు. అయ్యా మనవిచేస్తున్నాను, అదిమాత్రం నావల్ల కాదు. అసలు సమాజాన్ని ముఖ్యంగా మన సమాజంలాంటి దాన్ని సంఘటితం పరచడంవల్ల ప్రయోజన మేమిటి ?"

సంభాషణ పాకాన పడుతోంది. సమయానికి కోశాధికారి అక్కడికి రాకపోతే ఆ చర్చ బహుశా ఇద్దరినీ ఇరకాటంలోకి ఈడ్చేదేమో కూడా.

అది ఆ నెల ముప్ఫయ్యవ తేదీ. పూర్వం ఆ రోజున అధికారులకు జీతాలందేవి. సర్కారు కచేరీల్లో కోశాధికారులు పెద్దపెద్ద చిఠాపుస్తకాలు, డబ్బుపెట్టెలు పట్టుకొని తమ పైఅధికారులవద్దకు వచ్చేవారు. చిఠాలు నిండినకొలదీ పెట్టెలు ఖాళీఅయేవి.

కోశాధికారి ఇచ్చిన నోట్లను తీసుకొని గవర్నరు తాపీగా లెక్కపెట్టుకొన్నాడు. తర్వాత వాటిని బల్లమీద పెట్టి పుస్తకంలో సంతకం చేశాడు.

"దాని కేమంటారండి" అని అడిగాడు ఖిల్లేదారు నోట్ల కేసి కొంటెగా చూపుతూ.

"ఓ ... ఇదంటారా ?" అని గొణిగాడు గవర్నరు అప్పుడే ఏదో మేల్కొన్నవానిలాగ.

"అవును అదే."

"అదా – అది...చేసిన సేవకు ఫలితం !"





# మహావీరుడు

ఒకానొక దేశంలో మహావీరుడు పుట్టాడు. తల్లి పేదరాసి పెద్దమ్మ. మహావీరుడు పెరిగి పెద్దవాడయ్యే వరకూ ఎంతో గోముగా చూసింది. తర్వాత తన కొడుకును వీరకృత్యాలు చేయవలసిందని బుద్ధులు చెప్పి ప్రపంచం మీదికి పంపి తాను పారలౌకిక చింతలో మునిగింది.

మన మహావీరుడు తిన్నగా అడవికి బయలుదేరాడు. అక్కడొక సాలవృక్షం కనిపిస్తే దాన్ని వేళ్ళతోసహా పెకలించి విసిరేశాడు. మరొక సాలవృక్షాన్ని ముష్టిఘాతంతో ముక్కలు చేశాడు. మూడవ వృక్షాన్నెక్కి దాని తొర్రలో పడుకొని నిద్రపోయాడు.

అతని గురకకు అడవిలోని చెట్లన్నీ అల్లాడి పోయాయి. జంతువులన్నీ నెలవులువిడిచి పరుగులు పెట్టాయి. పిట్టలు కూడా ఎగిరిపోయాయి. ఆఖరికి దెయ్యాల సంరక్షకుడైన దెయ్యం కూడా భార్యా బిడ్డల్ని తీసుకొని పారిపోయింది.

మహావీరుని కీర్తి ప్రపంచమంతా వ్యాపించింది. దేశీయులు, విదేశీయులు, మిత్రులు, శత్రువులు, అంతా అతని శక్తికి ఆశ్చర్యపోయారు.

దేశీయులు ఎవరినో ఒకరినిచూసి భయపడనిదే ఉండ లేరు కాబట్టి మహావీరుని చూసి భయపడేవారు. అదీకాక ఒక ఆశకూడా వుండి. మహావీరుడు నిద్రలో ఇంకా బలాన్ని పొందటంకోసం తొర్రలో పడుకొన్నాడు. అందులో సందేహం లేదు. "మహావీరుడు మేల్కొనేవరకూ వుండు, అప్పుడతడు మన దేశానికి ప్రపంచ ప్రఖ్యాతి తీసుకొని వస్తాడు" అనేది వారిఆశ. విదేశీయులు కూడా భయపడుతూ వుండేవారు. "విన్నావా భూదేవి మూల్గులు ? ఈ దేశంలో ఒక మహా వీరు డవతరించాడు. మనం జాగ్రత్తగా వుండాలి. అతడు లేచాడంటే మన పని పట్టించవచ్చును" అని వారి భయం.

అందుకని అంతా మునివేళ్ళమీద నడుస్తూ "నిద్రపో మహావీరా ! నిద్రపో !" అని సన్నగా చెవిలో వూదినట్లు అనేవారు.

వందవళ్ళు గడిచాయి. రెండువందలు, మూడు వందలు, కొసకు వెయ్యేళ్ళు గడిచాయి. ఆఖరికి అనుకొన్న రోజుకూడా వచ్చింది. రాజు కొడుకులు పట్టిన పడుచేపల్లో

ఒక చేపకూడా ఎండిపోతుంది. రైతు చెమట ఓడ్చిఓడ్చి ఇక ఓడ్చడానికేమీ మిగలక మానేసేరోజు వచ్చింది.

వ్యవహారమంతా పూర్తిఅయింది. లావాదేవీలు ఫైసలయ్యాయి. ప్రతివారూ ఇతరుల్ని నిలువుదోపిడి చేశారు. అయినా మహావీరుడింకా నిద్రపోతూనే వున్నాడు. రాజు వారిన అతనికళ్ళు తొర్రలోంచి సూటిగా సూర్యుణ్ణి చూస్తు న్నాయి. అతనిగురక వందలమైళ్ళ పర్యంతం ప్రతిధ్వనిస్తోంది.

శత్రువులు చాలా కాలం అదనుకోసం ఎదురుచూశారు. అలా ఎదురుచూస్తూ "అది చాలా బలంగల దేశమై వుంటుంది. అక్కడొక మహావీరుడు తొర్రలో నిద్రపోతు న్నందుకు జనం భయపడి చస్తున్నారు" అనుకొన్నారు.

కాని క్రమక్రమంగా వారు విషయాలను గుచిగుచ్చి చూశారు. ఆ దేశాన్ని ఉపద్రవాలు ముంచెత్తినప్పుడుకూడా మహావీరుడు తన దేశీయులను ఉద్ధరించని ఆ రోజులను గుర్తుకు తెచ్చుకున్నారు.

ఒక ఏడాది ఆ దౌర్భాగ్యులు అడివి మృగాల్లాగ పోట్లాడుకొన్నారు. చాలామంది చనిపోయారు. ఇంతకూ కారణం ఏమీలేదు. అప్పుడు ముసలివారు చాలా విచా రించారు. "నాయనా మహావీరా! లేచిరావయ్యా! ఈ అన్న తమ్ముల కుమ్ములాటను తుద ముట్టించవయ్యా" అని మొర పెట్టుకొన్నారు. వారి మొరాలించి రావడానికి బదులు మహా వీరుడు అలాగే నిద్రపోయాడు. ఒకయేడు పొలాలన్నీ ఎండకు ఎండి బీళ్ళయిపోయాయి. మొలిచిన నాలుగుమొక్కలూ

వడగళ్ళ వానకు దెబ్బతినిపోయాయి. అప్పుడు మహావీరుడు వచ్చి అందరికీ అన్నం పెడతాడని ఆశించారు. కాని మహా వీరుడు తొ్రలో గుర్రుపెట్టాడేగాని రాలేదు. ఒక సంవత్సరం పట్నాలూ, పల్లెలూ అన్నీ పరశురామప్రీతి అయ్యాయి. ప్రజలకు కూడూ గుడ్డా కరువయింది. మహావీరుడు వచ్చి ఈ బాధలనుంచి కడతేరుస్తాడనుకొన్నారు. కాని ఈసారికూడా ఆయన నిద్ర లేవలేదు.

సరే కథ నింతటితో తుంచేయాలంటే ఆ దేశం ఈ వేయి సంవత్సరాలలోనూ ఊహాకందిన అన్ని ఉపద్రవాలకూ గురైందని చెప్పవచ్చును. కాని ఒక్కమారుకూడా మహా వీరుడు కన్ను తెరిచి చూడలేదు. ప్రజల హాహాకారాలు దేశమంతటా ఇలా ఎందుకు ప్రతిధ్వనిస్తున్నాయని వీనులొగ్గి వినలేదు.

ఇదేమి మహావీరుడయ్యా అని మీరు అడగవచ్చును.

ఆ దేశం చిరకాలం బాధ లనుభవించింది. అందుకని దానికెంతో ఓరిమి అలవడింది. దానికి అచంచలమైన విశ్వాసం కూడావుంది. ప్రజలు శాకిశోకాలు పెట్టారు. అయినా వారి కొక నమ్మకం వుంది. తమ కళ్ళల్లో నీరిగిరిపోయిన మరు క్షణంలో మహావీరుడువచ్చి రక్షిస్తాడని వారి నమ్మకం. ఇప్పుడా రోజు వచ్చింది. అయితే ఇది ప్రజలు అనుకొన్న రోజుమాత్రం కాదు. శత్రువులు చెలరేగారు. మహావీరుడు తొ్రలో నిద్రిస్తున్న ఆదేశంమీద దండు వెళ్ళాడు. వారు తిన్నగా అతని సాలవృక్షంవైపు నడిచారు. అందులో ఒకడు

అదిచూచి అడుగులు వేస్తూ చెట్టువద్దకు వెళ్ళాడు - కంపు కొట్టింది. మరొకడు వచ్చాడు అతని ముకుపుటాలు బ్రద్ద లయ్యాయి. "ఛీ ఛీ! ఈ మహావీరుడు పూర్తిగా కుళ్ళిపో యాడు!" అన్నారు శత్రువులు. వారా దేశాన్ని ముట్టడిం చారు.

శత్రువులకు దయాదాక్షిణ్యాలు లేవు. వారు చాలా క్రూరులు. కంటికి కనిపించినదాన్నల్లా తగలబెట్టారు. శతా బ్దాలు మహావీరుని భయంతో అణచిపెట్టిన కసిని ఇప్పుడు మనసారా తీర్చుకొంటున్నారు. మరొక పెద్ద ఉపద్రవం ఎదు రయేసరికి ఆ దౌర్భాగ్య ప్రజలు ఇంకా శోచనీయ స్థితిలో పడ్డారు. శత్రువు నెదిరించడానికి పరుగెత్తారు కాని, పాపం ఎదిరించడానికి చేతిలో ఏదీలేదు.

"వారు తమ మహావీరుని తలుచుకొన్నారు. ఒక్క గొంతుతో మొరబెట్టారు :

"త్వరగా రా! మహావీరా త్వరగా రా!"

అప్పుడొక అద్భుతం జరిగింది. మహావీరుడు కదల్లేదు! వేయేళ్ళ పూర్వంవలెనే ఇప్పుడుకూడా చలనంలేని శిరస్సు, అందులో గాజువారిన కళ్ళు. ఆ కళ్లు సూర్యుణ్ణి చూస్తూనే వున్నాయి. కాని అడవినంతనీ కంపింపచేసిన ఆ భీషణమైన గురకమాత్రం ఇప్పుడు లేదు.

సరీగా అప్పుడే పరమానందయ్య మహావీరుని వద్దకు బయలుదేరాడు. ఒక ముష్టిఘాతంతో సాలవృక్షాన్ని తునా

తునకలు చేశాడు. ఓహో! ఏమిటిది? మహావీరుని కాయాన్ని కంఠం వరకూ చెదలు తినేశాయి. నిద్రపో మహావీరా నిద్రపో...'





# సత్యాన్వేషణకు బయలుదేరిన కాకి

ముసిలికాకి మనసు క్షోభించింది. కాకి జాతి నశిస్తున్నది. ప్రతివారూ కాకులను కాల్చి కూలవేస్తున్నారు. అదేదో ప్రయోజనానికైతే బాగుండేది. కాని కాదు. కేవలం విలాసంకోసం. కాకులకు దిగులుపుట్టింది. పూర్వంలాగ ఆ కర్కశమైన కూతలిప్పుడు వినరావడంలేదు. కాని కాకిమూక ఒక చెట్టుమీదికి చేరుతుంది. కేవలం తెలివితక్కువతనంగా "ఇక్కడ మేం వున్నామండోయ్!" అని అరుస్తాయి. అప్పుడు 'ఢాం' అనడం సహజంకదా. మూకలో పదో పరకో తగ్గిపోతాయి. పూర్వపు ఆ సుఖజీవితమూ పోయింది. ఉచిత భోజన వసతి పోయింది. అడవులను నరికివేశారు. చిత్తడి నేల

లను ఓడ్చివేశారు. జంతువులను తరిమివేశారు. నూరింట ఒకవంతుకూడా న్యాయంగా బ్రతకడానికి అవకాశం లేదు. అందుకని కాకులన్నీ పొలాలచుట్టూ, తోటలచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాయంటే అందులో ఆశ్చర్యమేముంది? దీనితో 'ఢాం' లు ఎక్కువయ్యాయి. మరొక పదో పరకో హాతం! అయితే అదృష్టవశాత్తు కాకుల సంతానం తామరతంపరగా పెరుగుతుంది. లేకపోతే గ్రద్దకూ, డేకకూ కప్పం కట్టడానికి ఒక్క కాకికూడా మిగిలేదికాదు.

ముసిలికాకి పిల్లకాకులకు బుద్ధినేర్పాలని ప్రయత్నించింది. "అవసరం లేనప్పుడు కాకారవాలు మానండి! ఇతరుల తోటలను పట్టుకొని వ్రేలాడకండి!" కాని దాని సత్ప్రయత్నానికి వచ్చిన ఫలితం ఈసడింపుమాత్రమే.

"నీకు మహా తెలుసు పోవోయ్ ముసిలికాకి! దొంగిలించడంతప్ప మన కింకొక పనిలేదు. శాస్త్రం ఏం చెపుతున్నది? నీకు తినడానికి లేకపోతే నీ తెలివినిచూపి బ్రతుకు అని. తెలిసిందా? ఈరోజుల్లో ప్రతివారూ అలాగే బ్రతుకుతున్నారు. ఎవరూ పనిచేయరు. అంతా తమ తెలివిని నమ్ముకొంటారు. మేం చావాలనివుందా ఏం నీకు? పొద్దుపొడవకముందే గూళ్లు విడిచిపోతున్నాం. అడివి ఆ మూలనుంచి ఈ మూలకు వెతుకుతున్నాం. అంతా శూన్యం. ఒక్క కాయ కాని కళేబరంకాని కనిపించదు. ఆఖరికి పురుగులుకూడా లోతుబొరియలలో దాగొంటున్నాయి."

ముసిలికాకి ఈవాదం విని ఆలోచనలోపడింది. తన కాలంలో అది కష్టాలెన్నో చూసింది. కాకిజాతి ఎన్నో ఏళ్లు

ఆకలికి మల మల మాడింది. లెక్కలేని కాకులు చచ్చి
పోయాయి. ఆరోజుల ధర్మమేవేరు! నీకు వాడిగోళ్ళున్నాయి
కనుక వాటితో నీ శరీరాన్నయినా చీల్చుకోకాని అన్యుల
దాన్ని ఆశించరాదు - అనేది ఆనాటి ధర్మం. అయినప్పటికీ
కాకిజాతి ఈ ధర్మానికి కట్టుబడిలేదనేది స్పష్టం. నీ కడుపు
కాలుతూవుంటే భోగా లనుభవించేవారిని చూసినప్పుడు
గుండె మండదూ?

అప్పుడు శాస్త్రంవచ్చి ఆదుకొంది. ఎక్కడ ఏది
దొరికితే దాన్ని పొడుచుకొని తిను అని వేదాంతం బోధి
స్తోంది. నీకు అదృష్టం కలిసివచ్చిందా కడుపు నింపుకొని
హాయిగా ఎగిరిపో. లేదా తుపాకి దెబ్బకు ఎరనై పెరటి
తోటల్లో దిష్టిబొమ్మ అవతారం దాల్చు. "హాత్వావాభోజ్య
సేస్వర్గం జిత్వావా భోజ్యసే మహీం!"

ముసలికాకికి ఇంకా రెక్కలు రానప్పుడు దాని తండ్రి
కాకి ముత్తొమ్మిదినాడునుంచి ఈ దేశానికి తీసుకొనివచ్చింది.
అప్పుడిది స్వతంత్ర భూమి. కన్నానిన మేరల్లా అడవులు,
వాగులు వుండేవి. అడవులనిండా కాయా కసరూ కావలసిన
వేటా పుష్కలంగా వుండేవి. వాగులనిండా చేపలు బిలబిల
లాడేవి. ఇప్పటిలాగే అప్పుడుకూడా వారికి నాయకుడు డేగ.
కాని ఆ రోజుల్లో డేగకు తిండి పుష్కలంగా వుండేది. చాలా
నిరాడంబరజీవి. ఎంత నిరాడంబర జీవిఅంటే దాన్ని గురించి
ఈ నాటికీ కథలూ గాథలూ చెప్పుకొంటూరు. అప్పటి డేగ
కాకిపిల్లలను కబళించడానికి వెనుకాడేదికాదు. ఆ మాట
నిజమే. కాని అందుకుకూడా కొన్ని మర్యాదలను పాటించేది.

ఇప్పుడేముంది ఈ వేళ ఈ గూడులోంచి ఒక పిల్లను తినేస్తే రేపు ఆ గూడులోంచి – గూడు సరిగా లేకపోతే గూడులేని పిల్లనే కబళిస్తుంది. ఆ రోజుల్లో పన్నులింత భారంగా వుండేవి కావు. గూడుకొక గుడ్డు. రెక్కకొక ఈకపన్ను. ప్రతి పది గూళ్లకూ ఒక కాకిపిల్ల చొప్పున డేగకు నజరానా – పన్నులు కట్టేశావా టింగురంగా అని బొంగరంలాగ నిద్రపోవచ్చును.

కాని కాలం మారింది. కాలం గడచిన కొద్దీ పరిస్థితులు మారాయి. స్వేచ్ఛగావున్న స్థలాలమీద మనిషికి సరదా పుట్టింది. అతడు మొదట గొడ్డలికి పనిచెప్పాడు. అడవులు తరిగిపోయాయి. చిత్తడినేలలు నీరోడి ఎండిపోయాయి. నదుల్లో నీళ్లు తగ్గిపోయాయి. మొదట నదిగట్టున నాలుగు గుడిసెలు లేచేవి. తర్వాత చిన్నపల్లెలు, ఊళ్లు, భూస్వాముల భవంతులూ లేచాయి. గొడ్డలి చప్పుళ్ళు అడవులలోని ప్రశాంతతను భంగపరిచాయి. వనచర ఖేచర జీవితాలను తలక్రిందులుచేశాయి. ఏదో కానికాలం వస్తున్నదని అప్పటి ముసిలికాకులు ముందే చెప్పాయి. కాని కుర్రకాకులు మాత్రం మనుష్యులకు స్వాగతం ఇస్తున్నట్లు వింతగా కాకారవం చేస్తూ ఇళ్ళమీద గిరికీలు కొట్టాయి. ముసలికాకులు పెట్టిన కఠిన నిబంధనలకు కుర్రకాకులు ఎదురు తిరిగాయి. అడవులంటే వాటికి విసుకెత్తిపోయింది. ఏదో కొత్తదనం, కొత్తవింత వాటికి కావలసివచ్చింది. దానితో కాకిమూకలో చీలికలు వచ్చాయి. ముఠాలు పడ్డాయి. తగువులు తలెత్తాయి. కలహాలు వచ్చాయి.

అదే సమయంలో ఖేచర సామ్రాజ్యంలోని ఉన్నత జాతుల్లోకూడా మార్పులు వచ్చాయి. ముసలి డేగకు సామర్థ్యం ఉడిగిందని నిర్ణయించాయి. అది పితృస్వామిక పద్ధతిపై పరిపాలన సాగించవచ్చును. కాని పరిస్థితులు బెడిసి పోవడంవల్ల పరిపాలనాదక్షులంతా డేగను విడిచిపెట్టారు. అధికారవర్గం దాన్ని "ముసలిపీనుగు" అని పిలిచేది. కాకి మూక దాన్ని నీలెక్కేమిటంది. పైగా సిగ్గులేకుండా నానా చెత్త దాని చెవిలో కూసింది. కాని డేగ మాత్రం దీన్ని గోళ్ళతో తుంచివేయడాని మారుగా మందహాసం చేస్తూ "సంస్కరణలు వచ్చేవరకూ ఆగండి. ఆ తర్వాత ఏది ఎలా వుంటుందో చూద్దురుగాని!" అని హెచ్చరించింది. అనుకొన్న ఆ సంస్కరణలు ఆఖరికిరానేవచ్చాయి. ముసలిడేగకు పింఛను ఇచ్చారు. కుర్రడేగ గద్దెనెక్కింది. చట్టాలను సరిగా అమలు పరచడంకోసం వేటపులుగును సహాయకునిగా నియమించారు.

కొత్త అధిపతి గద్దె నెక్కగానే కాకిమూకకు "మీ వ్యవహారం చూస్తాను" అని గట్టి హెచ్చరిక చేసింది. "నేనూ అంతే" నంది వేటపులుగు - ఉభయులూ కలిసి ఈ పైనుంచి పన్నులు మూడురెట్లు అవుతాయని ప్రకటించాయి. పన్ను చీట్లను పంచిపెట్టి అక్కడినుంచి ఎగిరిపోయాయి.

ఇంక వినాశకాలం దాపురించింది. "ఘోరమైన ఈ పన్నులభారంతో నలిగిపోతున్నాం. కట్టలేం బాబో" అని కాకిమూక మొత్తుకోళ్ళు మొదలు పెట్టింది. అడవి అడవి అంతా ఇదేమొర. కాని డేగ, వేటపులుగుకూడా ఈమొరాల కించలేదు. ఒట్టిమాటలతో ప్రజలను రెచ్చగొట్టే అసంతృప్త

జీవులను పట్టుకొనడానికి ఏంట్రింతలను నియమించాయి. తుపాకి గుళ్ళకు గురై ఎన్నో గూళ్లు కూలాయి. ఎన్నో కాకుల్ని పట్టుకొని జైల్లో పెట్టారు. కొన్నింటిని తోడేళ్ళకు మేత వేశారు. దీనితో కాకులు హడలిపోయి తోకలమీద పెట్టుకొని కప్పాన్ని మోసుకొని వస్తాయని ఆశించాయి. కాని కాకులుమాత్రం "చంపండి! కాల్చండి. ఇష్టంవచ్చినట్లు చేసుకోండి. మాకు లేనిదాన్నిమాత్రం తెచ్చిమ్మంటే ఇవ్వలేం" అని రెక్కలల్లారుస్తూ కాకారవాలు చేశాయి.

అలాగే కాలం గడిచింది. కాకులు నాశనమయ్యాయి. కాని ఖజానామాత్రం నిండలేదు. అదృష్టంకొలదీ ఏకాకైనా ఏమైనా సంపాదిస్తే దాన్ని ఏంట్రింతలు లాక్కొనేవి. ఏమైనా పరిస్థితి ఇంతకన్నా చెడేదేమీ లేదు. కాకి మూక మరొకచోటికి వలసపోదామని ఆలోచించింది. ముందు కొన్ని ఎలగోలు దళాలను పంపించింది. కాని ఆ ఎలగోలు దళాలు తిరిగి రాలేదు. బహుశా దారి తప్పి పోయివుండవచ్చు. ఏంట్రింతలు దారికాచి పీక నులిమి వుండవచ్చును. లేదా ఆకలి తాళలేక చనిపోయి అయినా వుండవచ్చును. అదీగాక తాత ముత్తాతలనాటినుంచీ వుంటున్న స్వస్థలాన్ని విడిచిపెట్టి తెలియని దేశాలకుపోవడం అంత తేలికకాదు. ఈరోజుల్లో స్వతంత్ర ప్రాంతా లెక్కడా లేవు. మనుషులు సర్వత్రా వ్యాపించారు. అసలా మనిషికే మెసలడానికి తావులేదు. గొడ్డలి తీసుకొని వెళతాడు. అడవులు ఆక్రోశిస్తాయి. జంతువులు చిందరవందరగా పరుగులు పెడతాయి. పొద్దు పొడిచింది మొదలు పొద్దుకూకేవరకూ చెట్లను పెక

లిస్తూ వుంటాడు. తుప్పలు కొడతాడు, దుంగలు కోస్తాడు. రాత్రిళ్ళు బొరియల్లో దూరి గజగజ వణుకుతాడు. చలితో ఆకలితో పగటికోసం ఎదురు చూస్తాడు.

ముసలి కాకి ఆలోచించి ఆలోచించి కడకొక నిశ్చయానికి వచ్చింది. తానుపోయి అసలు సత్యాన్ని చాటుదామనుకొంది. కాని తాను ముసిలిది. జవసత్వాలుడిగిపోయాయి. దూరాభార ప్రయాణం. ఈ పనితనవశమా! ముందు డేగకు అభివాదాలు చేయాలి. తర్వాత వేట పులుగుకు. ఆతర్వాత కాకి మూకమీద గవర్నరుగావున్న గ్రద్దకు.

పక్షులకు కూడా మనుష్యుల్లాగా ఉద్యోగాంతరాల విషయంలో కఠిన నిబంధనలున్నాయి. ప్రతివారినీ "డేగను దర్శించావా? వేటపులుగు దర్శనం చేసుకొన్నావా?" అని అడుగుతారు. దర్శనం చేసుకొనకపోతే తిరుగుబాటుదారు అని ముద్రపడుతుంది.

ఎలాగైతేనేం ఒకనాటి ఉదయం ముసిలికాకి గూటిలోంచిలేచి బయలుదేరింది. పొడుగాటి ఏపె చెట్టుపై కూర్చున్న డేగ దర్శనంచేసుకొంది. ఆపూట డేగ సుష్టుగా భోజనం చేసింది. గోళ్ళతో ముక్కును అప్పుడే శుభ్రంచేసుకొంటోంది. ముసిలి కాకిని చూసి.

"సుప్రభాతం సాధుపక్షీ! నీవ్యవహారం ఏమిటో తెలుసుకొన వచ్చునా?" అని ప్రశ్నించింది.

"సత్యాన్ని చాటడానికి ఇక్కడికి వచ్చాను దేవరా!" అని కాకి ససంభ్రమంగా పలికింది.

"కాకులు నశిస్తున్నాయి......నశిస్తున్నాయి. మనిషి వాటిని చంపేస్తున్నాడు. దారుణమైన పన్నులభారం వాటిని కుంగ దీస్తున్నది. ఏంట్రింతలు బ్రతకనీయడం లేదు. అవి చచ్చిపోతున్నాయి దేవరా! బ్రతికున్నవాటికేమో తిండే లేదు."

"అలాగా? కాకిమూక కష్టాలన్నింటికి కారణం సోమరి తనం కాదా?"

"మేం సోమరులం కామన్న సంగతి తమకు తెలియనిది కాదు. ప్రొద్దుటినుంచి సాయంత్రం వరకు తిండికోసం మేం అడవంతా గాలిస్తాం. నిజాయితీగల కాకుల్లా కష్టించి బ్రతుకుతున్నాం. కాని ఇప్పుడు నిజాయితీగా బ్రతకడం దుస్సాధ్యమై పోయింది!"

డేగ తన మనసులోని మాటను చెప్పడానికి సంకోచిస్తున్న దానిలాగ కొంచెంసేపు ఊరుకొని కొసకు అంది.

"మీ తెలివిని ఉపయోగించండి!" కాని ఈసలహా ముసిలికాకికి తృప్తికలిగించలేదు. డేగను ఇంకా ఊదరపెట్ట డానికి దిగింది.

"ఈరోజుల్లో అంతా తెలివినుపయోగించే బ్రతుకు తున్నారని నాకు బాగా తెలుసును. కాని మామూక చాలా అమాయకమైనది. ఇతరులు లక్షలకు లక్షలు కాజేసికూడా హాయిగా వుంటున్నారు. కాని కాకి ఒక పైసను దొంగిలిం చిందా దానికి చావు మూడుతుంది. ఒక్క పైస కోసం మరణం! ఇది చాలా దారుణంగాలేదూ? తెలివి తేటలుప యోగించండని తమరు సలహాయిస్తారు. తమరు మాపాలికలు.

మమ్మల్ని అన్యాయాలనుంచి రక్షించడానికి తమరినియంపారు అయినా మమ్మల్ని పీడించడంలో తమరిని మించినవారు లేరు. తమరు మమ్మల్ని సర్వనాశనం చేస్తున్నారు. ఇలా ఎంతకాలం బాధ పడతామను కొంటున్నారు ? మేంకాని..."

ఆ పైమాట అంటే ఏం ప్రమాదం వస్తుందో అన్న భయంతో మాట సగంలోనే తుంచింది మునిలికాకి. సత్యాన్ని చాటడమంటే సామాన్యవిషయంకాదుమరి !

కాని డేగమాత్రం ఇంతకుముందే చెప్పినట్లుగా ఉదయం సుష్టుగా ఆరగించింది. అందుకని పిలవని పేరంటంగా వచ్చిన ఈపెద్దమనిషిని మందహాసంతో తిలకించింది.

"ఆపైమాట నాకు తెలుసును నీవు పూర్తిచేయవల సిన అవసరం లేదు" అంది.

"మేం ఇదంతా ఇంతకుముందే విన్నాం. ఇంకానయం బ్రతికున్నాం...కాని ఒక విషయం జ్ఞాపకముంచుకో. నీవిక్క డికి సత్యాన్నిచాటడానికి వచ్చావు. కాని తొలి అడుగులోనే తూలి పడ్డావు......సరే నీవు చెప్పదలచు కొన్నదంతా చెప్పావా ?"

"ప్రస్తుతానికంతా చెప్పినట్లే" అని కాకి భయం భయంగానే అంది.

"మంచిది. ఇంక ఇప్పుడు నావంతు. నీవు చెప్పిన ఈ సత్యం చిరకాలంగా అందరికీ తెలుసును. మీ కాకు లొక్కరికే కాదు ఏంట్రింతలకు వేటపులుగులకు, డేగలకు అందరికీ తెలుసును. అయితే అది ప్రస్తుత దశలో మనకు పనికిరాదు అంతే. నీవు కొమ్మెక్కి ఎంత గట్టిగా అరిచినా

ప్రయోజనం ఏమీవుండదు. సమయం వచ్చినప్పుడు ఆసత్యం దానంతట అదే వెల్లడి అవుతుంది. కాగా ఆసమయం ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. అర్థమయిందా?"

"నాకు తెలిసిందల్లా కాకి మూక బ్రతుకు ఇంతటితో సరి" అని ముసిలికాకి నిష్ఠూరంగా అంది.

"నీకింకా అర్థం కాలేదన్నమాట. అయితే ఇంకా చెపుతానువిను. మనిషి మిమ్మల్ని నాశనం చేస్తున్నాడన్నావు కాని పక్షులమైన మనం మనిషి నెలా ఎదిరించగలం? మనిషి తుపాకి మందు కనిపెట్టాడు. మనం దాన్ని ఎదిరించగలమా అని అడుగుతున్నాను. మనలను కాల్చి చంపడంకోసం మనిషి తుపాకిమందు కనిపెట్టాడు. తన చిత్తం వచ్చినట్లు చేసుకొంటాడు. మనం రైతుల్లాంటివారం. రైతు మీదకూడా అన్నివైపులనుంచీ అగ్గిపిడుగులు కురుస్తాయి. రైల్వేలో, కొత్తయంత్రమో, కరువో, కొత్తపన్నో ఏదో ఒకటి. అన్నింటికీ గురి అతడే. రైతు అటు ఒరుగుతాడు ఇటు ఒరుగుతాడు. వాగుడుకాయగాడు ఒకరోడ్డును ఎలా గుత్తగొన్నాడో ఎవరికీ తెలియదు. తర్వాత తెలుస్తుంది రైతుకు తన బొడ్డులో ఒక రూపాయి తగ్గిందని. ఆ చదువు రాని మనిషి దానినుంచి ఏంగ్రహిస్తాడు? ఏమీలేదు. చాలా తేలిక. వాగుడుకాయగాడు తుపాకి మందు కనిపెట్టాడు. రైతుకుమాత్రం ఎర్రలాగ మట్టిపిసుక్కోనడం మాత్రమే తెలుసును. నీవు ఎర్రవైనప్పుడు ఎర్రలాగే బ్రతుకు మీ కాకులుకూడా ఎర్రను కనికరించవు. మూ అత్యా చారాలను గురించి అది ఎలుగెత్తితే మొట్టమొదట ఆశ్చర్య

పోయేది మీరే ! మన్నులోతిరిగే పురుగు మాటనుకూడా వినిపించుకోవాలట! అంటూరు. తాతా ఇలావున్నాయి వ్యవహారాలు. బలంగలవాడిదే రాజ్యం. ఇప్పుడైనా అర్థమయిందా?"

"అయితే మేం ఊరికినే నాశనమై పోవాలన్న మాట? ఎంత కటువైన మాటలు సెలవిచ్చారు!" అంది కాకి సగద్గద కంఠంతో.

"కటువో గిటువో అసలు విషయమేమిటంటే నేను నిజం నీముందు దాచలేదు. అయితే అదినీవు కోరిన సత్యం కాదు. ఈ రోజుల్లో అంతా గుర్తించుకొన వలసిన సత్యం. సరే మన ప్రసంగాన్ని కొనసాగిద్దాం. ఏంట్రింతలు దారి కాచి మీతిండిని దోచుకొంటున్నాయంటున్నావు. మేం నిన్ను కాపాడ్డానికి బదులు మీ గూళ్ళను కొల్లగొడుతున్నామంటున్నావు. మేం నిన్ను నాశనం చేస్తున్నాం. సరే. నీవు తినాలను కొంటున్నావా లేదా ? అలాగే మేమూ. నీకెక్కువ బలంవుంటే నీవే మమ్మల్ని తినేదానివి. కాని నీకన్న మేం బలవంతులం కనుక మేం నిన్ను తింటున్నాం. అదికూడా సత్యమే. అవునా ? నీవు నీసత్యాన్ని నాకు చాటావు. నేను నాసత్యాన్ని నీకు చాటాను. ఉన్న భేదమల్లా ఒకటే. అది— నాసత్యం ఇక్కడ ఈ భూమిమీద వుంది. నీ సత్యం అక్కడ ఆమబ్బుల్లో వుంది. అర్థమవుతోందా ?

"అంటే చావన్నమాట. మేం చచ్చి తీరాలి." అని ముసలికాకి డేగమాటలను అర్థంచేసు కొనలేక పోయినా

వాపోయింది. కాగా డేగమాటలు ఇంకా క్రౌర్యాన్ని సూచిస్తున్నాయన్నమాట మాత్రం దాని మనసుకు తట్టింది.

డేగ కాకిని నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూసింది. కడుపు నిండివుందేమో కాస్త పరిహాసం చేద్దామనుకొంది.

"నిన్నిప్పుడు చీల్చుకొని తినడానికి మనస్కరించడం లేదు" అంది. ఆమాట వినేసరికి కాకికి వణుకు పట్టుకొంది. అదిచూచి "అదుగో చూశావా! నేను నిజంగానే...నీవు వుట్టి ఎముకల గూడువి. ఏదీ ఒక్కక్షణం ఆ కోటు విప్పచూదాం" అంది డేగ.

కాకి రెక్కలు చాపింది. తన ఆకారానికి తానే ఆశ్చర్యపోయింది. ఎముకలు చర్మం తప్ప ఏమీ లేదు. కండ ల్లేవు. ఈ కల్లేవు. ఆకలిగొన్న తోడేలుకూడా ఇలాంటి పక్షిని ముట్టుకూడదు.

"చూడు బూచిలాగ వున్నావు. నీవు సత్యాన్ని గురించి ఆలోచిస్తూవుండడమే దీనికి కారణం. అసలు నీవు ఆలోచన అనేది లేకుండా కాకిలాగ బ్రతికివుంటే ఇలా వుండే దానివికావు. కాని చూశావా...సరే. కాకులు పన్ను లెక్కువ కడుతున్నాయని నీ ఫిర్యాదు. అది అక్షరాలా నిజం. కాని మరి పన్నులు కట్టేవారింకెవరు ? ఆలోచించు. పిచికా, పికిలిపిట్టా, కత్తెరపిట్టా, పైడిపిట్టా ? అవేమి ఇవ్వగలవు? కౌజు, కాటుక పిట్ట, వల్లంకి పిట్ట, పూరి పిట్ట ఇవన్నీ తమ బ్రతుకు తాము బ్రతుకుతున్నాయి. సామెత చెప్పినట్లు వీటిని పగటి దివిటీతోకూడా పట్టలేం. ఒక కాకులు మాత్రమే రైతుల్లాగ మూకగా బ్రతుకుతున్నాయి. పైగా నిరంతరం తమ ఉనికిని

చాటుతూ వుంటాయి. అలాంటప్పుడు అవిజనాభా లెక్కల్లోకి ఎక్కడంలో వింతేముంది ? ఒకసారి జనాభా లెక్కల్లోకి ఎక్కితే ఇంక ఆదృష్టితో ఉండక తప్పదు. ఇటీవల పన్ను లెక్కువయ్యాయంటే దానికి కారణం అవసరాలు కూడా ఎక్కువ కావడమే. అవసరం ఎంత ఎక్కువైతే పన్నుల బరువు అంత ఎక్కువౌతుంది. విషయాలలావున్నాయి తాతా. నీవు సత్యం చెప్పావు. నేను సత్యం చెప్పాను. ఇందులో ఎవరిసత్యం గొప్పదో మీాకాకులకు బాగా తెలుసును. సరే ఇంక వెళ్ళిరా. నేను నిద్రపోవాలి."

అయితే ముసిలికాకి ఇంటికి వెళ్ళడానికి బదులు వేట పులుగు దగ్గరకు బయలుదేరింది.

"ఏమైనాసరే దీని అంతు చూస్తాను వేటపులుగు నా సత్యాన్ని ఒప్పుకోనక పోతే గవర్నరు గ్రద్ద దగ్గరకు వెళ్ళు తాను. అంతేకాని న్యాయాన్వేషణమాత్రం విడిచిపెట్టను" అని రెక్కలను బరువుగా ఈడుస్తూ తలపోసింది కాకి.

ఒక లోయలోని కొండగుహాలో వుంటోంది వేట పులుగు. దాని గుహాకు వెళ్ళడం చాలకష్టం. గుమ్మంముందు ఒక ఏంట్రింత ఎప్పుడూ కావలివుంటుంది. ఇప్పుడు కావలి వున్న ఏంట్రింత పేరు పుల్లయ్య. పుల్లయ్య అంటే వేట పులుగుకు చాలా అభిమానమన్న సంగతి కాకిమూక కంతకీ తెలుసును. (పుల్లయ్య వేటపులుగుకే పుట్టాడనికూడా పుకార్లున్నాయి) అతి ప్రధానమైన రహస్య రాచకార్యాలను పుల్లయ్యకు అప్పగిస్తారు. మహా వెర్రిగా వుంటాడని వాడికి పేరుంది. చూపులకు మంచివాడిలాగే కనిపిస్తాడు. మర్యాదా

మన్నన కూడా వున్నాయి. కలుపుగోలుగా మాట్లాడుతాడు. ఎకసెక్కాలకు వెనుకాడడు. మబ్బులసంటే పరుగుపందేలూ, ఆడపిల్లలతో దాగుడుమూతలు అంటే వాడికి చాలాసరదా. అప్పుడప్పుడు స్నేహితులకు ఉపకారాలుకూడా చేశాడు. అయితే ఈపనులన్నీ ఉద్యోగధర్మంలో లేనప్పుడుమాత్రమే. ఉద్యోగధర్మంలో వున్నప్పుడు (ముఖ్యంగా రహస్య రాచ కార్యాలమీద వున్నప్పుడు) వాడు పూర్తిగా మారిపోతాడు. తొణకడు. బెణకడు. క్రౌర్యంలో అందెవేసినచేయి. ఎవరి నైనా అరెస్టుచేయాలని ఉత్తరువిస్తే అరెస్టు చేస్తాడు. పీక నులుమమంటే పీక నులుముతాడు. తనకన్న రెట్టింపువున్న పిట్ట అయినాసరే కోపంతో మీది కెగిరితేచాలును ఆ పిట్ట అరుచుకొంటూ పారిపోతుంది. దాని ధాటి నెరిగిన పిట్టలన్నీ ఆ పేరువింటే చాలును వజ వజ వణికి పోతాయి.

ముసిలి కాకి అక్కడికి రాగానే పుల్లయ్య "ఇంకా కలలు కంటున్నావా ముసిలీ!" అని పలకరించాడు.

సంగతంతా ఇక్కడిదాకా తెలిసిపోయిందన్న విష యాన్ని ముసిలికాకి గ్రహించింది. పిట్టలలో కూడా వేగు లున్నాయి. చేసే పనులే కాకుండా జనం కడుపులో ఏముందో కూడా వాటికి తెలిసిపోతాయి.

"ఆఁ. ముసిలివాళ్ళకు కలలేంవుంటాయి?" అంది ముసిలికాకి మాటను దాటేస్తూ.

"సత్యాన్ని చాటుదామని వచ్చావు అవునా? సరే అది నీ స్వంత వ్యవహారం. నీవు వచ్చినట్లు చెప్పాలా?"

"నీకు దయపుడితే"

పుల్లయ్య గుహలో దూరాడు. ఒక గంటవరకూ అక్కడే వుండిపోయాడు. బైట ముసిలికాకి వణుకుతూ కాచుకొని కూర్చుంది. ఏలాగైతేనేం పుల్లయ్య బైటికి వచ్చాడు.

"నీ వాగుడు వినడానికి తగ్గతీరిక దొరగారికి లేదని చెప్పవలసిందిగా సెలవైంది. నీవు చెప్పదలుచుకొన్న సత్యం తరతరాలుగా అందరికీ తెలుసును. అదింతవరకూ వెలువడ్డం లేదంటే దానిలో ఏదో ఒక లోపంవుండి వుండాలి. నీవు ఆందోళన కారుడివి. జనంతో నిరర్థకంగా ప్రమాదకరమైన సంగతులు మాట్లాడుతున్నావు. నీవుచేసిన పనులకుగాను నిన్ను ఏనాడో కబళించి వుండవలసింది కానీ నీవుచాలా బక్కచిక్కి వున్నావు. ఇప్పుడిక గవర్నరుగారి వద్దకు వెళతావనుకొంటాను. అవునా?" అని ఒక ప్రకటన చేశాడు పుల్లయ్య.

"లేదు...లేదు. వెళ్ళి ఏం లాభం?" అని గొణిగింది ముసిలికాకి విషయాన్ని తప్పించుదామనే వుద్దేశ్యంతో.

"ఇదిగో నాదగ్గర నాటకాలాడకు. నీగుండెల్ని చీల్చి చూడగలనునేను. సరే వెళ్ళు. నీసత్యానికి మెచ్చినవారునీకళ్ళు రెండూ పొడిచేయకుండామాత్రం చూసుకో. నేనే అయితేనా వెళ్ళేముందు ఒకటికి రెండుసార్లు ఆలోచించుకొని వుండేవాణ్ణి. నీకసలు దారికూడా తెలియదు. ఆమబ్బులుచూశావా వాటికావలవుంది."

ఏంట్రటెంత జోస్యాం చెప్పినప్పటికీ వ్యవహారాన్ని అంతు తేల్చుకోవాలని నిశ్చయించింది కాకి. చుట్టుతిరిగి చాలా దూరం ప్రయాణం చేయాలి. రాత్రిళ్ళు ఖాళీబారియల్లో తల

దాచుకొంది. అప్పుడప్పుడు కొండల్లో ఏదో కాయా కసరూ కనిపిస్తే కడుపు నింపుకొంది. కొసకు ఒక మబ్బులోదూరింది. అక్కడి దృశ్యం అద్భుతం.

మంచుకప్పిన కొండశిఖరాలు లేయెండలో మిలమిల మెరుస్తున్నాయి. దూరాన్నుంచి చూస్తే అదేదో దేవతల నగరులా కనిపిస్తుంది. ఆ నగరు మొదట మబ్బులు ముసురు కొన్నాయి. పైన నీలాకాశం.

నానారకాల పక్షులు పరివేష్టించగా ఒక రాతి కొమ్మున కొలువుదీరింది గ్రద్ద. దాని కుడితట్టున ఒక తెల్లని వేటపులుగు కూర్చుంది. అది గ్రద్ద సలహాదారు. పాదాల ముందు చిలకలు, చదువుకొన్న ఏంట్రెంతలు, పైడిపిట్టలు, మొదలైన నానారకాల కార్యదర్శి పిట్టలూ కూర్చున్నాయి.

వెనుక బెగ్గురు పిట్టలు నిలబడి ఉదయం పత్రికలను చదివి వినిపిస్తున్నాయి. పక్కన మరొక శిఖరంమీద గూబలు, గబ్బిలాలు కునుకుపాట్లు పడుతున్నాయి. చూసేవారికది రాష్ట్రశాసన సభలాగ కనిపిస్తున్నది. కాకులు చెవిసందున ఈక కలాలు దోపుకొని మహా హడావుడిగా తిరుగుతున్నాయి. ఉత్తరాలు, ఆదేశాలు, ఉత్తర్వులు, శ్రీముఖాలు వ్రాస్తు న్నాయి. "కాకాకా – తాజాతాజా మొత్తం ఐదుపైసలు!" అని వేలంపాటలు పాడుతున్నాయి.

గ్రద్ద శతవృద్ధు. వయసు పెరగడంతో శక్తి ఉడిగింది. ఇప్పుడది గట్టిగా ముక్కును కూడా గీరలేదు. కాకి దాని పాదాలముందు వాలే సమయానికి అప్పుడే గ్రద్ద భోజనం ముగించింది. కళ్ళుమూసుకొని మగతగా కూర్చుంది. చుట్టు

పక్కలరొదకు చెవులు దిమ్మెక్కి పోతూవున్నా గ్రద్దమాత్రం విలాసంగా తలతాటిస్తూవుంది.

ఏమైతేనేం అర్జీదారు రాకతో పక్షులలో కలకలం పుట్టింది. దానితో ముసలిగ్రద్ద కాస్త కన్ను విప్పింది.

"ఏదో విజ్ఞాపన గాని వచ్చావా సాధుపక్షీ!" అని ప్రశ్నించింది కాకిని గ్రద్ద.

"నేను చాలా దూరంనుంచి వచ్చాను దేవరా" అని ఉత్సాహం పుంజుకొని మొదలుపెట్టింది కాకి. "తమకు సత్యాన్ని చాటుదామని" అన బోతున్నంతలో వేటపులుగు అడ్డు తగిలింది.

"పదాడంబరాలు పనికిరావు. నీ వ్యవహారం ఏమిటో చిలవలు పలవలు లేకుండా సూటిగా, స్పష్టంగా, క్లుప్తంగా చెప్పు. నీకేంకావాలి?" అంది వేటపులుగు.

కాకి తన విజ్ఞాపనలోని ఒకొక్క అంశాన్నీ వివరించింది. మనిషి కాకిమూకను నాశనం చేస్తున్నాడు. ఏంట్రింతలు, డేగలు, వేటపులుగులు అన్నీ కాకులను బాధిస్తున్నాయి. దారుణమైన పన్నులభారం కుంగదీస్తోంది...కాకి ఇలా ఒకొక్క అంశాన్నీ పేర్కొన్నప్పుడల్లా గ్రద్ద ముక్కు తెరిచి "నిజం నిజం సాధుపక్షీ!" అంటూ వచ్చింది.

దీనితో ముసలికాకి ఉత్సాహం మిన్ను ముట్టింది. "ఎలాగైతేనేం చిన్ననాటినుంచీ కలలుకన్న సత్యాన్ని ఈనాటికి చూడగలుగుతా"ననుకొంది. ప్రసంగంసాగినకొలదీ ప్రోత్సాహం ఎక్కువ వచ్చింది. చెప్పవలసినదంతా చెప్పిన మీదట ఊరుకొంది.

"చెప్పవలసిన దంతా చెప్పావా?" అని గ్రద్ద అడిగింది.

"అంతా"

"నీవు డేగ దగ్గరకూ వేటపులుగుదగ్గరకూకూడా వెళ్ళి విన్నపం చేశావా?"

"చేశాను"

డేగతోనూ, వేటపులుగుతోనూ తాన్జరిపిన సంభాషణను కాకి గ్రద్దకు క్లుప్తంగా తెలియపరిచింది.

"సరే నీ సత్యాన్ని గురించి నేను చెప్పదలుచు కొన్నదిది. రెండువందల ఏళ్లకు పైగా నేనిక్కడే ఈ కొండ కొమ్మున కూర్చుంటున్నాను. కనీసం కడకంటనైనా సూర్యుణ్ణి చూస్తున్నాను. కాని ఈనాటికి కూడా సత్యాన్ని సూటిగా చూడలేక పోతున్నాను."

"ఎందుచేత?" అని అడిగింది కాకి.

"ఎందుకంటే పక్షి సత్యాన్ని అనుష్టించ జాలదు. దానికా శక్తిలేదు. ఎవరైనా సత్యాన్ని గ్రహించామని భావిస్తే దాన్ని అనుష్టించాలి. పక్షులమైన మనం దాన్ని అనుష్టించలేము. అందుకనే మనం సత్యంవైపు ఒకచూపు విసరగలమే కాని దాన్ని సూటిగా చూడలేము. మనం దాని వైపు చూద్దాం. కాని అదిమాత్రం మనల నంటకుండా పోవాలనేది మన అభిమతం."

గ్రద్ద కొంచెంసేపు అలాగే ఆలోచిస్తూ కూర్చుంది. ఆతర్వాత తిరిగి మొదలు పెట్టింది.

"డేగ నీతో నిష్ఠూరంగా మాట్లాడింది. కాని ఆమాట్లాడిన దంతా నిజం. సత్యం మంచిదే. కాని అన్ని వేళలా

అన్ని స్థలాలలోనూ దాన్ని వినడం మంచిదికాదు. కొంత మందిలో దానివల్ల ఆశజనించ వచ్చును. ఇతరులకు అది దూషణలాగ అనిపించవచ్చును. సత్యాన్ని ప్రచారంచేయా లనుకొనేవారు కొందరున్నారు. కాని ఉట్టిచేతులతో సత్యాన్ని ఎలా అందుకోగలరు? సత్యం అంటే కాకి కాదు తోకపట్టుకొనడానికి. నీ చుట్టూచూడు. అంతా దుఃఖం. అంతాద్వేషం. తాను ఎటు పోతున్నాడో ఎందుకు పోతు న్నాడో ఎవడూ చెప్పజాలడు...అందుకనే ప్రతివారూ తమ స్వంత సత్యాన్ని గురించి మాట్లాడుతారు. కాని ప్రతిజీవికీ సముచితమైన సీమలు స్పష్టంగా కనిపించగల ఒకానొక కాలం వస్తుంది. ఆసీమల మధ్యనే జీవితం గడపవలసిన రోజు వస్తుంది. ఆరోజున ఈ దుఃఖాలు వుండవు. అప్పుడే వ్యక్తిగత సత్యాలనే పొగ మంచులుకూడా ఎగిరి పోతాయి. సర్వతో ముఖమైన సత్యం సర్వత్రా ప్రచలిత మవుతుంది. ఆరోజు వస్తుంది. అప్పుడు ప్రపంచం దాని వెలుగులో ధగద్ధగాయ మానంగా వుంటుంది. మనమంతా ప్రేమ, సామరస్యాలతో జీవిస్తాం. అదీవిషయం మహానుభావా! సరే ఈ లోగా చల్లగా బ్రతుకు. ఇంటికి వెళ్ళి మీ కాకి మూకతో చెప్పు వారి మీదే నా నమ్మకం అంతా వుంచానని."





# పితూరీరావు దుర్గతి

## (సగంవినోదం - సగంవిషాదం)

ఒకరోజు ఉదయమే లేచేసరికి పితూరీరావుకు తాను 'లేనన్న భావం' కలిగింది. నిన్నటిదాకా తానున్నట్లు తెలుసును. నిన్నటి 'భావం' ఏదో మాయమంత్రంవల్ల నేడు 'అభావంగా' మారిపోయింది. కాని ఈ 'అభావం' మాత్రం ప్రత్యేక లక్షణంగలది. పితూరీరావు తన ఒళ్ళంతా తడువుకొని చూసుకొన్నాడు. గట్టిగా నాలుగు మాటలుకూడా మాట్లాడాడు. కొసకు అద్దంలో చూసుకొన్నాడు. తాను 'ఉన్నాడు'. చెక్కు చెదరకుండా జనాభా లెక్కలలో మనిషిలాగ నిన్న నే స్థితిలోవున్నాడో నేడుకూడా అచ్చం అలాగే వున్నాడు.

అంతేకాదు. అతను ఆలోచించడానికి ప్రయత్నించాడు. మామూలుగానే ఆలోచించగలడని తేలింది. అయినా అతడు 'లేడ'న్న విషయంలో మాత్రం అనుమానం లేదు. వెనకనుంచి తలుపు ధబీమని మూసుకొనిపోయినట్లు, ముందున్న దారికి అడ్డుపడినట్లు, ఎక్కడికీ వెళ్ళడానికి సందు లేదు. అవసరంకూడా... చాలసేపు అస్తి నాస్తి విచికిత్స చేశాడు. తన పరిసరాలను ఎక్కువ ఆసక్తితో పరికించాడు. అలా పరికిస్తూ వుండగా ఇటీవలనే తాను ప్రారంభించిన రచన మీద దృష్టి పడింది. ఆగ్రంథం బల్లమీద పడుంది. హఠాత్తుగా అతనిసర్వమూ మెరుపుదెబ్బతిన్నట్లు వణికింది...

నిరర్థకం! నిరర్థకం! నిరర్థకం!

.......................................

"ఏమటీ పిచ్చి!" అనుకొన్నాడు మొదట. కలం అందుకొన్నాడు. కాని పనిలో పడదామనుకొంటూ వుండగా ఒక గీత గీయాలనీ ఆ గీత కింద "నిరర్థకం!" అన్న మాటను వ్రాయాలనీ బుద్ధిపుట్టింది.

అవును అంతా మునపటివలెనే వుంది. పోతే అతని ఆత్మమాత్రం మూత పడింది. ఇటుపైన అతను జనాభా లెక్కల్లో వున్న మనిషి చేయదగ్గ పనులన్నీ స్వేచ్ఛగా చేయవచ్చును బహుశా ఆలోచనకూడా చేయవచ్చును. అయితే అంతా నిరర్థకం. అతని జీవితానికి అర్థాన్ని ఆకారాన్నీ కల్పించిన ఆలంబనం పోయింది. తనలో కణకణరగిలే అగ్నితో ఇతర హృదయాలను వెలిగించడానికి వీలిచ్చిన ఆ జాజ్వల్య శక్తి పోయింది.

అతనికి నోటమాట పెగల లేదు. అన్వేషించాడు కాని కానలేదు. గవేషించాడు కాని దొరకలేదు. ఏదో అనంతమైన వేదన అతని ఉత్సాహాన్ని కబళించింది...గాలిలో హేళన గుసగుసలాడింది. "వారు నిన్ను కనిపెట్టారు! వారు నిన్ను పసికట్టారు! వారు నిన్ను పట్టుకొన్నారు!"

"ఏమిటి సంగతి? ఏం జరిగింది?" ఏమీలేదు. అతని ఆత్మహత్య పడింది అంతే.

నియమనిష్ఠలుగల అందరిలాగే పితూరీరావులో కూడా ఒక గర్భగుడివుంది. అతని ఆత్మనిధానం అందులో వుంటుంది. తన నిధానాన్ని అతనెన్నడూ దాచలేదు. అది తన ఒక్కనిదేనని ఎన్నడూ భావించలేదు. దాన్ని ఉదారంగా అందరికీ పంచిపెట్టాడు. మానవ జీవిత పరమార్థమంతా అందులోనే వుందని భావించాడు. ఈ చేతన శక్తి లేనినాడు, తనతోటి వారిపై వెలుగునూ మంచినీ ప్రసరింప చేయడానికీ ఇతరులనుంచి వెలుసునూ మంచినీ గ్రహించడానికి ప్రోద్బలమైన ఈ శక్తినిలేనివాడు సమాజం శ్మశానమవుతుంది——దాన్నప్పుడు సమాజం అనడానికి వీలులేదు. అదిశవాల పోగు...ఇప్పుడతనిలో ఆ శవదశ మొదలైంది మంచితనాన్ని వెలుగును ఇచ్చి పుచ్చుకొనడం ముగిసింది. పితూరీరావు ఇప్పుడొక శవం. ఇటీవల తన కార్యకలాపాలన్నింటికీ జీవం పోసే అమృతపు సోనలని ఎవరిని భావించాడో వారంతా కూడా శవాలే...ఇంత దారుణ ఉపద్రవం సంభవిస్తుందని అతను కలనైనా ఊహించలేదు.

పితూరీరావు నిజమైన బడుగునాటి* పండితుడు. అతనికి తన పాఠకులమీద అభిమానంలేదు. వారికి తనతో సంబంధం వుందని తప్పితే వేరు ఆనందంలేదు. పితూరీరావు పాఠకునికి ఒక ప్రత్యేకరూపం ఎప్పుడూ లేదు. అయినా ఎల్లప్పుడూ పితూరీరావుముందే వుండేవాడు. ఈ అవ్యక్తవ్యక్తిని ఆరాధించడం లోగల ఆసక్తి అసాధారణం. అదొక జబ్బు కూడా. ఏళ్ళతరబడి ఈ ఆసక్తే అతను నిలవడానికి ఆధారమైంది. కాలం గడిచిన కొలదీ అదిలేకుండా వుండలేనిపరిస్థితి ఏర్పడింది. ఆఖరికి వయసు వాటారింది. జీవితంలో అన్నింటి కన్నా గొప్పదీ, ముఖ్యమైనదీ ఆ ఒక్క మెరుగుతప్ప మిగిలిన వన్నీ మూలపడ్డాయి. వాటి అవసరం పోయింది.

హఠాత్తుగా ఈక్షణాన ఆ తుదిమెరుగుకూడా ఎగిరి పోయింది. కళ్ళముందు అంధకార అగాధ పాతాళబిలం ఏర్పడి జీవితాన్ని సార్థకంచేసిన ఆ పదార్థాన్ని కబళించింది.

బుద్ధి ఒక వైపున మాత్రమే ప్రసరించే వ్యక్తులు సాహిత్య ప్రపంచంలో అప్పుడప్పుడు కనిపిస్తూ ఉంటారు. బుద్ధి ఒక వైపునే ఒరగడం అనే ఈ లక్షణం వారికి చిన్నతనంలోనే అలవడుతుంది. వారుపయనించ డానికి నిర్ణీతమైన పథంనుంచి పక్కవుంతలకు ఎంతలా మళ్ళినా అమళ్ళుడు ప్రధానమైనదిగానూ వుండదు. దానికి స్థిరత్వమూ వుండదు.

---

* ఇక్కడ ష్చెడ్రిన్ పొషెఖోన్యే జిల్లాను పేర్కొన్నాడు. బడుగుతనానికీ, అజ్ఞానానికీ ఆజిల్లా పెట్టిందిపేరు, కాని రష్యా దేశాన్నంతనీ ఈజిల్లాపేరుతోనే సాధారణంగా పిలుస్తాడు ష్చెడ్రిన్ అందుకని ష్చెడ్రిన్ భావానికి అనువుగా దీన్ని బడుగునాడని అనువదించుతాను—అను॥

మెట్లు మెట్లుగా మేట వేసిన చెత్తకిందినుంచి వారి అసలు ఆలోచన సంతత ప్రవాహంగా సాగుతూనే వుంటుంది. జీవితంలోని వైవిధ్యమంతా అవాస్తవంగా గోచరిస్తుంది. వారి అభిరుచి అంతా ఒకే ఉజ్వల బిందువుపైన కేంద్రీకృత మవుతుంది. జీవితంలో ఎదురయే మార్పులను ద్వంద్వాలను వారు లక్ష్యంచేయరు. ఎన్నడూ ముందుకు చూడరు. వెనుకనుంచి రక్షణ ఏర్పాటు చేసుకోవాలని యోచించరు. పరిసరాలను పర్యాలోకించరు. గతంనుంచి అనుభవాన్ని నేర్చుకోరు. అంత మాత్రాన వర్తమాన పరిస్థితుల అర్థం వారికి తెలియదని కాదు. ఆపరిస్థితుల మీదే తాము ఆధారపడాలన్న విషయం ఎరగనిదికాదు. ఎంత దూరదృష్టి ఎంత విజ్ఞానం వున్నా కూడా అది వారినడవడిలో అణుమాత్రమూ మార్పు తేజాలదు. ఆనడవడి అంతమవడం అంటే వారి అస్తిత్వమే అంతటితో అంతమవడమన్నమాట. ఆనడవడిని అంతంచేయాలంటే ఆమనిషినే అంతం చేయవలసి వుంటుంది.

అయితే ఇప్పుడు ఈవిచిత్ర ముహూర్తంలో అలాంటి హత్య నిజంగా జరగడం సాధ్యమేనా? ఈప్రశ్నకు జవాబు కోసం అతను వ్యర్థాలోచనచేశాడు. అతనికి తెలిసినది ఒకే ఒక విషయం. అది 'ఆవులించినశూన్యం' తనను ఆవరించింది.

పితూరీరావు తన దేశాన్ని మనసారా ఆరాధించాడు. తన దేశ గతాన్నిగురించీ, వర్తమానాన్ని గురించీ అతనికి క్షుణ్ణంగా తెలుసును. అనంతవేదనకు ఆలవాలమైన అదే అతని జీవితానికి ప్రధానాంశమయింది. అతని పనులన్నింటికీ ప్రోద్బలమదే. తన వేదనను పోగొట్టుకోవడానికి అతను ప్రయ

త్నించలేదు. పైగా అది తన హృదయంలో శాశ్వతంగా వుండడానికి అన్ని విధాల పాటుపడ్డాడు. ఈ వేదనా అది నిరంతరం ఉన్నదనే జ్ఞానమూ అతని ఊహాచిత్రాలకు ప్రాణం పోశాయి. ఆచిత్రాలద్వారా అతను ఈ వేదనను ఇతరులకం దించేవాడు.

బడుగునాడు చాంచల్యానికి అస్థిరతకూ చాలా కాలంగా పేరు మోసిందని అతనికి తెలుసును. అక్కడ ప్రకృతి ఒక్క అపనమ్మకాన్ని మాత్రమే మెచ్చుకొంటు న్నట్లనిపిస్తుంది. అక్కడి మహానదులు ప్రతి ఏటా ఇసుక మేటలడ్డుకొనగా తమ పథాన్ని మార్చుకొంటూ వుంటాయి. వాతావరణం త్రుటిలో మారిపోయి అందరినీ చకితుల్ని చేస్తుంది. ఈ వేళ ఉక్కపోసి శరీరంమీద బట్టలు దుర్భరమవుతాయి. రేపాబట్టలే మంచుకు బిగిసి కొయ్య ముక్కల్లా అవుతాయి. వేసవి కొద్దికాలమేవుంటుంది. చెట్లు చేమలు తక్కువ. కన్నుపారినంతమేరా చిత్తడి నేల. ఒక్కమాటలో చెప్పాలంటే అక్కడి ప్రకృతి విపరీత వైకల్యానికీ నమ్మక ద్రోహానికీ పెట్టింది పేరు. అందుకని ముందే దేన్ని గురించి అయినా ఏర్పాటుచేసుకొనడం అనేది పొసగనే పొసగదు.

బడుగునాటి మనిషి బ్రతుకు అంతకన్నా ప్రమాద భరితం.

"జోలె, జైలు తప్పేదిలేదు" అని గొణుగుతాడు పొలంబానిస.

"మా లాభాల లెక్కలు గొర్రతో నీటిమీదవ్రాసి వున్నాయి" అంటాడు రైతు. "నిన్నటికి నా చెవులు నుదురు

కన్న ఎత్తుగా వుండేవి. కాని ఈ వేళ అవిబొత్తిగా కనిపించడమే లేదు !" అని వ్యాఖ్యానిస్తాడు భూస్వామి. మనిషి అదృష్టమనే లోయపైన అల్లలాడుతున్నట్లనిపిస్తుంది. దేవుడు రక్షించాడా మహారాజులా వుంటాడు. లేదా మరిపికరుండదు.

చుట్టూ ఎటుచూసినా దగా మోసం ముసురు కొన్న ప్పుడు నిజాయితీ ప్రసక్తి ఏమివుంటుంది ? నిజాయితీకి ఆధా రం ఏది ? ఆలంబన ఏది ?

పితూరీరావు కిదంతా తెలుసును. కాని నేను ముందే చెప్పినట్లు ఈజ్ఞానం అతనిహృదయ వేదనను యింకా అధికం చేసింది. ఆతని కార్యకలాపాలకు కొత్త ప్రోద్బలాన్ని కలి గించింది. అతను తనదేశాన్ని గాఢంగా ప్రేమించాడని మరొక సారి చెప్తున్నాను. తన దేశ దారిద్ర్యాన్ని, నగ్నతను, దాని కష్టాలను ప్రేమించాడు. ఇప్పుడు తనదేశాన్ని కబ ళిస్తున్న ఈశోకాన్ని బాపగల అద్భుతమేదో మున్ముందు జరగగలదని బహుశా దూరదృష్టితో అతను చూసివుండ వచ్చును. మహాత్మ్యాలమీద అతనికి నమ్మకం. మాయ మంత్రాల దేశంలో అతను పెరిగాడు. తనకు తెలియకుండానే ఆ మంత్రాలకు వశుడైపోయాడు. బడుగునాటి జీవితాన్ని ఈ మంత్రశక్తే యిటో అటో తేల్చగలదని అతని నమ్మకం. ఆ మంత్రశక్తి ఎటుపనిచేస్తుంది అన్నదే సమస్య. అదీకాక ఆ దేశానికి గతమంతా అంధకారబంధురంకాదు. అప్పుడప్పుడు చీకటి తెరలు కొద్దికొద్దిగా తొలగేవి. ఆ కొంచెంసేపూ బడుగునాటివారు కాస్త మెరుగనుకొనేవారు. యెండ యెంత మసకగావున్నప్పటికి అది తగిలేసరికి హాయిగా వుందనుకొంటు

న్నారు. వెలుగు మానవులందరికీ హర్ష దాయకమని చెప్ప డానికి యింతకన్న తార్కాణం యింకేమి కావాలి? కాంతి కోసం తహతహలాడే ఈ గుణాన్ని అన్నివిధాలా ప్రోత్స హించాలి. జీవితం ఆనందమయమనీ అంతేకాని చచ్చేవరకూ వెన్నాడే బాధల బ్రతుకు కాదనీ వారికి గుర్తుచేయాలి. మనిషి నిగళాలను మృత్యువు ఛేదించడానికి వీల్లేదు. మనిషే ఛేదిం చాలి. కొత్త తనాన్ని సంతరించుకొన్న నిజమైన మనిషి, తరతరాలదాస్యం అతనిలో పేర్చిన క్రోధాన్ని నిర్జించిన మనిషి ఆ నిగళాలను ఛేదించాలి. మానవ నైజానికి గల అనంత నిర్వచనాలలో ఈసత్యం స్పష్టంగా కనిపిస్తోంది. అందు కని అది కొసకు జయించి తీరుతుందన్న విషయాన్ని శంకిం చడం సాధ్యంకాదు. సత్యం జయిస్తుందని పితూరీరావు నమ్మాడు. ఆ విషయాన్ని యితరులకు చెప్పడమే పనిగా పెట్టుకొన్నాడు.

తనతోటివారి హృదయాలలో వెలుగు, సత్యం అనే భావాన్ని కలిగించడానికీ వెలుగు అనేది వస్తుంది, చీకటి దాన్ని ఆర్పజాలదు అన్న విశ్వాసం కలిగించడానికి అతను త్రికరణశుద్ధిగా పాటుపడ్డాడు. అదే అతని కార్యకలాపాల సారాంశం.

మంత్రమహిమ వ్యక్తమవడంలో జాప్యం కాలేదు. నిజమే. కాని అది అతను కలలుకన్న మంత్రమహిమ కాదు. అది బడుగునాటివారి మామూలు కల్లగారడి.

నిరర్థకం! నిరర్థకం! నిరర్థకం!

ఏం చేస్తే తన కీగతి పట్టింది అని పితూరీరావు ఎన్నడూ తనను తాను ప్రశ్నించుకోలేదు. అసలు నేర మేమీ చేయనప్పుడు యిలాంటి ప్రశ్న వేయడం అసంగతమే కాకుండా అది ప్రశ్న వేసేవారి దుర్బలత్వానికి స్పష్టమైన తార్కాణమని కూడా అతనికి తెలుసును. కాలవశాన యీ దుస్థితి కలిగిందన్న విషయాన్ని అత నెన్నడూ కాదన లేదు. కాగా అది అతిక్రూరంగా అతి బాధాకరంగా వుందని మాత్రమే అనుకొన్నాడు. అతని సుదీర్ఘ సాహిత్య జీవితంలో అనేక పర్యాయాలు మంత్రముగ్ధుడు కావలసి వచ్చింది. కాని యింతవరకు ఆ మంత్రశక్తి కనీసం అతని ఆత్మను తాకకుండా విడిచిపెట్టేది. ఈసారి దాన్నికూడా ఆక్రమించింది. మడతపెట్టి మూసివేసింది. మంత్ర మహిమను ఎరిగినవాడే అయినా యీ సారి పితూరీరావు భయపడ్డాడు. తాను పూర్తిగా ముద్దగా నలిగినట్లు, విరిగినట్లు అనిపించింది. ఇంతకుముందు తెలియని దుర్భర వేదనతో అల్లాడిపోయాడు.

ఆ బాధ మధ్యలో హఠాత్తుగా అతనకి తన "పాఠకుని" సంగతి గుర్తుకువచ్చింది. ఇంతవరకూ పితూరీరావు తన శక్తులన్నింటినీ అనుకోకుండా పాఠకుని కిచ్చివేశాడు. అందుకని అతనినుంచి ఏవైనా సానుభూతి సహాయాలు లభించగలవనే చిన్న ఆశ మొదటిసారిగా అతనిలో మొలకెత్తింది.

వెంటనే లేచి బయటికి పోవాలనిపించింది. అక్కడ బజారులో తనకు దీనిభావం బోధపడగల దనిపించింది.

వీధి మామూలు బడుగునాటి వీధిలాగే వుంది. తన ముందు గుడ్డి చెవుడూ మూగా మూర్తీభవించిన ఒక శూన్యం

వున్నట్లు పితూరీరావుకి అనిపించింది. రాళ్ళు మాత్రమే రోదిస్తున్నాయి. ఈ శూన్యంలో జనం ఏదో దోపిడీ చేయ నున్నవారిలా దొంగచూపులు చూస్తూ యిటూ అటూ హడావుడిగా నడుస్తున్నారు. కానవస్తున్న ప్రాణస్ఫులింగం అదొక్కటే. మిగిలినదంతా ఆశ్చర్యచకితమై మూగవోయి నట్లు కనిపిస్తోంది. ఈ మూగవీధికి కూడా ఏదైనా తెలియక పోతుందా అని అతను మొదట అనుకొన్నాడు. అనుకొనడ మేమిటి పాషాణాల ఆక్రోశాన్ని మనుషుల ఆక్రోశమే నను కొన్నాడు. అయినా అతను పూర్తిగా పొరబడ్డాడని చెప్ప డానికి వీలులేదు. నిజానికి యిక్కడా అక్కడా సన్నని రొద ఒకటి లేకపోలేదు. ఈ రొద మితవాదులది. వారు తన కిటీవలనే స్నేహితులయ్యారు. అతను నాలుగంగలు వేసి అందులో కొందరిని కలుసుకొన్నాడు. మరికొందరు అతని వైపే వచ్చారు. కాని వారి ముఖంలో సానుభూతి మచ్చు కైనా కానరావడంలేదు. పైగా ధర్మచ్యుతి వారి నందరినీ అలముకొంది.

"సరే నేస్తం, మొత్తానికి వారు నిన్ను వూడ్చిపెట్టారు! అంతా చిటికలో తేల్చేశారు !" అని అందులో ఒక డన్నాడు.

"అది పెద్ద దెబ్బే అనుకో! అయినా నీవు చేసిన దేమిటి ? నీకు తెలుసుగా...దానివల్ల లాభంలేదు......నే నెన్నడో చెప్పాను నీకు. వాళ్ళకు గిజాటు కలిగింది. కొసకు..."

"కొసకు ఏమిటి ?"

"ఏమీలేదు 'కొసకు' అంతే. వాళ్ళకు విసుగెత్తింది. ఇది మాటలకు సమయంకాదు. ఇది చూడవలసిన సమయం. చూసి సాధ్యమైనప్పుడల్లా గ్రహిస్తూవుండాలి. అదను లోనే ఈ విషయాన్ని నీవు ఊహించివుండవలసింది. దానితో నీవు ఏకీభవించలేకపోయినా కనీసం వ్యతిరేకించకుండా వుండవలసింది. నా మనసులో ఏం వుందో తెలుసుకో చూదాం! తెలుసుకోలేవు. ఎంచేత? ముక్కుకు సూటిగా చూస్తావుకనుక. అందుకనే వారికి విసుగెత్తింది. నన్ను చూడు. నాకుమాత్రం ఈ పరిస్థితులు సరిపడ్డాయంటావా? నిన్నటిదాకా నీవు సన్నెరగవు! సరే. ఇటీవల నేను చాలా ఆలోచించాను. ఎంతో మంది సలహా లడిగాను. ఆలోచించాను. ఆలోచించాను. ఆఖరికి నేనుకూడా దిగాను!"

"అవునోయ్ నేస్తం" అని మరొక డందుకొన్నాడు.

"నిన్ను చూస్తే జాలి వేస్తోందోయ్. చాలా జాలి వేస్తోంది. నీ వ్రాతలు చదవడం అంటే నా కెంతో యిష్టం. చదువుతూవుంటే చిరునవ్వులు చిందుతాయి. నిట్టూర్పులు వెగడుతాయి. అప్పుడప్పుడు నాలుగు మంచి ముక్కలుకూడా కనిపిస్తూవుంటాయి......దాన్నే స్నేహితునికో చెప్పాలని ఆరాటపడుతూ వుంటాను. నా స్నేహితు డొక డున్నాడు. అతనికి నీ సరుకు కంఠతా చాలావచ్చును. ఏమైతేనేం దేనికైనా హద్దు అంటూ వుంటుంది. ఇప్పుడు కావలసింది ఇది కాదు. మరేదో. నీవీ విషయాన్ని గ్రహించాలి. కాక అలాగే కాచుకొని కూర్చుంటా నంటావా? ఎప్పుడో ఒకరోజున జైల్లో తోస్తారు. ఆ "ఏదో" అంటే ఏమిటో తర్వాత స్పష్టమవు

ంది. కాని ప్రస్తుతానికి...నా విషయమే చూడు. నేను
ంతకాలం చూశాను. ఇతరు లేంచేస్తున్నారో గమనిం
ను. అప్పుడు మా ఆవిడదగ్గరకు వెళ్ళి 'ఇదుగో తరుణం
చ్చింది' అన్నాను. ఆమె వెంటనే ఒప్పుకొంది. అప్పుడు
ర్ణయించాను..."

"ఏమని నిశ్చయించావు?"

"ఏముంది? నలిగినదారినే నడవాలని. అంతే.
ందూ వెనకా చూడవలసిన పనిలేదు. ఆకాశాని కెగిరే
వసరంలేదు. ప్రపంచ సమస్యలను గురించి ఆలోచించ
క్కరలేదు... ఒక్కొక్క అడుగే. తెలిసిందా? సుఖానున్న
ాణాన్ని కష్టాన పెట్టకు. అందులో కొంచెం ఉషారు
క్కువ. ఆమాట నిజమే. కాని మనమంతా మహా మేధా
లం కాలేముకదా? అదీకాక సంసారం సంగతి చూసు
వాలా మరి? మా ఆవిడకు విలాసాలంటే యిష్టం. తెలి
ంది కాదూ? వినోదాలమీాద ప్రీతి మెండు. ఇక స్వవిషయం
ండా ఆలోచించుకోవాలి కదా. మనహోదా, పరిచయాలు,
ంబంధాలు ఎన్నివున్నాయి మరి. అంతా హాయిగా గడువు
ొండడం చూస్తున్నాం. అన్నింటినీ వదులుకొనడం మంచి
ానా అని అడుగుతున్నాను. నే నెప్పటికీ యిలాగే వుంటా
ని అనుకొనకు. ఎన్నటికీ వుండను. కొన్ని పరిమితులకు
ోబడి యీా పని చేస్తున్నాను. కాలం ఎప్పటికీ ఒక్కతీరుగా
ుండదు. మంచిరోజులు వస్తాయి... ఉదాహరణకు మన
ల్లయ్యగారున్నారు... ...మేనేజిమెంటు మారవచ్చును.

ఈవేళ ఎల్లయ్యగారున్నారు. రేపు పుల్లయ్యగారు...అప్పుడు మనం మళ్ళీ..."

"కాని పుల్లయ్యగారు పచ్చిదొంగ."

"దొంగా? ఏమిటయ్యా నీవనేమాట!"

ఆఖరికి మూడవవాడు వచ్చాడు. వచ్చీ రాగానే "మా బాగా అయిందిలే" అని మొహంపట్టుకొని అనేశాడు.

"నీ ఆతతాయితనం ఇంక చాలును. నీవూ చిక్కుల్లో పడతావు. ఇతరుల్ని చిక్కుల్లో పడేస్తావు. ఇంతెందుకు. నిన్ననే నీమూలాన నేను సంజాయిషీ లిచ్చుకోవలసివచ్చింది. ఈవేళ నేను బ్రతికున్నానో చచ్చిపోయానో కూడా తెలియని స్థితిలోవున్నాను. నీకున్న హక్కేమిటి? అని అడుగుతున్నాను. 'నీవు పితూరీరావుతో స్నేహంగావున్నట్లు మాకు తెలియవచ్చింది. అందుకని...' 'అయ్యా స్నేహంగా వుంటున్నావు అనడంలో తమ వుద్దేశ్యం నాకవగతం అవడంలేదు. అతడు కేవలం గంధోళిగాడు. రోజంతా పాటుపడినతర్వాత కాస్త కులాసాగా నవ్వితే తప్పేముంది?' ఇలా సంజాయిషీ ఇచ్చుకోవలసివచ్చింది. ఆలోచించుకొనడానికి నాకు ఇరవై నాలుగు గంటల వ్యవధి ఇచ్చారు...ఏమి కానున్నదో ఆ దేవునికే తెలియాలి! నాక్కూడా సంసారం వుందయ్యా! భార్యా బిడ్డలు...ఇక నేనంటారా? నేనుమాత్రం కొయ్యబొమ్మను కానుకదా? ఇలా జరుగుతుందని ఎవరనుకొన్నారు? మీకేం హక్కుంది అని మళ్ళీ మళ్ళీ అడుగుతున్నాను. అయ్యో! రాతా!!"

ఇక సంభాషణ సాగించడంలో అర్ధంకనిపించలేదు పితూరీరావుకు. దారిలో తన చిన్ననాటి స్నేహితుని ఇంటి మీదుగా పోవలసివుంది కనుక అక్కడైనా కాస్త ఉపశాంతి లభిస్తుందేమోనని తలుపు తట్టాడు.

నౌకరు చాలా మర్యాద చేశాడు. బహుశా వానికి జరుగుతున్న సంగతులేవీ తెలియవని దీన్ని బట్టి స్పష్టమవుతుంది. అయ్యగారు ఇంటిలో లేరు. అమ్మగారు కచేరీ గదిలో వున్నారు అని చెప్పాడు నౌకరు. పితూరీరావు తలుపు తెరిచి గడపదాటాడా లేదో ఆవిడ కెవ్వున అరిచిపారిపోయింది. పితూరీరావు వెనకకు తిరిగాడు.

అప్పుడు తన పాతస్నేహితుడు, పిరికికండ పిచికోజీరావు సంగతి జ్ఞాపకం వచ్చింది. అతను పొరుగు వీధిలోనే వుంటున్నాడు (పదిహేనేళ్ళక్రితం వీరిద్దరూ పాపకూపాల శాఖలో సహోద్యోగులు).

పితూరీరావంటే పిచికోజీరావుకు చాలా అభిమానం వుంది. ఉద్యోగంలో మాత్రం పైకెక్కలేక పోతున్నాడు. పదేళ్ళకుపైగా హెడ్ గుమస్తాగా గాడిద చాకిరీ చేశాడు. ఆపదేళ్ళలోనూ పైకిపోయే ఆశ అణుమాత్రమూ కనిపించలేదు సరికదా రాజకీయంగా మార్పులు వచ్చినప్పుడల్లా ఉద్యోగం ఎక్కడ ఊడి పోతుందోనని గజగజలాడి పోయేవాడు. అసలే పిరికి. చొరవ బొత్తిగా లేదు. అందుకని ప్రైవేటు సంస్థలలో ఎక్కడా అతనునౌకరీ సంపాదించలేక పోయాడు. పైకి రావాలన్న ఆలోచన పుట్టినప్పుడల్లా అది తనకు సాధ్యమయ్యే పనేనా అని తనలోతాను నవ్వుకొనే

వాడు. పై అధికారులకు అర్జీ పంపు కొనడానికి భయం. తన పైవారి గదులచుట్టూ ప్రదక్షిణాలు చేయడంకూడా చాత కాదు. ఒకసారి తనలాంటి మేధకులను ప్రోత్సహించవలసిన అవసరాన్ని వివరిస్తూ పై అధికారికి విజ్ఞాపన అందజేశాడు. అధికారి దాన్ని చదివి తర్జని ఆడించాడు. అంతే దానితో మరెన్నడూ కూడా పిచికోజీరావు నోరెత్తలేదు. కొద్దికాలంగా అతనికి ఆశలు తిరిగి చిగురిస్తున్నాయి. తమ దొరగారు వెళు తున్న గుళ్ళోకే తానూ వెళుతున్నాడు. ఒకనాడు దొరగారు దానాల రొట్టెలో సగం ముక్కకూడా (మాడిపోయిన సగం) బహూకరించాడు. సంతోషించానోయ్ అని కూడా ఒకసారి అన్నాడు. ఇలాగ మంచిరోజులు రాబోతున్న తరుణంలో హఠాత్తుగా...

పితూరీరావు పిలుపు విని ఇంట్లోవున్న ముసిలిదాది తలుపు తెరిచింది. పిల్లలు భయంతో దాది వెనుక నక్కి చూస్తున్నారు. పేలు కుక్కుకుంటూ వుంటే హఠాత్తుగా ఊడి పడ్డవాడెవడా అన్న చిరాకు దాదిలో ద్యోతకమవు తోంది. అందుకని ఎక్కువమాట్లాడ్డం ఆవిడ కిష్టంలేదు.

"పిచికోజీరావుగారు ఇంట్లోలేరు. దొరగారు కబురు పంపగా వెళ్లారు. ఇదిగో మీామూలానే. ఆయనింకా బ్రతికే వున్నాడో చనిపోయాడోకూడా తెలియదు. అమ్మగారు గుడికి వెళ్ళారు."

పితూరీరావు వెనకకు తిరిగాడు. నాలుగడుగులు వేసే సరికి పిచికోజీరావే ఎదురయ్యాడు.

"ఇదిగో పితూరీరావు నన్ను క్షమించాలి. ఇక మన స్నేహం మంచిదికాదు!" అని కంగారు పడుతూ చెప్పాడు పిచికోజీరావు.

"ఈసారి ఎలాగో బ్రతికి బయట పడ్డాను. అయినా ఇంకా నమ్మకంగా చెప్పలేను. 'నీమీద ఒక బ్లాకుమార్కు వుందోయ్' అని మాదొర అన్నాడు. నాకూ పెళ్లాంబిడ్డ లున్నారు. నీకు తెలుసునుగదా ? బాబూ పితూరీరావు! నీకు దండంపెడతాను. నన్ను విడిచిపెట్టు. ఇంత పిరికితనం చూపిస్తున్నందుకు క్షమించు. ఏంచేయగలను? నీవే చెప్పు మరి!"

..............................................

నీరసంతో, నిరుత్సాహంతో ఇల్లుచేరాడు పితూరీరావు. ఇటుపైన తన కేకాంతవాస మేగతి అని అతనెరుగును. ఈ ఏకాంతవాసం గతిపట్టిందంటే పాఠకునికితనిమీద అభిమానం లేకకాదు. నిజానికతనికి అభిమానమే కాదు ప్రేమ కూడా వుంది. కాని 'నిజమైన' పాఠకునితో సంబంధాలు తెగిపోయాయి పితూరీరావుకు. అదే ఈ యేకాంతవాసానికి కారణం. తనకు చుట్టుకొన్న ఈబంధనాలను తెంచుతాడేమో ననుకొనడానికి ఆ పాఠకుడు చాలాదూరాన వుండిపోయాడు. పోతే తనకు సర్వదాసన్నిహితంగా వుండే మరొక పాఠకుడు మిగిలాడు. అతడు విషపు పుచ్చు. తేలుకొండి. ఎప్పుడైనా కుట్టగలడు. అలాంటివాడు మిగిలాడు. ఈ మౌనం అంటే తనకు మహాకమంటగా వుందని ఆపాఠకుడు పితూరీరావును బాహాటంగా హెచ్చరించాడు.

ఆలోచనలు మెదడులో మెల్లగా పారాడాయి. ఈ ధర్మభ్రష్టత అంతలోనూ వ్యక్తిద్రోహం ప్రధానాంగంగా అతనికి కనిపించలేదు. సర్వే సర్వత్రా పీడన అతనికి గోచరించింది. నిన్నటిదాకా నిర్భయంగా కనిపించిన ఈ మేధావులు, మొన్న మొన్నటిదాకా తనతో మనసారా మాట్లాడిన వీరు ఈ నాడు తననేదో మహామ్మారిని చూసినట్లు చూస్తున్నారంటే కారణం. కేవలం ప్రాణాలమీదతీపి ఒక్కటేనంటామా ? కాదు. వారు పీడనకు గురయ్యారు.

వారు తమ జీవిత తృష్ణతో పీడితులయ్యారు. ఈ తృష్ణ సహజమైనదే, న్యాయమైనదే. అయితే "బ్రతకాలను కొన్నవాడు క్రూరమైన బానిసతనానికి తలవంచక తప్పదా?" ఈ ప్రపంచంలో సహజత అనేది ఎల్లప్పుడూ మంచికీ మహోదాత్తతకూ విరుద్ధంగానే వుంటుందా ?" ఈ ఆలోచన వచ్చేసరికి పితూరీరావుకు భయంతో వళ్ళుకంపించింది.

అదీకాక మొన్న తనతో మాట్లాడినవారంతా తమకున్న సంసారబాధ్యతలు వెళ్ళబోసుకొని తమ ధోరణిని సమర్థించుకొన్నారు. మా ఆవిడకు విలాసాలంటే ఇష్టం అని ఒకరన్నారు. మరొకరు "మా ఆవిడ" అన్నారు. అంతే... అన్నిటికన్నా దారుణంగావుంది పిచికోజీరావుస్థితి. అతని కుటుంబాన్ని గురించి దిగులు పట్టుకొంది. ఆ కుటుంబంకోసం నిద్రాహారాలుకూడా లేవతనికి. ఎప్పుడూ ఏదో పై పని చూసుకొని మరింత సంపాదించాలనే ధ్యాసతప్ప మరొకటి లేదు. అయినా అతను సంపాదించేది అతిస్వల్పం. ఇల్లాలు ఆత్మత్యాగంచేయబట్టికాని లేకుంటే ఆ దారిద్ర్యానికి తట్టుకో

లేకపోయేవాడు. అందుకని ఈ పిడికెడు మెతుకులకోసం, ఈ బిచ్చంకోసం...

ఏమిటిది? ఏమిటి ఈకుటుంబం? ఈసమస్యను పరిష్కరించేదెలాగ ? మనిషిపాలిట ఈ కుటుంబం మహామారి కాకుండా వుండాలంటే అతని మెడకు గుదిబండ కాకుండా వుండాలంటే ఏంచేయాలి ?

పితూరీరావు ఈ విషయమై చాలా ఆలోచించాడు. హఠాత్తుగా కంపించాడు.

"ఇంతటి ప్రధాన సమస్యలు ఇప్పుడున్నంత తీవ్రంగా ఇంతకు ముందెందుకు లేవు ?" అని అతని అంతర్వాణి ప్రశ్నించింది.

"నీవిప్పుడు ఎందుకూ కొరగాని ఏమీచేయలేని బానిసవను కొంటున్నావు. కాని నీలో ఇంతో అంతో శక్తి ఉందనుకొనడానికిముందు కూడా నీవు బానిసవు కాదా? నీవు ధైర్యంగా ముందుకువచ్చి ఆత్మత్యాగం ఎందుకు చేయలేదు? ఆర్తనాదాలు వినవచ్చిన చోటికి తిన్నగా పరుగెత్తకుండా నీ కొక హోదానిచ్చిన వృత్తికీ, పరిచయాలకు, స్నేహితులకు ఎందుకు బానిసవైనావు? ఏదో అవ్యక్తసానుభూతి చూపడానికి మారుగా ఆ వేదనలనే నీ వెందుకు భరించలేదు ?

"నిరసన, ఆక్షేపణ నీ కలం కుమ్మరించిన మాట నిజమే కాని, వాటికి నీవు ఇచ్చినరూపం వల్ల అవి చచ్చి వూరుకున్నాయి. నీవు ఏ చెడుగులను ఆక్షేపించావో అవి నీ ఆక్షేపణకు పూర్వం ఎలా వున్నాయో ఇప్పుడు కూడా సరిగా అలాగే వున్నాయి.

"నీవు వృథాశ్రమ చేశావు. అబద్ధాల అల్లకాలలో నాలుకలు వాలికలైన బారిస్టర్ల శ్రమలాగే నీ శ్రమకూడా వృథా. నీవు గొంతెత్తి ఆక్షేపణ తెలిపావు. కాని ఏమి చేయాలో నీవెన్నడూ చెప్పలేదు. పోరులోదిగి నాశనమైన వారిని గురించి నీవు కేవలం సానుభూతి వెల్లడించావేకాని వారితరఫున నిలిచి నీవు మాట్లాడలేదు. కోపిష్టి బానిసల మనస్తత్వంనీది. ఉద్దేశాలు మంచివేకాని ఫలితం శూన్యం. ఈవేళనిన్నుచూసి మొహం తిప్పుకొన్నవారు మరి నీతో మాట్లాడరు. వారు నిన్నటివరకూ బాగానే వున్నారని నీ వనుకొన్నావు.

"నిజమే. వారు చేసినపనులను చేయడం నీకు చాత కాదు. చిన్ననాటినుంచీ నీ అణువణువునా జీర్ణించిన ఆ నిరర్థక సదుద్దేశాలను విడనాడే శక్తి నీకు లేదు.

"అయితే దీనివల్ల నీకు మేలుకలుగుతుంది...ఎప్పుడు? ఎక్కడ? కాని ఇప్పుడు నిన్నుముదిమి పొదువుకొంటున్నది. దాని అవలక్షణాలన్నీ పొడసూపుతున్నాయి. అలాంటప్పుడు నీవాశించేదేమిటి? ఆలోచించు!"

తాజాకలం.

ఇప్పుడు చెప్పినదంతా కేవలం కట్టుకథ అని వేరే చెప్పనవసరంలేదు. పితూరీరావనే వ్యక్తి ఎవరూలేరు. అసలలాంటివారు పుట్టనేలేదు. ద్రోహులు, ఏ యెండకాగొడుగు పట్టే ప్రబుద్ధులూ ఇప్పుడే కాదు ఎప్పుడూ వున్నారు. మిగతా

వన్నీ సజావుగానే వున్నాయి కాబట్టి ఆర్భాటం చేయదగ్గ అంశ మేదీ ఇంక లేదు. మనసులో మాయలేని రచయిత పాఠకుణ్ణి క్షమించవలసిందని వేడుకొంటున్నాడు.





# గవర్నరుగారి పట్టుదల

అనగా అనగా ఒకానొక దేశం. ఆ దేశంలో ఒక రాష్ట్రం. ఆరాష్ట్రానికి మంచి పట్టుదల గల గవర్నరొకడుండేవాడు. ఆరోజుల్లో ప్రతిగవర్నరూ తను చేయకలిగినంత కీడు చేసేవారు. దానివల్ల మేలుకలిగి తీరుతుందని వారి నమ్మకం.

ఆరోజుల్లో పెద్ద పెద్ద అధికారులంతా ఏమనేవారంటే "ముందు జనాన్ని పట్టుకొని ఉన్నదంతా ఊడ్చేయాలి. ఆతర్వాత తాటవలవాలి. అప్పుడు కొరడాలతో మెరుగు పెట్టాలి. ఆ పైన తగినంతకవాతు చేయిస్తే ఊపిరిలేచి వచ్చి బాగుపడతారు" అని.

మన గవర్నరు ఈ సూత్రాన్ని అప్రయత్నంగా తన ముక్కుమీద గిలకరించుకొన్నాడు. తర్వాత అతడిని (అతని తెలివితేటలకు బహుమతిగా) ఒకానొక దత్త మండలానికి పంపినప్పుడు సిద్ధంగావున్న ఈ కార్యక్రమంతో పదవిలోకి చేరాలిమరి. మొదట శాస్త్రిలను నిషేధించడం. తర్వాత ఊరును తగల బెట్టడం. ఆతర్వాత జనాన్ని హడలెత్తించడం. ఇలాగ ఈకార్యక్రమం సాగుతున్న కొలదీ అప్పుడప్పుడు గుడ్లనీళ్ళు కుక్కుకొని "ప్రజల మేలుకోసమే కీడుసంతా చేస్తున్నాను. పైన భగవంతుడే సాక్షి" అనుకొంటాడు. ఇలా రెండేళ్ళపాటు ఆప్రదేశాన్నంతా సర్వనాశనం చేసేసరికి ఆదత్తమండలం క్రమంగా మర్యాద మన్ననగల మండలంగా మారిపోతుంది. ఆతర్వాత ఎలాగూ ఇంతవరకూ వచ్చింది కాబట్టి అది నేరస్తులకు చక్కని శిబిరంగా ఉపయోగ పడుతుంది.

అవును చక్కని నేరస్తుల శిబిరం. అక్కడి జనం ఒకరి జోలీ సొంటీ పట్టించుకోరు. తుపాకి మందు కనిపెట్టరు. సంపాదకీయాలు వ్రాయరు. వారంతా గౌరవంగా హాయిగా బ్రతుకు తారు. వారంలో ఆరురోజులూ తమ పనులు తాము చూసుకొంటారు. ఆదివారాల్లో గవర్నరుగారి ఆరోగ్యం కోసం ప్రార్థనలు చేస్తారు. ఇలాగ కాలం గబగబడిచి పోతుంది. వారికి చదువురాదు కాని పరీక్షలకు మాత్రం సర్వదా సంసిద్ధం. వారు త్రాగరు కాని సారాపాకల లాభాలు మాత్రం మేటలు వేసు కొంటాయి. వారు విదేశీ సరుకు కొనరు. కాని దిగుమతి సుంకాలు మాత్రం వరస

తప్పకుండా వస్తూవుంటాయి. ఇక వారి గవర్నరు పట్టుదల మనిషి. అంతా చూసి ఆనందిస్తాడు. ఆడవారికి పచ్చడాలు, మగవారికి నడికట్లు బహూకరిస్తాడు. అతని నేరస్తుల శిబిరం తీరు ఇది. అందుకనే శాస్త్రిలను నిషేధించడం, ఊరు తగల బెట్టడం. జనాన్ని ఎముకలు విరగ గొట్టడం తెలిసిందా ?

"చిత్తం చిత్తం. తెలిసిందండి !"

ఇలాంటి ఆశలు పెట్టుకొని వచ్చాడు గవర్నరు. రాగానే కీడుచేయడానికి దిగాడు. ఇలాగ ఒక ఏడాదిగడిచింది. మరొక ఏడాదిగడిచింది. ప్రజలకు కావలసిన వస్తువు లన్నింటినీ బంద్ చేశాడు. వైద్యశాఖలను రద్దుచేశాడు. పుస్తకాలన్నీ తగలబెట్టి బూడిదను గాలిలో విరజిమ్మాడు. మూడేళ్ళపాటు ఇలాంటి ఫలవంతమైన కృషిసలిపిన మీదట సింహావలోకనం చేసుకొనడానికి ఆగాడు. హేభగవాన్ ! ఈ దత్తమండలం ఏనాడో బాగుపడి వుండవలసింది. కాని తీరా చూస్తే మర్యాద మన్ననగల మండలంగా మారే లక్షణం కలలోకూడా కనరావడంలేదు. తానువచ్చినప్పుడు జనం భయంతో ఎలా బిక్కచచ్చిపోయారో ఇప్పుడూ అలాగే వున్నారు, గాజువారినకళ్లు, తెరిచిననోళ్లు. అలాగే నడుస్తున్నారు.

దీనికి కారణం ఏమిటా అని గవర్నరు ఆలోచనలో పడ్డాడు.

ఆలోచించగా ఆలోచించగా ఆఖరికి ఒక ఉపాయంతోచింది. "మితిమీరిన ఆలోచన-అదేవచ్చిన చిక్కు" ఇంతకు ముందు తార్కాణాలేవైనా వున్నాయా అని వెతికాడు. వెతికిన

కొలదీ అంతా స్పష్టంగా తేలింది. తానెంతో కీడు చేసినప్పటికీ అదింకా నిజమైనకీడుగా రూపొందలేదు. ఊరంతటినీ ఒక్క త్రుటిలో ఊడ్చిపెట్టగల కీడుగా మారలేదు. అబ్బే. అదింకా సిద్ధించలేదు. దీనికంతటికీ మూలకారణం 'ఆలోచన'. 'ఇదిగో మీ పనిపడతా' అని అరిచి అడుగువేసినప్పుడల్లా ఈ 'ఆలోచన' వల్ల అడుగు ఆగిపోయేది. ఎంతమూర్ఖుడవయ్యా నీవు అనిపించేది. దానితో వెనకడుగు పడేది. ఈ ఆలోచనే అడ్డురాకపోతే అందర్నీ ఏనాడో నేరస్థుల శిబిరంలో కుక్కి వుంచేవాడు.

ఇలాగ కొత్త ఊహ తోచేసరికి "ఇదిగో ఇప్పుడు మీకు కావలసినంత హుషారు కల్పిస్తాను!" అని అరిచాడు గవర్నరు.

పిడికిలి బిగించి కిటికీ వైపు చేయివిసిరాడు. బహుశా దానివల్లనైనా దత్తమండలానికి మేలుకలగ వచ్చును.

అతని అదృష్టవశాత్తు ఆ ఊళ్ళో ఒక కొరవంజివుంది. ఆమె తేయాకు చూసి సోదెచెప్పుతుంది. ఆలోచనలు రాకుండా తాయెత్తులుకూడా కడుతుంది. అందుకని అతను తిన్నగా ఆకొరవంజి దగ్గరకువెళ్ళి "ఆలోచనలను తీసెయ్" అని అరిచాడు. ఏ మాత్రమూ ఆలసించకుండా చేయవలసిన పనాయె ఇదిమరి అతని బుర్రలో రంధ్రమెక్కడుందో వెతికి దాని బిరడా వూడదీసింది కొరవంజి. జుమ్మంటూ ఏదో ఆరంధ్రం లోంచి ఎగిరిపోయింది. గవర్నరుగారి ఆలోచనలు ఎగిరి పోయాయన్నమాట!

దానితో అతని కమితానందం కలిగిందని వేరే చెప్పాలా? ఆహుషారులో తినడం మొదలు పెట్టాడు. కాని

చేయినోట్లో పెట్టుకోనడం చాతకాలేదు. అదికొంచెం చికాకు కలిగించింది.

కొంతసేపు అయినాక ఆఫీసుకు పరుగెత్తాడు. ఏదో కీడు చేయాలనే కుతూహలంతో గదిమధ్య నిలబడ్డాడు. కాని పాపం ఏం కీడు చేయాలో ఎలా చేయాలో కూడా తోచ లేదు. ఊరికే కూడా వుండలేక పోయాడు. అందుకని కళ్ళప్ప లించకుండా చూస్తూ ఏదో రొదచేశాడు. అతని అనాలో చిత స్థితిని చూసేసరికే అందరికీ హడలు పుట్టి పరుగులు పెట్టారు. అప్పుడతను టేబిలును గుద్ది తుత్తునియలు చేశాడు. తానుకూడా అక్కడనుంచి పరుగు పెట్టాడు.

పొలాల్లోకి వచ్చాడు. అక్కడ దున్నేవారు, నూర్చే వారు, గడ్డివాములు వేసేవారు కనిపించారు. వారిని నేరస్తుల శిబిరంలో వుంచడం ఎంత అవసరమో అతనికి తెలుసును. కాని ఆ పని ఏలా చేయాలి అదే తోచడంలేదు. అందులో ఒకరివైపు కళ్ళెర్రచేసి చూశాడు. చేతిలో వున్న గొర్రును లాక్కొని తునాతునకలుచేశాడు. మరొకరి మీదికి ఉరికి నాగలిని గుంజుకోనేలోగా జనం భయపడి పారిపోయారు. త్రుటిలో పొలం అంతా ఖాళీ అయిపోయింది. అప్పుడే వేసిన ఒక కుప్పను తిరగదీసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఊళ్ళోకి వచ్చాడు. దానికి నాలుగు మూలలనుంచీ నిప్పు పెట్టాలను కొన్నాడు. కాని ఎలా ప్రారంభించాలో తెలియలేదు. అలవాటువల్ల అగ్గిపెట్టెతీసి ఒక పుల్ల వెలిగించాడు. కాని మంటవున్న వైపు కిందికి వంచి పట్టుకొన్నాడు. అక్కడినుంచి గంటల గోపురం దగ్గరకు పరుగెత్తి గంట

మ్రోయించాడు. ఒక గంట, రెండుగంటలు అలా మ్రోయిస్తూనే వున్నాడు. అలా ఎందుకు చేశాడో ఎంత బుర్రకొట్టుకొన్నా తెలియ లేదు. జనమంతా గుమిగూడి "నిప్పెక్కడ అంటుకొంది?" అని అడిగారు. ఆఖరికి గంటలు మ్రోయించడం విసుగెత్తింది. కిందికి దిగి వచ్చి అగ్గిపెట్టె తీశాడు. అగ్గిపుల్లలన్నింటినీ ఒక్కసారే వెలిగించాడు. దాన్ని జనం మీదికి విసురుదామను కొంటూవుండేసరికి జనం కకా వికలై పారిపోయారు. అతనొక్కడే మిగిలిపోయాడు. అప్పు డింటికి వచ్చి తలుపులు బిడాయించుకొన్నాడు.

అలా ఒక వారం కూర్చున్నాడు. రెండు వారాలు కూర్చున్నాడు. కీడేమీ చేయ లేదు. అతని కేమీ తెలియడం లేదు, అంతే. ఊళ్లో జనానికికూడా ఏమీ తెలియడంలేదు. గవర్నరుగారు నిరపాయకరంగా కూర్చున్నారు కాబట్టి వారిప్పుడైనా తెలివి తెచ్చుకోవలసింది. కాని అలా చేయ లేదు. ఇంకా భయపడి పోయారు. భయపడకుండా వుండ లేక పోయారు. అంతవరకూ కీడునుమాత్రమే వారు చూశారు. దానినుంచి ఏక్షణంలోనైనా మేలుకలుగవచ్చునని ఎదురు చూస్తున్నారు. ఆ ఎదురుచూసిన గడియ రానున్న ఈ తరు ణంలో హఠాత్తుగా ప్రశాంతత అలముకొంది. కీడు లేదు. మేలు లేదు. అంతా నిస్తబ్దత. జనం నిశ్చేష్టులై పోయారు. తమ తమ పనులు మానేశారు. కలుగుల్లో దూరారు. ఓన మాలు మరిచిపోయి అక్కడ నిరీక్షిస్తూ కూర్చున్నారు.

ఇలా వుండగా గవర్నరుగారి బుర్రలో బిరడాకింద క్రమక్రమంగా ఆలోచనాశక్తి పేరుకొంది. ఒక రోజున కిటికీ

లోంచి బైటకు చూశాడు. అప్పుడే ఏదో మెరుపులాగ తోచింది.

"నేను అనాలోచితంగా వున్నట్లు కనిపించడంవల్ల నిజమైన కీడు జరిగిందనుకొంటాను" అనుకొన్నాడు. జనం వచ్చి అయ్యా ఒక నేరస్తుల శిబిరాన్ని నెలకొల్పండి అని ప్రాధేయపడతారని ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

ఎంతకాలం ఎదురుచూసినా ఎవరూ రాలేదు. అంతా సర్వసిద్ధంగా వున్నట్లు కనిపించింది. పొలాలు పర్రల్లా వున్నాయి. నదుల్లో నీరులేదు. తెగుళ్లు తగిలి పశువులు చని పోతున్నాయి. బడులు మూతపడ్డాయి. ఇంకొక్క ఊపు ఊపితే చాలును. దేశంయావత్తూ నేరస్తుల శిబిరం అయి ఊరుకుంటుంది. అయితే నేరస్తులు ఎవరవుతారు అనేది ప్రశ్న. కనుచూపుమేరలో మనిషన్నవాడు కానరావడంలేదు. కళ్లమీద ఈగలుముసిరినట్లు గూండామూకమాత్రం గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. కేవలం వీళ్ళతోనే నేరస్తుల శిబిరాన్ని పెట్టడం సాధ్యంకాదు. నేరస్తుల శిబిరం పెట్టారంటే అందులో ఒక్క సోమరిపోతులు మాత్రమే వుంటే చాలదు. నిజంగా కష్టించి పనిచేయగల పేదజనం కావాలి.

గవర్నరుకేమీ తోచలేదు. వీధిలోకి నడిచాడు. జనం దాగొన్న కలుగుల్లోకి పాకాడు. ఒక్కొక్కరినే జుట్టు పట్టుకొని పైకిలాగాడు. ఒక్కొక్కరినే పైకిలాగడం, నిశ్చేష్టులను చేయడం ఇదీవరస. ఇక్కడొక కొత్త సమస్య వచ్చి పడింది. ఆఖరి కలుగులోవున్న మనిషిని ఈవలికీడ్చేసరికి అంతకుముందు వారు తిరిగిపోయి దాగొనేవారు.

ఇలాంటి ఆపత్సమయంలో తన గురువుగారి మాటలు జ్ఞాపకంవచ్చాయి. "నీ స్వదేశాన్ని నీచపరచాలంటే గూండాలను పిలు" అంటూవుండేవా డాయన.

గవర్నరుకు హుషారెక్కింది. గూండామూకను పిలవ నంపి "అబద్ధాలూ, అపవాదులూ వెదజల్లండి!" అని హుకుం చేశాడు.

దేశం అల్లకల్లోలమైపోయింది. కొంతమందికి కన్నీరు మున్నీరై ప్రవహించింది. కాని గూండా మూకకు మాత్రం పండుగలాగా వుంది. రేయింబవళ్ళు వారు స్వైరవిహారం చేసేవారు. జన్మానికల్లా శివరాత్రి అన్నట్లు ప్రవర్తించేవారు. కొందరు అపవాదులు, ఆకాశరామన్న ప్రకటనలు తయారు చేశారు. ఇతరులు కీడు పదకాలు వేశారు. మరికొందరు తీవ్రచర్యలు తీసుకోవాలని సూచించారు. "కావలసింది తిండికాదండి – దేహశుద్ధి!" అనివారు గోలపెట్టారు. ఈ కంగాళీ అంతా గవర్నరుగారి కచేరీలోకి ప్రవహించింది. అతను ఒక్కొక్క కాగితమే చదివాడు. కాని అతని తెలివి దానివల్ల పెరగలేదు. "ముందు డప్పులు వాయించాలి. అలా చేస్తే జనం హఠాత్తుగా నిద్రలోంచి మేల్కొంటారు." ఎందుకు? "జనాన్ని నిరంతర చింతలో ముంచాలి." ఎందు కోసం? "అమెరికాను మళ్ళీ బంద్ చేయాలి." కాని అది తాను చేయవలసిన పనికాదు. చదివినకొలదీ విసుకెత్తింది. ఒక్క నిర్ణయంకూడా చేయలేక పోయాడు.

అనాలోచిత నిర్ణయాలు చేసే గవర్నర్లుంటే ఊళ్లు పాడౌతాయి. కాని అసలు నిర్ణయాలే చేయని గవర్నర్లు అంత కన్నా దారుణం!

మళ్ళీ గూండామూకను పిలవనంపాడు.

"నిజమైన కీడుకలగాలంటే ఏం చేయాలి? చెప్పండి గూండా వెధవల్లారా!"

దానికి గూండామూక ఒక్క గొంతుతో ఇలా జవాబిచ్చారు:

"మా కార్యక్రమాన్ని సమగ్రంగా అమలుజరిపితే తప్ప నిజమైన కీడు కలిగించడం సాధ్యంకాదు. ఇదిగో మా కార్యక్రమం ఇది: గూండా వెధవలమైన మాకు మాత్రమే వాక్స్వాతంత్ర్యం వుండాలి. మిగతావారంతా నోరెత్తడానికి వీల్లేదు. మా గూండా వెర్రివేషాలన్నింటినీ ఆమోదించాలి. ఇతరుల కోర్కెలను ఖాతరు చేయకూడదు. మా గూండా సజ్జంతా విలాసంగా బ్రతకాలి, మిగతా వారంతా మన్ను కొట్టుకుపోవాలి. హడావుడీ, హంగామా మా గూండాలే చేయాలి. మిగతా అందరికీ అరదండాలు వేయించాలి. మా గూండాలు చేసిన కీడునంతనీ మేలుగా భావించాలి. ఇతరులు చేసిన మేలైనా కీడైనా దుర్మార్గంగా భావించాలి. మాకెవరూ ఎదురాడరాదు. మాపై ఎవరూ చాడీ చెప్పరాదు. కాగా మేం గూండాలం కాబట్టి మేం మాత్రం మా ఇష్టంవచ్చినట్లు ఇతరులమీద అపవాదులు వేస్తాం.

ఈ కార్యక్రమాన్ని అక్షరాలా అమలుపరుస్తే మీరు ఆశించిన నిజమైన కీడు మూడుతుంది."

గవర్నరు ఈ ప్రసంగం విన్నాడు. గూండాల గీర తనకు నచ్చక పోయినప్పటికీ వారి పద్ధతి సరియైన ధోరణి లోనే వుందని గ్రహించాడు. అందుకని వారి వరాలన్నింటినీ మంజూరు చేశాడు.

"సరే మీ కార్యక్రమాన్ని నే నంగీక రిస్తున్నాను. దానివల్ల కావలసంత కీడు మూడుతుందని కూడా ఒప్పు కొంటున్నాను. అయితే అది మన దత్తమండలం అభివృద్ధి పొందడానిక తగినంత కీడు అవునా కాదా అన్న విషయాన్ని చూడవలసివుంది."

ఈ గూండాల ప్రసంగాలను అచ్చువేయించి జనం చదువుకొనడానికి వీలుగా గోడల కంటించాలని ఉత్తరువులు జారీచేశాడు. తర్వాత ఏంజరుగుతుందో చూడ్డానికి కిటికీ దగ్గర తిష్టవేశాడు. ఒక నెల చూశాడు. రెండు నెలలు చూశాడు. గూండాలు అపవాదులు వేశారు. దోపిడులు చేశారు. ఒకరి గొంతు లొకరు కోసుకొన్నారు. అయినా దత్తమండలం బాగుపడనని మొండికేసింది. అంతకన్నా దారుణ మేమిటంటే, ఊళ్లో జనం ఇంకా లోతు బొరియలు తవ్వుకొని దాగొన్నారు. వారి ఐపు ఆనవాలుకూడా కని పించడం లేదు. వారిని బ్రతికి వుండగా కాదుకదా చచ్చిన తర్వాతకూడా వెలికితీసేఆశ కనిపించ లేదు.

కడకు గవర్నరొక నిశ్చయానికి వచ్చాడు. ఊరి గవనిదాటి తిన్నగా దారిపట్టాడు. అలా పోగా పోగా పోగా పెద్ద పట్నంలో పెద్ద గవర్నరు దొరగారి దివాణం వచ్చింది.

చుట్టూ చూసి తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. ఇక్కడ గూండాలు ప్రతివీధి మొగనానిలిచి తమ కార్యక్రమాన్ని గురించి అరిచి ఎంత కాలమయింది? పట్నవాసులు తమ కలుగుల్లో ఎంతకాలం దాగున్నారు? ఇప్పుడు పరిస్థితులన్నీ తారుమారయినట్లు కనిపిస్తోంది. పట్నవాసులు అడ్డూ అదుపూ లేకుండా వీధుల్లో నడుస్తున్నారు. గూండాలు దాగొన్నారు!

ఎటుచూసినా వాతావరణం తేనెలా గోచరించింది. నేల ఈనిన ఫలసాయం పుష్కలంగావుంది. ఒక పూటకూటింట్లో అడుగు పెట్టాడు. "అయ్యా వ్యాపారం ఇంత చక్కగా ఎన్నడూ జరగలేదనుకోండి" అని వినిపించింది. ఒక రొట్టెల దుకాణంలో అడుగు పెట్టాడు. "అయ్యా ఇన్ని రొట్టెలు మా జన్మలో అమ్మి ఎరగం" అన్నారు - అక్కడివారు. ఒక పచారీ కొట్లోకి వెళ్ళాడు. "అయ్యా సరుకు కెంత గిరాకీగా వుందంటే మేం అందించలేక సతమత మవుతున్నామనుకోండి. తెచ్చిన సరుకు చిటికలో అయిపోతున్నది!" అన్న మాటలు ఎదురయ్యాయి.

"దీనికి కారణ మేమిటి?" అని ఎరిగినవారినీ ఎరగనివారినీ అందరినీ అడిగాడు.

"ప్రతిదీ ఇక్కడింత అద్భుతంగా వుండడానికి చే
నిజమైన కీడేమిటి ?"

"అబ్బే ! అసలు కీడేమీ జరగనే లేదండీ. జరిగినదం
మే లేనండి. పెద్ద గవర్నరు పదవికి ఒక కొత్త దొరగ
వచ్చారు. ఆయన అసలు కీడుఅనేదే లేకుండా చేసివే
రండి. అందుకనే ఇంత హాయిగా వుంటున్నాం !"
వారంతా జవాబు చెప్పారు.

దానిమీద మన గవర్నరు పెద్ద గవర్నరుగా
సందర్శించడానికి బయలుదేరాడు. పెద్ద గవర్నరు
ప్రాసాదం కొత్తరంగులతో ధగధగ మెరిసిపోతోంది. నౌ
కొత్తవారు. చాకర్లు కొత్తవారు పెద్ద గవర్నరుదొరగ
సరికొత్తవారు. పాతదొరగారు విషవుప్పచ్చి అనిపించా
కాని ఈ కొత్త దొరగారు మంచి తప్ప మరేమీ చేయ
వారిలా కనిపిస్తున్నారు. పాతాయనకు గురగురలాడ్డం ఒక
చాతనవును. ఈ కొత్తాయనకు కోయిలపాటలాంటి ఒక వ
వచ్చును. ఆయన మందహాసంతో కరచాలనం చేశా
అతిథికి ఆసనం చూపాడు. దత్తమండలం పరిస్థితులనుగురి
అడిగాడు.

"అక్కడి విశేషాలేమిటి ? కొత్త కొత్త ఫ్యాక్ట
మిల్లులు కట్టిస్తున్నారా ? పశుక్షేత్రాలూ, తేనె పరిశ్ర
బాగా పెంపొందాయనుకొంటాను. అవునా ?"

ఇతనేదో దేవతలాగ వున్నాడు.

సరే ఇంక వెనకాడి లాభంలేదు. అందుకని మన గవర్నరు తన వ్యవహారాన్నంతా విప్పాడు. విషయం సాగిన కొలదీ అసహ్యాం ఎక్కువైంది. అలాగ ఇలాగ; ఇదీ అదీ. తా నెంత కీడుచేసినా దమ్మిడీ ఎత్తు మేలుకూడా జరగలేదు. దత్తమండలం ససేమిరా బాగుపడనంది. అదీ అక్కడి సంగతి.

కొత్తగవర్నరు దొరగారు చలించలేదు.

"దయచేసి మరొకసారి అంతా వివరిస్తారా?"

"ఇదిలాగ అదలాగ. నేను నిజమైన కీడుకలిగించలేక పోయాను దొరగారూ!"

"ఏమిటి మీరు మాట్లాడుతున్నది?"

ఇద్దరూ లేచారు. ఒకరి నొకరు చూసుకొన్నారు. చాలాసార్లు తానుకూడా ఇలాగే తన పూర్వపు వాళ్ళతో చెప్పిన సంగతి కొత్త గవర్నరుకు జ్ఞాపకం వచ్చింది.

అది జ్ఞాపకంరాగానే నవ్వువచ్చింది.

"అదా! అదిప్పుడు మానేశాం. తెలిసిందికాదూ. ఈ రోజుల్లో కీడుచేసేదిలేదు. మేలు ఒక్కటే చేస్తున్నాం. ఇంతకీ నదిలోకి మురుగుతోలి నీరు తీయగావుండాలని ఆశించలేముకదా! దాన్నిగురించి మీ ముక్కుమీద గిలుకుకోండి"

మన గవర్నరుగారు స్వస్థానానికి తిరిగి వచ్చారు. అప్పటినుంచీ అతని ముక్కుమీద రెండు గీరలేర్పడ్డాయి. మొదటిది (పాతది) "కీడుద్వారా మేలుచేయి" అంటుంది. రెండవది (కొత్తది) నీ దేశానికి నీవు మేలుచేయాలంటే... ఆపైన వ్రాయడానికి అక్కడ చోటుచాలలేదు.

అయినా అప్పుడప్పుడు ఒక గీరను మరొక గీరగా పొర బడుతూ వుంటాడు అప్పుడు—

"వగరూ చేదూ
రెండిట మంచిది
ఏదీ కాదూ"

